# సచిత్ర రామాయణము

## (సుందరకాండ)

### ప్రథమ భాగము



నండూరి సత్యనారాయణ

This book is published
With the Financial
Assistance of Tirumala
Tirupathi Devasthanams
Under their scheme
Aid to publish religious books

''సుందరే సుందరోరామః సుందరే సుందరీకథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరంవనమ్
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం నసుందరమ్''



శ్రీ కరుటూరి సత్యనారాయణ బి. ఏ.

కృతికర్త

నా సహధర్మచారిణి

కీ। శే। శ్రీమతి కరుటూరి సుభద్రాదేవి

స్మృతికి సప్రేమముగా నంకితము

---

ఇది హృదయార్తి దూపిల రచించిన సుందరకాండ-మమ్ములన్
వదలుచు నాదయామయుని పాలిటి స్వర్గము చూఱఁగొంటివే ।
సుదతి ! గృహేందిరంబలెను శోభిలుచున్ గనుమూసినావె-నే
నదవదనంది నీ స్మృతికి నంకితముంటొనరింతు నీ కృతిన్

శోక తప్త హృదయముతో
కరుటూరి సత్యనారాయణ



కీ. శే. శ్రీమతి కరుటూరి సుభద్రాదేవి

కృతి స్వామిని



కళాప్రపూర్ణ
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# విజయాభినందనము

"స్వయము కవి యౌటలోఁ బ్రతిభాన మొకఁడు -
ఇతర కృతి మెచ్చుటను రసజ్ఞత యొకండు -
అంకితము గోరికొంట సౌదార్త్య మొకఁడు -
ఈ గుణత్రయ మేళన మీ్మెకవ్వరేచ్చ !''

పుష్కరము కాలము నాఁటి తేటగీతి-"చైత్రరథ" మన్న నా ఖండ కావ్య సంపుటి నొకదానిని 1976 లో, కవిమిత్రులు శ్రీ కరుటూరి సత్యనారాయణగారి చెలిమి గుర్తుగా వెలువరించితిని.

1980 పూర్వమే శ్రీ కరుటూరి వారు కావ్యకర్తగా లబ్ధప్రతిష్ఠులు. తిష్యరక్షిత, కరుణాసౌగతము, ఆమ్రపాలి - ఈ మూఁడుకావ్యములు వారివి బౌద్ధగాథానాథములు.

విద్వత్కవిశేఖరులు వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, కోపల్లె శివకామేశ్వరరావుగారు కరుటూరి వారి విద్యాగురువులు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి ప్రేమ పాత్రులు.

ఇఁక - శ్రీ కరుటూరి వారితో నాకు మూఁడు నాల్గు దశాబ్దుల పరిచయము, పరిచయ మాత్రము కాదు. నానాఁటికి ఉపచయ మందుచున్న నీరంధ్ర స్నేహము మాది.

కరుటూరి వారు వృత్తితః, 'అసిస్టెంటు కమీషనర్ ఆఫ్ కమర్షియల్ టాక్సెస్' ఉద్యోగము నిర్వహించిన వారు. చిత్తవృత్తి సహజముగా ఆంధ్రసాహిత్య గంధిలము. నిరంతర గ్రంథపఠనము, నిర వద్య పద్యనిబంధనము, సజ్జన సల్లాపము-ఇట్లు వేళానిస్సరణము. అను దినము కొన్ని పద్యములేని వ్రాయకుండ భుజింపని, కొన్ని పుటలేని చదువ కుండ నిద్రింపని వ్రతము కరుటూరి వారిది. ఇది నాకు మెచ్చుట గూర్చు నది. ఆయన పట్టభద్రత ఆంగ్లభాషా సంబంధియైనను, భారతీయమైన సంప్రదాయమునెడల నిర్నిద్రగౌరవాభిమానములు గల వ్యక్తిత్వము.

ఒకనాఁటి నిండు జవ్వనములో కరుటూరి వారు కయికొన్న కావ్యేతివృత్తములు ఆయన కరుణార్ద్రమనోవృత్తికి, అహింసాలక్షణము నకు తార్కాణములు.

కాఁగా, ఆజానజమైన రామభక్తి, రామగాథాసక్తి సంసర్గ బలముచే మఱింత పదను దేఱినవి. తొలి పుట్టువుల సంస్కార వశమున కరుటూరి వారు తలపెట్టిన 'రామాయణగాథా రత్నమాల' లో 'సత్య దర్శనము' మొదటి కూర్పు, 1981 లో వెలుఁగునకు వచ్చినది. ఆది మొదలు ఆశ్రమ సందర్శనము, పంచవటి, మైత్రీబంధము, సీతాన్వేషణ, క్రమశః ప్రచురితములై ప్రచారము గడించుకొన్నవి.

ఈ 'సుందరవిజయము' ఆ లెక్కలో ఆఱవ రత్నము. ఆఱు సర్గముల పద్యకృతి. సుందరకాండములో ప్రథమభాగమన్నమాట.

మొత్తము కావ్యమంతయు నిర్వచనమైన 'సర్గబంధము' గానే నిబంధింపఁబడుచున్నది. నిసర్గధారాకమనీయమైన కరుటూరి వారి తెనుగు పద్యము పలువురు ప్రముఖుల ప్రశంసలందుకొన్నది. నిరంతరాయమైన దీక్షతో ఒక మహా రచనను సాగించుచున్న సత్యనారాయణగారి కవిత్వ మును గూర్చి క్రొత్తగా ఎత్తి చెప్పవలసినది యుండదు.

ఆయన అంతరంగమువలెనే, తెలుఁగు పద్యము నిరాడంబరము, నిర్మలము, సుగమ సుందరము. ఈ సంవత్సరము (1987-1988) తెలుఁగు విశ్వవిద్యాలయము కరుటూరి వారి 'సీతాన్వేషణ' కు ఉత్తమ కావ్య పురస్కారము నొసంగుట ప్రసిద్ధము.

నిరపేక్షముగాఁజేసిన సత్కర్మకుఁదగిన ఫలము ఉండకపోదనుటకు ఇది యొక యుదాహరణము. వాల్మీకమున 'సుందరకాండము' అఱువది యెనిమిది సర్గములు కలది. ఈ సుందరవిజయము 'తొలిపాలు' న మూలమునందలి నలుపది సర్గముల గాథ పొందుపఱుపఁబడినది. ఆంజనేయుని సాగరలంఘనము, లంకాపురీ ప్రవేశము, సీతాన్వేషణ,

రావణగృహావేశణము, పుష్పక దర్శనము, మండోదరీ దర్శనమ హానుమంతుని నిర్వేదము, అశోకవనములో జానకీ సందర్శనమ రావణుడు సీతను ప్రలోభపెట్టుట, ప్రణయ ప్రార్థన, సీత రావణు తృణీకరించుట, సీతకు మాసద్వయావధినిచ్చి రావణుడు వెడలుట రాక్షసీ నిర్భర్త్సనము, జానకి నిర్వేదము, త్రిజటాస్వప్నము, సీత ఉద్బంధన ప్రయత్నము, హనుమజ్జానకీ సంవాదము, అంగుళీయక ప్రదానము, రామవృత్తాంత కథనము, హనుమత్సందేశము, చూడామణి నొసంగి సీత ఆంజనేయునంపుట-ఇది ప్రథమభాగములోని గాథ.

"సా రాజపుత్ర్యా ప్రతివేదితార్థః
కపిః కృతార్థః పరిహృష్ట చేతాః।
తదల్పశేషం ప్రసమీక్ష్య కార్యం
దిశం హ్యుదీచీం మనసా జగామ" ॥40 వ సర్గము 25 శ్లో.

ఇతః పూర్వము కరుటూరి వారు వెలువరించిన సత్యదర్శనాది సంపుటములలో అవాల్మీకములు కొన్ని యితరానుసరణములు, అల్పము లైన కొన్ని చేర్పు మార్పులు ఉన్నచో నుండవచ్చును. ఈ సుందర విజయము మూలరామాయణములోని తాత్పర్యమును యథోచితముగా అనుసరించుచున్నది.

శిష్టలోకమున 'సుందరకాండము' పారాయణ గ్రంథము. అనిర్వచ నీయమైన మహిమ విశేష సంపన్నము. మిత్రులు కరుటూరి వారి కిది తెలియును, స్వకపోల కల్పనలు చేయక వినమ్రభావముతో మూలము నందలి అర్థతాత్పర్యముల యడుగుజాడలలో పద్యములు నడపించుచున్నారు.

ఒక 'నిర్వచనోత్తరరామాయణము' తప్ప మన ఆంధ్ర సాహిత్య ములోవెలసిన భారత,భాగవత, రామాయణాది గ్రంథములకు చంపూరీతియే యింపు గొల్పినది. ఆధునిక కాలమున, మూడు నాల్గు నిర్వచన కృతులు ప్రసిద్ధములు ఉండవచ్చునుగాక। రామాయణము వంటి మహా

గ్రంథమున కెత్తుగడనెత్తునపుడు గద్యము యొక్క సహకారమును కవి వాంఛించక తప్పదు.

అట్లుకాక, కరుటూరి వారు పెట్టుకొన్న నిర్వచన నిర్బంధము పద్యము యొక్క బంధశైథిల్యమునకు క్వాచిత్కమైన కారణమగుట తటస్థించును. ఈ యిబ్బంది ఆయన గుర్తింపకపోలేదు. నిశ్చితైకాంత చిత్తముతో ఖడ్గధారా వ్రతముగా సర్గబంధ రచన సాగించుచున్నారు. ఇందులకు వారు అభినందనీయులు.

సరసధారాసుందరములగు కరుటూరి వారి పద్యము లెన్నేని యుదాహరింపవచ్చును. ఒండు రెండు మచ్చు.

"హనుమంతుండును శింశుపానిటపిశాఖాగ్రమ్ముపై నుండి యో
జన మున్గంగ మనోంతరమ్మున రఘుస్వామిన్ ప్రశాంతాననున్
ఘన వజ్రాంగదతారహారరుచిరక్వాణప్రభూతాంగునిన్
దనువుప్పొంగగ నేత్రపర్వముగ సందర్శించెఁబ్రీతాత్ముఁడై.
5 స॥ 77 ప॥

తియ్య తియ్యని పలుకుల తేనె లీను
చందమున, భీతినందని సరణి, నన్ను
విశ్వసించు తెలుంగున వెలఁది కిపుడు
రామసంకీర్తన మొనర్తు రమ్యఫణితి. 5 స॥ 80

ఇహపరతారకమైన ఈ మహాకావ్య రచనా క్రతువు నచిరకాలమున నిర్వహించి, విజయసుందరులై ప్రియమిత్రులు కరుటూరి సత్యనారాయణ గారు చిరయశోభాగ్యమును చేకొందురు గావుత మని ఆశంసించుచున్నాను.

రాజమహేంద్రవరం
16-6-1988
(నిభవ నిజజ్యేష్ఠ
శుద్ధ ద్వితీయా
గురువారము)

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి





# విజయసౌందర్యము

డా॥ వి. వి. యల్. నరసింహారావు, ఎం. ఏ. పి. హెచ్. డి.
డైరెక్టర్
ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం - పరిశోధనాలయం
హైదరాబాదు - 1

ప్రకృత గ్రంథము శ్రీ కరుటూరి సత్యనారాయణ కవి వరేణ్యుని 'సుందరవిజయ' మహా కావ్యమందలి ప్రథమ భాగము.

శ్రీమద్రామాయణమును తెనుగున పరమ రమణీయముగ నావిష్కరించుచు కతిపయ బహుమతుల నాదుకొనుచున్న కరుటూరి వారి విజయసౌందర్యమున కీ "సుందర విజయము" అచ్ఛదర్పణముగా నున్నది.

రావణునిచే లంకయందు చెరపెట్టబడి యున్న సీతాదేవికి కవి ప్రయోగించిన ఉపమలు కావ్య తత్త్వవిదులు గురుతుంచుకొనదగినవి. సీతమ్మ - "భస్మచ్ఛన్నవహ్ని" వలె నున్నదట। 'సంశయాస్పద స్మృతి' వలె నున్నదట। 'పడట గనియు నంపద' వలె నున్నదట। విశ్వాస రహిత శ్రద్ధ వలె నున్నదట। 'పాడైన కార్యసిద్ధి' వలె నున్నదట। 'కలుషమైన బుద్ధి' వలె నున్నదట। 'అపవాదమున బోవు యశస్సు' వలె నున్నదట! 'జలద సంఛన్న నక్షత్ర మండలము' వలె నున్నదట! 'వివరణ మరచిన విద్య వలె' నున్నదట। అట్టి సీతను చక్షపడి ఆంజనేయుడెట్లు గుర్తించెనట? ఆ గుర్తించుట ఎట్లున్నదట?

పండితుడు సంస్కార రహితు వచనములను ఎట్లో కష్టపడి బోధపరుచుకొన్నట్లున్నదట. (పుటలు 138, 139)

ఇచ్చట వాల్మీకుల హారి సంస్కృతమూలమిట్లున్నది.

సంసక్తాం ధూమ జాలేన శిఖా మివ విభావసోః ।
తాం స్మృతీ మివ సందిగ్ధా మృద్ధిం నిపతితా మివ ॥

విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ ।
సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషా మివ ॥

అభూతేనా ఒపవాదేన కీర్తిం నిపతితా మివ ।
రామోపరోధవ్యథితాం రక్షోహరణ కర్శితామ్ ॥

అబలాం మృగ శాబాక్షీం వీక్షమాణాం తత స్తతః ।
బాష్పాంబు పరిపూర్ణేన కృష్ణ వక్రాక్షి పక్ష్మణా ।
వదనేనాప్రసన్నేన నిశ్శ్వసంతీం పునః పునః ।
మలపంకధరాం దీనాం మండనార్హా మమండితామ్ ॥

ప్రభాం నక్షత్ర రాజస్య కాల మేఘైరివావృతామ్ ।
తస్య సందిదిహే బుద్ధి ర్ముహు స్సీతాం నిరీక్ష్య తు ।
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ ।

దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్ ।
సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్ ॥

(సుం. కాం. 15 స - 32-39 శ్లో)

రామాయణ కథా హృదయమును, పరమార్థమును శ్రీ కరుటూరి వారు - పండితుడైన ఆంజనేయుడు సీత నన్వేషించిన రీతి నన్వేషించి గుర్తింప గలిగినారు. కనుకనే కావ్యము రాముని సన్నిధికి చేరిన సీత వలె - నివురు గప్పని నిప్పువలె, సంశయ రహితస్మృతి వలె, ఫలమునకు వచ్చిన సంపద వలె, విశ్వాసముతో గూడిన శ్రద్ధ వలె, సిద్ధినందిన కార్యము వలె, అకలుషమైన బుద్ధివలె, అపవాదమెరుగని యశము వలె, మబ్బులు గ్రమ్మని నక్షత్రమండలము వలె, వ్యాఖ్యా రమణీయమైన విద్య వలె నున్నది.

శ్రీ కరుటూరి పండితుడు సంస్కార సహిత రామాయణ మహా వాక్యములను హృదయగతము గావించుకొని సహృదయ హృదయంగమ ముగా నావిష్కరించెను.

కనుకనే ఈ సత్కృతి కరుటూరి సుందర విజయముగా సార్థకమైన దని సంభావించుచున్నాను.

'సుతరాం ఆద్రియతే ఇతి సుందరమ్' అని లింగాభట్టీయ వివరణము. హృదయము దేనియందు ఆదరభావము వహించునో అది సుందరముగా కన్పట్టును. రామాయణ సుందర కాండకు వాల్మీకులు ఆ పేరు పెట్టుటలోని పరమార్థ మేదియో, కరుటూరి వారు తమ కావ్యమునకు 'సుందర విజయ' మని పేరుపెట్టుటలోని పరమార్థము నదియే.

కనుకనే ఈ తెనుగు రామాయణమును కరుటూరి వారి విజయ సౌందర్యమునకు నిదర్శనమైన "ఆదర్శ" మని పునరుద్ఘాటించుచున్నాను.

హైదరాబాదు
21-6-1988.

ఇట్లు
పి. వి. నరసింహారావు



# వక్తవ్యము

ఈ సుందరవిజయము (సుందరకాండ) ప్రథమభాగము నా సీతాన్వేషణ కావ్యము తరువాత కథనుండి ప్రారంభమగును. ఇది రామాయణాంతర్గతమగు సుందరకాండ సంబంధి. ఇందు హనుమంతుడు రామాజ్ఞననుసరించి వానర రాజగు సుగ్రీవునిచే నియుక్తుడై సీతాదేవి నన్వేషింప శతయోజనాయత సాగరమును లంఘించి లంకలో ప్రవేశించి లంకాపురాధిదేవత నోడించి సీతాగవేషణమునకై లంకా నగరమంతయు, రావణదైత్యుని సౌధములతో సహా గాలించి ఎంతకు కానక అశోక వనములో జానకిని కనుఁగొని యామెకు శ్రీరామచంద్రుఁడొసఁగిన ముద్రిక (అంగుళీయకము) నిచ్చి, రామలక్ష్మణ సుగ్రీవుల కుశలవార్తలను దెలిపి ఆమె కడనుండి శిరోరత్నమును రామున కభిజ్ఞానముగా పొంది, సీతా సందేశమును శ్రీరామచంద్రునికి తెలుపుటకు సీతను వీడ్కొని చనెను.

"సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం నసుందరమ్"

సుందరకాండమునం దభివర్ణితుఁడగు శ్రీరాముఁడు సుందరుఁడు. కథ సుందరము. సీత సుందరి. వనము సుందరము. కావ్యము సుందరము, హనుమంతుఁడు సుందరుఁడు, మంత్రము సుందరము, ఈ సుందరకాండలో సుందరము గానిదేమున్నది అని సౌందర్యారాధకులగు నభియుక్తులు వచియింతురు. రామాయణ కావ్య కల్పకమునందు సుందరకాండ యొక పవిత్ర కాండమని ప్రశస్తిఁగాంచి పారాయణ యోగ్యతఁబడసినది. (సుష్ఠు ఆద్రియతే ఇతి సుందరః) లెస్సగా ఆదరింపబడునది గాన నిది సుందరమైనది.

"సీతాయాశ్చరితం మహత్'' అని వాల్మీకి చేయెత్తి చాటిన పవిత్ర వాక్య తత్త్వమును, వాల్మీకి మహర్షి యొక్క మహా సంకల్పమును దాని పరిపూర్ణ పరిణతియు నిందే ప్రస్ఫుటమగును. అగుటచే దీనికీ పేరు వచ్చినది.

ఈ కార్యమును నాసహధర్మచారిణియైన కీ॥ శే॥ శ్రీమతి కరుటూరి సుభద్రాదేవి స్మృతికంకితము సేయుచున్నాను. ఈ కావ్యమును సహృదయతతో తిలకించి విజయాభినందనము నందజేసిన కళాప్రపూర్ణ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి, విజయసౌందర్యమును ప్రసాదించిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం పరిశోధనాలయం డైరెక్టరుగారగు డాక్టర్. వి. వి. యల్. నరసింహారావు ఎం. ఏ. పి. హెచ్. డి గారికి నా హృదయ పూర్వక సమస్సుమనస్సులు. గ్రంథ ముద్రణ కార్థిక సహాయము నొనరించిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారులు శ్రీ Ch. వెంకటపతిరాజు I. A. S. గారికి, పౌర సంబంధశాఖాధికారులు డాక్టర్. రావుల సూర్యనారాయణమూర్తి M. A. D. Litt గారికి, సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు M. A. గారికి నా సవినయ ప్రణామసుమహారములు.

గ్రంథముద్రణ నందముగా తమ సరస్వతీ పవర్ ప్రెస్‌లో చేయించిన సహృదయులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికి. కావ్యముఖచిత్రమును చిత్రించిన శ్రీ బుద్ధా సత్యనారాయణగారికి నా కృతజ్ఞతలు. నాకు మార్గదర్శకులుగా నుండి యితోధిక సహాయమునందించుచున్న మహాస్వమిత్రులు, మహాకవులు కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి నాహృదయ పూర్వకాభివందనములు.

కరుటూరి సత్యనారాయణ

# సుందరవిజయము

## ప్రథమ సర్గము

శ్రీ పృథ్వీతనయా గవేషణకు సుగ్రీవుండు పుత్తెంచఁగా
కూపారమ్ముఁ దరింప వాయుజుఁడు సంకోచింపకే విక్రమం
బేపారన్ దనదేహమున్ బెనిచి ప్రావృట్కాలమేఘోద్ధతిన్
జూపట్టెన్ విరివిన్ మహేంద్రగిరిపై స్ఫూర్తిన్ విడంబించుచున్ 1

సరసీజాక్షుఁడు రామచంద్రవిభు నాజ్ఞా బద్ధుఁడై తద్గిరిన్
హరిలోకేశ్వరుఁ డంబురాశి గడవన్ వ్యాసక్తుఁడై యోజనా
పరుఁడై చెంతను శాద్వలస్థలులపై వాహ్యాళిఁ జేయన్ వనే
చర బృందమ్ములు మారుతింగనుచుఁ జేష్టాశూన్యతన్ వర్తిలెన్ 2

ధరణీనందన సీత ముచ్చిలుచు నౌత్కంఠ్యమ్మునన్ రావణుం
డరిగెన్ లంకకు - దాఁచె నామె నటనే వ్యగ్రుండుగా - జానకీ
విరహంబందున మున్గి రాఘవుఁడు నిర్వేదించుచున్ దుఃఖసం
భరితుండై పనిచెన్ సమీరతనయున్ భామన్ గవేషింపగన్ 3

మదమాతంగము లద్రికాననములో మట్టాడగా వావిలో
బొదలెన్ బావని మత్తవారణముగా - పూన్కిన్ గిరీంద్రమ్ముపై
మదిలో సాగర లంఘనమ్ము సలుపన్ మాన్యుండు సన్నద్ధుఁడై
విదలించెన్ దన బాహువుల్ తపితుఁడై విధ్యుక్తమున్ దీర్పగన్ 4

వానరుఁడయ్యు వాయుజుఁడు స్వామి రఘూత్తము కార్యభారమున్
బూనుచు మస్తకమ్ముపయి పెంపెసలారుచు నన్యులెవ్వరున్
గాని యొనర్పఁగష్టమగు కార్యము సేయగ సాహసించెఁ దాన్
భానుజు ధన్యుఁ జేయగ విపత్తును జూడక లక్ష్యసిద్ధికై 5

"పోటరియైన రాక్షసవిభుండొక తుంటరి - మూర్ఖుఁడై నిరా
ఘాటముగా నయోనిజను గర్వముఁ గామముం బట్టి దొంగిలెన్
సాటి నృపాలసంతతిని సాహసమున్ బలమున్ గణింప కా
రాటమునందుచున్ పరమరాక్షసతత్త్వము సంచడింపఁగన్ 6

రాయఁడు జన్మమొందెను పులస్త్యుని పౌత్రునిగా - తపంబులన్
జేయ విధాత మెచ్చి దయచేసె వరంబులఁ బెక్కు - రావణుం
డా యవనీప్రసూతిఁగొనె నబ్బురమందగ సర్వలోకముల్
'ఛీ' యని నిందఁజేసి నిరసించినఁగూడ గణింపకెమ్మెయిన్ 7

పంతముఁబూని రాఘవుని పత్ని హరించెను చోరుఁడై పదిన్
స్వాంతమునందుఁ దానొక విశాంపతి పన్ను దురూహతోడ ని
శ్చింతగ లంకలో నిలిపె సీతను కామము కప్పుఁగప్ప నా
వంత తలంపకెయ్యది దశాస్యుఁడ భేద్యము లంక యంచెదన్" 8

అని తర్కించుచు మారుతాత్మజుఁడు దీర్ఘాలోచనన్ గార్య సా
ధనకై మార్గముఁ జూడ లంకదెస సంధానించుచున్ దృష్టి వా
ర్ధిని లంఘించు ప్రయత్నమున్ సలుప పూరింబోవుచున్ మేనుఁ బెం
చెను కొండంతగ వేయి యేనుగుల వాసిన్ బల్మి పెంపారఁగన్ 9

వైడూర్యకాంతుల తోటి శాద్వలములు
క్షితిధరమ్మునఁ గగ్గి చెలువ మెసఁగ
వానిపై విహరించు వాయుపుత్త్రుఁడుఁ గేస
రములు నిక్క భయంకరముగ సాగు

మృగరాజువలె నుండె . ఖగములు, జంతువుల్
గజగజలాడి తోఁకలను ముడిఁచె
రమణీయసువర్ణశిలాఖండములు [illegible]త్ర
పర్వముగాఁ దోఁచెఁ బర్వతమున

సొంపుల నుందు దివ్యవస్త్రములు, భూష
ణములు ధరియించి తను విలాసముగ సతత
యక్ష కిన్నర నాగ విద్యాధర సుర
సాధ్యచారణ గంధర్వ చయము తిరుగు 10

హనుమ విపుల వక్షముఁదాఁకి పవనిజములు
కొన్ని కూలెను - మృగములఁగొన్ని యతఁడు
సంహరించెను స్వయముగా సింహమువలె
తన బలమ్మెంత పెరిగెనో యని యెఱుంగఁగ 11

వివిధ గైరిక ధాతువుల్ వెలయుకతన
వివిధ వర్ణ సంయుతముల నవకముగను
గోచరించుచు నుండెను గోత్రమంత
చూపఱకుఁ గనువిందుగా శోభమిగిలి 12

శిరము, గ్రీవముఁ బైకెత్తి చెలఁగె నాతఁ
డొక మహోక్షము చొప్పున నుద్ధృతముగ
సింహనాదముఁ గావింపఁ జెదరి, బెదరి
తరలిపోయిరి వనదేవతలు భయపడి 13

ఆహార సంగ్రహణార్థమ్ము గుహావీడి
చనుదెంచు కేసరి చందముగను
భాసించె మారుతి - భాస్కరు, వాసవు,
స్వామిని, బ్రహ్మను, సర్వభూత
ములను దోసిలియొగ్గి మునుకొని ధ్యానించె
తరువాత తూర్పుగాఁ దిరిగి తనకు
జన్మనిచ్చిన తండ్రి స్మరియించి విక్రమో
ద్ధతిఁ బెంచ సాగరోత్తరణమునకు

యామ్యదిశకేగఁ నతడు ప్రయాణమునకు
సిద్ధమై పర్వకాలాన సింధువువలె
మేను నత్యంతమును బెంచె వానరులట
విశ్వరూపముఁ దిలకించి వెఱఁగుపడగ 14

ప్లవగ వీరులు పరికింప వార్ధి దాఁట
నిశ్చయించెను మారుతి - నిస్తులుఁడగు
రఘునరుని యభ్యుదయము పరాయణముగ
సర్వసమయమ్ము లందున సాగుచుండ 15

మితిలేని శరీరముతో
కుతుకముతోఁ గడవగా నకూపారమ్మున్
కుతిల పఱచెఁ గాల్సేతుల
మతి మంతుఁడు భూధరమున మట్టాడుచునే 16

హనుమంతుని పదఘట్టన
మునను ధరాధరము వణఁకె, భూరుహములు రా
ల్చెను సర్వ కుసుమప్రచయము
హనుమయు నొక పుష్పదేహియై కనిపించెన్ 17

పాదపమ్ములు రాల్చిన ప్రసవచయము
గుట్టలుగ, గుట్టలుగఁబడి నెట్టుకొనుచుఁ
బరిమళమ్ములు వ్యాపించెఁబర్వతమున
కొండదీపించె నొక పూలకొండ వోలె 18

బలశాలియైన మారుతి
మలఁగ నచట మదపుటేన్గు మదధారలటుల్
మల యొలికించెను పరువడి
సలిలము తత్పీడనమునఁజదియఁబడి వెసన్ 19

తెల్లని, యెఱ్ఱని, పచ్చని
నల్లని రేఖల మహేంద్రనగమెసలారెన్
కొల్లలుగా నుపలమ్ములు
చెల్లాచెదరగుచుఁబడె విచిత్రపురుచులన్ 20

ధూమ్రతో నిండి వీతిహోత్రుండు పొగలు
చిమ్మినటు గిరీంద్రము మణిశిలను గూడి
పెద్ద చట్టుల విరజిమ్మె వింతవెలుగు
సంతరించుచు భూధర సానువులకు 21

ఇంతగానని చెప్పలేనంతగను, శ
రీరమును బెంచె రక్కసితేని లంక
వైపునకు దృష్టి సారించి బాహువులను
నిసరి పరవశ్యు త్రొక్కె నవిరతి నతఁడు 22

తనుకు ప్రాణుల రోదన ధ్వనుల తోడ
నిండిపోయెను దిశలు, క్షోణియు, వనములు
గమ్యమెఱుఁగక పరువెత్తెఁగాననమున
నాపదకు హేతువేదియో తోఁప కలఁత 23

బడబడ క్రిందికిన్ దొరలు బండల నందులనుండియున్ బయ
ల్పడెఁ గనకమ్ముఁ బిత్తళము, రాగియు, వెండియుఁ దోసతోసటన్
దడబడి ధ్యానమందుగల తాపస కోటి సమాధి భంగమై
సుడివడి లేచి ప్రక్కలకుఁ జూచిరి కంపిత మానసమ్ములన్ 24

పదముల యొత్తిడిన్ బగిలి పైఁబడు ప్రస్తరరాజి వ్యాళముల్
గొదకొని దంష్ట్రిలన్ గఱవ గొబ్బున నగ్నులుప్పట్టె మంటలన్
గొదవడి గొప్పచప్పుడులు గుండెలఁ బల్లటమందఁ జేసెఁ
రదము హరించు నోషధులు రాజిలినన్ గిరి వ్యర్థమై చనెన్ 25

భూతములు కోపగించుచు భూధరమును
బ్రద్దలొనరించుచున్నట్లు భ్రమపడుచుఁ ద
పస్విజనములు ఘోరశబ్దము లపూర్వ
మనుచు నిలిచిరి భయవిస్మయములతోడ 26

ఆపరంజి కలశములందున్న మద్యముల్,
కాంచన చషకముల్, నించు దొప్ప
లును, భక్ష్యభోజ్యములును, మాంసములు, ఖడ్గ
ములుఁ గేడెములుఁ బానభూమి విడిచి
సుందరాంగులతోడ శూన్యచిత్తమ్ముల
నెగిరిపోయిరి మింటికిరుమపడుచు
విద్యాధరులు - వారు వివిధ కుసుమ హార
ముల ధరించిరి - గంధములను బూసి

కొవిరి - తామర పూరేకులను హసించు
కన్నులందరుఁజేమ తోఁపఁ జెన్నుదక్కి-
హేతువెఱుఁగక యెంతయొ కాతరులయి
త్వరితముగఁ బాఱిపోయి రా ధరము వీడి 27

వారి కాంతలుఁగూడఁ బానమదమ్ముతో
భూషణమ్ముల దాల్చి పొలుపుమీఱ
నానంద పరవశలై యున్న సమయాన
నీ పరిస్థితి యిట్లు దాపురించె
పాపము! దానితో వారంద అలజడి
పడిరి - మునీంద్రు లంబరమునందు
నణిమాది సిద్ధుల నద్భుత శక్తులఁ
జూపుచు నిల్చిరి సొరిది వేడ్కఁ

బర్వతముఁజూడసాగిరి - భావితాత్మ
లగుమహర్షులు, సిద్ధులు నగము దెసగ
శ్వసన తనయుఁడు యత్నము సలుపుచుండ
నంబుధిఁదరింప రామ కార్యార్థకలన 28

ఈ యసాధ్య కార్యమ్మున కిచ్చగించి
రాఘవేంద్రుని కోసమై, రవిజువి కొఱ
కాతఁడీ పని యొనరించు భీతిలేక
యప్రమేయుఁడటంచనిరపుడు మునులు 29

"ఇతఁడు మరుత్సుతుండు గమియింపగ నుండె వియత్పథమ్మునన్
క్షితితనయాగవేషణము సేయ రఘూద్వహు సంస్పృహన్ మహా
మతి కడలిం దరింప పరమార్థముగా ధరమందునుండి, తా
ద్రుతగతి దీక్షతోడఁగొలఁదుల్ గమనింపక లంక దిక్కుగా 30

ఎఱిఁగి పయోధి సంప్లవన మెంతటి దుష్కర కార్యమో, ధురం
ధరుఁడయి మారుతాత్మజుఁడు ధాత్రిజ నారయఁగోరి దానవే
శ్వరు పుటభేదనమ్మునకు సాహసికుండుగ నేఁగు నిప్పుడే
మెరమెరలాడు రాముడకు మేదినినందన జాడఁదెల్పగన్ 31

మేవడి కాఁడు దైవముగ మిత్రకులున్ దలపోయు, భూమిజన్
రావణుఁడాశ్రమాంగణమునన్ రఘువీరుఁడు లేని వేళ దు
ర్భావముతోడ నెత్తుకొని లంకకుఁజేర్చెను మోహబుద్ధితో
కావరుఁడౌచు పైన మెఱుఁగన్ దశకంఠుఁడు కూలకుండునే! 32

ప్రతిహతశత్రువిక్రముఁడు రాఘవుఁడారజనీచరాధిపున్
మృతునిగఁజేయు తప్పక సమీరకుమారుఁడు సీత యున్కిఁదా
హితమితవాక్కులందెలుప నీగతిఁ నీల్గగ లోకకంటకుం
డతిమితబాధలుందొలఁగ హర్షమునందు జగమ్ములన్నియున్" 33

అని మహర్షులు నుడువగ నాలకించి
భీతి యడఁగ విద్యాధరుల్ విస్మయమునఁ
దాముఁగూడ హనూమంతుఁ దన్మయముగఁ
జూడసాగిరి తమచెంత సుదతులుండ 34

ఆ కపిలోకేశ్వరుఁడు
ద్రేకముతో రోమములు విదిల్చె శరీరం
బాకృతిఁ బెద్దగ నున్న మ
హాకాయము విఱుచుకొని ప్రహాస మొనర్చెన్ 35

ఆ సమయమ్మునన్ హనుమ యార్చెను బెల్లుగ వారివాహ గ
ర్జాసముదగ్ర రావమున రమ్య సుదీర్ఘపసీంవాలమున్
వాసిగ వైనతేయుఁడు విపన్నముఁ బట్టి విదుర్చురీతిగా
హాసముతో విదిర్చెను వియద్గమనమ్మున కుద్యమించుచున్ 36

కాంతి ముఖమ్ము నందలమగాఁ బరితోషముఁ బొందుచున్ హనూ
మంతుఁడు, వాయునందనుడు మాంసల భూరిభుజుండు నా గరు
త్మంతుఁడుఁ బన్నగమ్ము నొగిఁ దన్నుకపోవగఁ గాళ్లక్రిందికిన్
వంతుగ వ్రేలు కైవడివి వాలముఁ బెంచుచు వ్రేలఁజేసెఁ దాన్ 37

చూపు మీఁదికి సారించి యేపు మిగుల
సంబరము నవలోకించి హనుమ ప్రాణ
ముల నెడఁద నణగించి సముద్ర లంఘ
నమున కుద్యుక్తుఁడయ్యె నా నగమునుండి 38

వాయుపుత్త్రుఁడు మహా పరిఘసదృశబా
హువులను స్తంభించి సవర చేసి
కడుపక్కళించుక కాళ్లను ముడిఁచెను
భుజముల సహితము ముడుఁగఁజేసి
తన సత్త్వమును, దేజమును, వీర్యమునుఁ బూన్చి
కనులెత్తి దూరమ్ముఁగాంచి, వదన
మును బిగబట్టెను. పొలుపుగాఁ బాదమ్ము
లూఁది త్రొక్కుచుఁ జెవులోరఁజేసి

కొని నమోవచనమ్ముగఁ గుతుకమున, శి
రమును వంచుచు వినయపూర్వకముగ నిగ
డించె హరివృద్ధులను బొడగాంచి మ్రొక్కి
మేను పొంగ నుత్సాహము మిన్నుముట్ట 39

"వానరోత్తములార ! పయనమై లంకకుఁ
జనుచుంటి దశరథ తనయ హస్త
చాపవినిర్ముక్త శరము కైవడి, నట
జానకి యుండిన సరియె, లేద

ఆ త్రోవనే పోదు నమరలోకమునకు
నచటఁగన్పడకున్న నరుగుదెంచి
కినుక లంకను బెల్లగించి తెచ్చెద దశా
స్యునిఁదోఁకటుం జుట్టి మునులు, సురలుఁ

దనియ బంధించి స్వామి పాదముల మ్రోల
నేను పడవైతు తప్పక నీరజాక్షి
సీత దొరకును రఘువీరు చింత తొలఁగ
ముదము నొందును పోయి వచ్చెదను - సెలవు" 40

అనుచు సమీరజుఁడాకాశ వీథికే
యాలంబనము లేక యరీతి నెగిరె
చారణ సంచార సరణిలోఁదానె సు
పర్ణుఁడే యన్న భావమ్ముతోడ
ఆతని వేగమ్మున కద్రిపై గల పాద
పమ్ములు నతనితోఁబైకి లేచె
వృక్షములందున్న పక్షుల, సుమములఁ
దొడల వేగమ్మునఁ దోడఁదీసి

కొనుచుఁబోయెను - కుజములు, జనులు, బంధు
వులను సాగనంపుచు వారి సెలవు నడిగి
వెనుక కేతెంచు వడువున హనుమను విడి
సాగరమ్మునఁబడిపోయెఁ జదలనుండి 41

ఆగముపైనున్న మహావృక్షములును సే
నాపతిన్ సైనికుల్ నమ్రులగుచు
ననుసరించు విధాన హనుమతోఁ బోయెను
తలపించె నతఁడు భూధరమువోలె
వింతగా విరిసిన వృక్ష సంతతులతో
వాసవుఁగని భయభ్రాంతములగు
నగములవలె భారముగనున్న తరువులు
లవణోదధింబడె – ప్రసవదళము

లంటుకొనె నాతని శరీరమందు వివిధ
వర్ణసుమముల, మిణుగురుల్ పరఁగనిండి
యుండిన ధరాధరమ్మటు లుండె నతఁడు
పూవులన్ రాలిపడెను సముద్రమందు 42

దుసికిలు పుష్పసంచయముతోడ మహోదధి నిండి తారకల్
పొసఁగిన వ్యోమసీమవలెఁ బొల్పెసలారెను. మేని నింక ను
న్న సుమములన్ విలాసముగ నర్తనమాడు మెఱుంగు తీవలన్
మసఁగెడి నీలమేఘమటు మంజులమై కనిపించె నాతఁడున్ 43

అకసమువందుఁ జాచిన హనుమ బాహు
లద్రి కొననుండి వెలువడు నయిదు ముఖము
లున్న రెండు సర్పములటులుండెఁ జేతి
వ్రేళ్ళఁ బురుడించె పాముల నోళ్లభంగి 44

కాంతిసంపన్నుఁడగు మహాకపి తరంగ
సంయుత సముద్రముమ ద్రావు సరణిఁదోఁచె
నంబరపథమ్మునం బోవు నవసరమున
దానినే మ్రింగివేయు చందముగ నుండె 45

మెఱపులటులున్న కన్నుల యొఱపుఁ జూడ
పర్వతముపైవి వహ్నుల పగిదినుండె
నేక కాలాన నవి యుదయించు సూర్య
చంద్రులను బోలియుండె నాశ్చర్యమొదవ 46

అరుణ నాసమ్మును, నరుణ ముఖమ్ము సం
ధ్యారాగ సమయ బాలార్క బింబ
సదృశమ్ముగా నుండె, సవరిల్లు వాలమ్ము
నింద్ర ధ్వజమ్ముగా నింపు మిగిలె
నా వాల వలయమ్ముతో వాయుజుఁడుఁబరి
వేష మధ్యగతుఁడు పూషుఁబోలె
నెఱ్ఱని పిఱుదులు నెసలారె గైరిక
ధాతువుల్ గల మహీధరము భంగి

నుండె నెగురంగ గాలి వాయుసుతు కక్ష
లందు దూసుక పోవుచు నభ్ర ముఱుము
చందమునఁదోఁచుచుండెఁ బుచ్ఛమ్ముఁబంక్తి
కంధరుని ధూమకేతువుగా నగపడె 47

ఆకాశమ్మునఁదిగ్మరశ్మి కరణిన్ యానమ్ముఁ గావించుచున్
మోకల్ కట్టిన సామజంబు వలె సొంపుల్ వోయె వాలమ్ముతో
నేకాగ్రుండుగ వ్యోమమందరుగఁదానేచెన్ బ్రతిచ్ఛాయయున్
నౌకంబోలుచు సాగరోదకముపై నట్టాడు నట్లుండఁగా 48

అంబరవీథిని హనుమంతుఁడరిగిన
యంతదూరమ్మును నతనివేగ
తీవ్రతతో నుదధియును నున్మత్తమై
గంతులు వైచుచుఁ గానిపించె

అసలె యెత్తుగలేచు నలలు పావని వక్ష
మునఁబుట్టు గాలితో బూరగిల్లి
మేఘమండల మంటి మిట్టిమిట్టి పడుచు
వారిదమ్ములఁబుట్టు పవనము హను

మాను జవమున నుదయించి మల్లడి గొను
గాలియును గొప్ప ధ్వనితోడఁగదలి నెంతొ
యుల్లకల్లోల మొనరించె నెల్లకడలఁ
జుట్టలై లేచి పడె వాయుసూతి వెంట 49

ఆ వెంటనంటుట ద్యావాపృథువులను
నిట్టలమ్ముగ నబ్ధి బెట్టిదముగఁ
జుట్టబెట్టెడి రీతిఁజూపట్టె సామీరి
వాయువేగమున దొప్పలుగ లేచి

జలములు మేఘమండలముతోఁ గలిసి స్వ
చ్ఛమగు శరత్కాల జలదములటు
దర్శనీయమ్ముగఁ దరళాయితమ్మయ్యెఁ
గెరటములందుండి క్రిందపడిన

జలచరమ్ములుఁ దోఁచె వస్త్రరహిత నరు
లటుల, నాకాశపథమున నరుగు హనుమ
నరసి సాగరమందున్న వ్యాళచయముఁ
గలఁగె భీతిని గరుడినిగాఁ దలంచి 50

మేరుమందర నగములమించి కడలి
యందు లేచిన భంగము లతఁడు లెక్క
పెట్టుచున్నట్టు లుండెను వేడ్కమిగుల
తీవ్ర జవమున నరుగు కపిప్రవరుఁడు 51

అంతటను నరుణారుణ మగుచుఁ బొలయు
వాలమూలమ్ముతోఁ గపివరుఁడుఁ బేర్మి
కుదలునట్టి జేగురు రాతి కొండరీతి
చెలువ మొప్పారగాఁ బ్రకాశించె నపుడు 52

వేగముగ వియత్పథమున నేఁగు వాయు
నందనుని నీడ పదియోజనముల వెడలు
పునను, ముప్పది యోజనమ్ముల నిడివిని
గలిగి నీటిపై యెంతొ సొగసుగ సుండె 53

ఉప్పునీటిపై వ్యాపించి యున్న పవన
సూను ననుసరించెడి నీడ సుందరముగ
నీలమేఘమాలికవోలె నెగడి దర్శ
నీయముగ జలరాశిఁ గన్పించె నపుడు 54

ఆ మహాకపి పెద్దదేహమ్ము గొప్ప
తేజమున విరాజిల్లుచు దీప్తిమిగులఁ
బొలిచె ఱెక్కల పర్వతమ్మువలె వాయు
సరణిలో నబ్ధి దాఁటెడి సమయమందు 55

ఏ మార్గమును బట్టి యేఁగు చుండెనొ కపీ
శ్వరుఁడా పథమ్మువ వనధి దొప్ప
పడివల్లగుచు నుండె సుడివడి జలములు,
పక్షుల గుంపులో పడినవేళ
వినతాసుతుని భంగి కనుపండువుగ నుండె,
శ్వసనుని రీతి నభమ్మునందుఁ
జెదరగొట్టుచు నుండె జీమూత పటలమ్ము
నంబుదమ్ముల మాటు కరిగి మరల

బైటి కరుదెంచుచును మబ్బుచాటు నుండి
వెలుపలికి వచ్చు చంద్రునివలెఁ గనఁబడె
నా చెదరగొట్టినట్టి మేఘాళి యెఱుపు,
నలుపు, తెలుపు. కషాయ వర్ణములఁబొలుచు 56

అతఁడు రామకార్యార్థమ్ము వ్యోమ మా
        ర్గమ్మునఁ జనుచుండ ఖరకిరణుండు
తపియింపమానెను తన తీక్ష్ణ కిరణమ్ము
        లను, వాయువెంతో చల్లగను వీచె

పరమర్షు లాతనిఁ బ్రస్తుతించిరి, దేవ
        తలును, గంధర్వులుఁ దన్మయులయిరిఁ
గుసుమవర్షమ్మును గురిపించి రాదట
        నెగురు మారుతిఁ గాంచి గగనమందు

యక్షచారణ నాగ సిద్ధాసురులును
విస్మయమ్మునఁ జూచిరి వేడ్కపడుచు
సాగరుఁడుఁగూడ హనుమకు సాయపడగ
నెంచె - లేకున్న జగము నిందించు ననుచు 57

ఇక్ష్వాకు వంశాభివృద్ధిఁ గోరి సముద్రుఁ
        డిట్లని తలపోసె "నిపుడు నేను
రామకార్యమునకు లంకకుఁ జను వాన
        రోత్తమునకు సాయమొనరుపఁదగు
సగరుఁ డిక్ష్వాకు వంశపురాజు, వర్ధిల్లి
        చేరితి నీ గొప్ప స్థితికి - హనుమ
రామచంద్రుని మంత్రి రాముఁడిక్ష్వాకు వం
        శ్యుఁడు - మంత్రి యాయాస పడగ రాదు

ఆతనికిఁ గొంత విశ్రాంతి యవసరమ్మ
కార్యసాధన కిదియ ముఖ్యమ్మ, గాన
విడిది యేర్పాటుఁ జేసెద విశ్రమింప
రామకార్య నిర్వహణము రహిఁజెలంగు

అని తలంచుచు నీట నణఁగియున్న హిరణ్య
శృంగుడు మైనాక శిఖరిఁజూచి
వాక్రుచ్చె "పర్వతేశ్వర ! నిన్ను బలవైరి
పాతాళ రాక్షసుల్ పంతగించి
పైకిరాకుండ విల్వగఁజేసె నవరోధ
ముగ వారు భూలోకమునఁ జొర జత
నమ్మెనర్పగ నీవు నమ్మఁ జేసి యడంచి
తివి వారి కడక - క్రిందికినిఁబైకిఁ

నడ్డముగఁ బెరుగుటకు నీకమితశక్తి
కలదు కావున నొకపరి జలముపైకి
బెరుఁగవలె శీఘ్రముగ నీవు పేర్మిమిగుల
కలదు నీతోడ నవసర కార్యమొకడు

ఏపుగా నిన్నుఁ బ్రేరేపించుచున్నాను
లెమ్ము ! వేగమెపైకి సమ్మదముగ
కపివర్యుఁడును బరాక్రమవంతుఁడగు హను
మంతుఁడు వచ్చు నీ ప్రాంతమునకు

అతఁడు రామకార్యమును సాధింప భ
యంకర కృత్యము లాచరించు
కొనుచు నంబరమార్గమున వచ్చుచుండె, ని
క్ష్వాకులకును మేలు సలుపు హనుమ

కేను సాయమొసర్పఁగఁ బూనుకొంటి
హిమగిరి కుమార ! యిక్ష్వాకు నృపులు నాకు
పూజనీయులు కాన నా పూన్కికీవు
తోడుపడిఁ బైకిరాఁగదె తొందరపడి 60

ఇక్ష్వాకు వంశ్యుల నితఁడు సేవించును
నాకు మాన్యులు వారు – నీకుఁగూడఁ
బరమ పూజ్యులు సుమ్మ ! పనివేళ సాయము
చేయక తప్పదు – చేయకున్న
కోపమ్ము వచ్చును గుణవరిష్ఠా ! పెద్ద
లకు, నితఁడతిథి మాత్రమ్మె కాదు
పాపని నీమీఁదఁబడయు విశ్రాంతిని
లేవయ్య ! మైనాక ! లెమ్ము పైకి

నీ హిరణ్మయ శిఖరముల్ నిలయములగు
నమర గంధర్వజాతుల కనిశము కద !
హనుమ నీపైని శ్రమఁదీర్చికొని యరుగును
స్వామికార్యము నెఱవేర్పవలెను సుమ్మ ! 61

కిన్నరు, లురగులుఁ గెలఁపమ్ముతో విహా
రము సల్ప; గిరిశిఖరములు నంబ
రము రాయునట్లుండె రమ్యమౌ కాంచన
కాంతితోడను నీల గగనమెల్లఁ
గనకమ్ము బూసిన కరణి భాసింప నూ
ర్గురు సూర్యులుదయించు రుచివెలసెను
లతలు, వృక్షమ్ములు రమణీయముగ నుండె
చూచుచుండగ వింత సొబగు తోడ

పైకిలేచి విజృంభించు పర్వతవిభుఁ
గాంచి పావని యద్ది విఘ్నమ్మటంచు
వాత్యమేఘమును విదళించు భంగి రొమ్ము
తో నతనిఁ దాఁకి పడఁగొట్టెఁ దూర్వహలఁయుగ 67

ఆకాశమ్మున కంటుచున్ హనుమ నాహ్వానింపగా నిట్లు మై
నాకుం డవ్విధిఁ ద్రోయగాఁబడియు నానందించె రోమాంచమై
సౌకర్యమ్ముగఁ దీవ్ర వేగమున శిఖ్వానమ్ములోఁ దోషుచున్
దాఁకెన్ దన్నిటుఁ ద్రొక్కి కద్ది యుపరోధంబంచు దావించుచున్ 68

పక్షమాతమ్ముతోడఁ దత్పర్వతేంద్రుఁ
డదరిపడి ప్రస్థమొకింప యగలఁగొంక
వడికి చేయుచు హనుమంతు బలము నెంచి
యుక్కడంపడి క్షణకాల మబ్బెనిలిచె 69

ఆతఁడు మనుష్యరూపమున నంతటఁ దాశిఖరమ్ముపైని ని
ల్చి, తరలు మారుతాత్మజునిఁజేరి "మహాత్మ ! ననున్ ద్వదీయమా
రుతసమతీవ్రవేగమున రోషముతోఁబడఁగొట్టు శక్తికిన్
బ్రతిఁగసఁడోము నీకెచటఁ బావని ! నీబలమద్భుతంబగున్ 70

శాత్రవుఁడఁగాను నీకు నే మిత్రుడగుదు
నాశరుఁడ నంచు భావింప నగునె నన్ను
సంశయంబేల నే హిమశైలతనయుఁ
డైన మైనాకుఁడనె కాని యసురఁగాదు 71

నలిగితివీ ప్రయాణమున నా శిఖరమ్ముల విశ్రమింప నీ
యలఁత యడంగుఁ గొంతవడి కాపయిఁ బోవగవచ్చు రాము పూ
ర్వుల వలనన్ సముద్రునకుఁ బొంపిరి వోవగనయ్యె సందుచేఁ
బులకిత గాత్రుఁడౌచు నినుఁ బూజయొనర్పగ నెంచె మారుతీ ! 72

సగరపుత్త్రులు త్రవ్విరీ సాగరమును
సగరుఁడెంతో సమర్థుఁడౌ సార్వభౌముఁ
డాతఁడిక్ష్వాకు వంశజుఁడటులె రామ
భద్రుఁడుద్భవమందెఁ దద్వంశమందె 73

రాముని సహాయుఁడవు కాన నామతింతు
నాతిథేయ సత్కారము లందుకొనుము
ఉపకృతినిఁబొంది నీకుఁబ్రత్యుపకృతి నిపు
డాతఁడొనరించుఁగపివీర ! ప్రీతుఁడగుచు 74

ఇది సనాతన ధర్మము కద ! సముద్రుఁ
డే హనూమంత ! నన్నుఁ బ్రోత్సహించెఁగాన
జలధి గర్భము నుండి వెల్పలకు వచ్చి
నాఁడ ! విశ్రాంతిఁగొనిన నానందమగును 75

"నూరామడల సముద్రము
ధారాళముగా గమింపఁదమక పడుచు నీ
దారిని వచ్చుఁగపీశుం
డారటమును మాన్పిపంపు" మనె సాగరుఁడున్ 76

ఈ కడలిరాజు ప్రియపడి
నీకు బదులు తీర్చి మరల నీ పలన నతం
డాకాంక్షించెను గౌరవ
మాకారణమునను బనిచె ననఘా ! నన్నున్ 77

హాయిగ నేడఁదేఱుమిట నాకలికెన్నియొ కందమూలముల్
తీయగనున్న వాని గుఱితించుచు నే సమకూర్చినాఁడ నా
ప్యాయముగా భుజింపుము మహాబలనందన ! మాకు మీకునున్
బాయని బంధముల్ కలవు - బంధురభావముఁజూపిరాఁగదే ! 78

ప్రాజ్ఞుఁడైనవాఁడుఁ బ్రాకృతుఁడతిథిగా
వచ్చు నెడల గౌరవమ్ము తోడఁ
బూజసేయఁదగును ముఖ్యుఁడవగు నీవు
వచ్చునెడలఁజెప్పవలెనె వేఱ !

రాకరాక వచ్చి లోకప్రియార్థమై
అలసితొని యిఁక సమయింతభక్తి
సంబరముసఁబోవు సుస్వాగతాహ్వానము
నొసఁగుచుంటి మిప్పు డొప్పుకొనుము

దేవతలకందఱికి వాయుదేవుఁడనినఁ
బూజనీయుఁడాతని కీవు పుత్త్రుఁడగుదు
వతని వేగము నీవద్దె హనుమ ! నీకు
సేవఁజేసిన శ్వసనుఁబూజించినట్లె ! 79

ధర్మమెఱిఁగిన వాఁడ వుదార హృదయ !
అనుమతింపుము మా పూజలందుకొనగ
గౌరవింపుము నన్ను సాగరునిఁగూడ
నమ్మ ! పూజింప వేఱుకారణము కలదు 80

కృతయుగమ్మందున గిరులకు ఱెక్కలుం
డెడి వన్ని తిరుగుచుండెడివి గరుడ
వేగమ్ముతో, వాయువేగమ్ముతో సన్ని
దిక్కుల, మునులును, దేవతలును
బ్రాణికోటియు భయపడి పోవ నింద్రుఁడు
వజ్ర ఘాతమ్మునఁబర్వతముల
పక్షముల్ ఖండించె - వచ్చె నాతండు నా
పైకిఁగూడ భిదుర పాణి యగుచుఁ

గాని దూరముగా సదాగతి కరుణను
దీసికొని వచ్చి దిగఁబెట్టె నీ సముద్ర
మున - కలవు నాకు పెక్కులిప్పుడు సహితము
వాయుదేవుని రక్షణవలన నాకు 81

ఈ పక్షమ్ముల బలమున
నే పైకినిఁ గ్రిందికేఁగనేర్తును నిపుడున్
నీ పితృదేవు ఋణమ్మును
దీపారుచుఁదీర్ప మారుతీ ! యుక్తపడెన్ 82

మన మధ్య నిటులఁ గలిగిన
ఘన సంబంధమ్ము నెంచి గాడుపు చూలీ !
కొనుమా ! యాతిథ్యమ్మును
నను, సాగరుఁదృప్తి పఱుప న్యాయము కాదే ! 83

అలసటఁదీర్చుకొంచు హనుమా ! పరితోషముతోడఁ బూజలన్
గొలఁదిగ నెంచఁబోక గిరి కొమ్ములపై విహరించి, తృప్తిగా
వలసిన వెల్లయున్ మెసవి వత్సలతన్ బ్రకటించి ధన్యులన్
సలుపుము నిన్నుఁజూడగను సంతసమయ్యెను మాకు - రా వలెన్" 84

అనుచుఁబదింపది వేఁడగ
హనుమంతుఁడు ప్రీతినంది యభిమానముతో
ననె మైనాకునితోఁజ
య్యన నాతని పిలుపుఁద్రోసి యవశంబగుటన్ 85

"మీయాతిథ్యము స్వీకరించినటులే । మీ యాప్త వాక్యమ్ములన్
మీ యాంతర్యము గుర్తెఱింగితిని నెమ్మిన్ మిత్రులారా । ననున్
ధ్యేయమ్మున్ గమనించి రమ్మని నిరోధింపంగ రా దర్మిలిన్
గాయంబింతయు డస్సిపోవదిఁక నాకాంక్షింప నాహారమున్ 8

చేయఁదగిన పనికిఁజెందిన సమయము
తొందర పడఁజేయ డెందమందు
మాటనిచ్చినాఁద మావనేచరులకుఁ
గాన మధ్య నాఁగఁగాదు నాకు 8

ననుఁగోపింపగరాదు తొందరగ మైనాకా । చనంగావలెన్
దినభాగంబు గతించుచుండె నపుడే దీక్షన్‌గమింతున్ వృథా
చనరాదొక్క నిమేషమేనియును సంచారమ్ము సం" దంచు నా
తనిమేనున్ స్పృశియించి మారుతియుఁబ్రస్తావించి సాగెన్ వెసన్ 8

ఆ మైనాకుఁడు, సాగరుఁ
డా మహితునిఁబూజఁజేసి రాశీస్సులతో
వ్యోమగతునిఁబరికించుచు
క్షేమమ్మును, శుభముఁగోరి సెలవిచ్చిరాగిన్ 8

వారల నిద్దఱి వీడ్కొని
యారదమున నింగికెగిరె హనుమంతుఁడు ని
ష్కారణముగఁ గాలమును వి
హారమునకు వెచ్చపెట్ట కరగలిగొనుచున్

తన తలనున్న కర్తవ్యభారముఁదల
　　పెట్టి మాన్యుఁడు నాట విడుపుల నెటు
లాసించుఁగావున హనుమంతుఁడటుల మైె
　　నాకుని యాతిథ్య మీకతమున
చెలువుగాఁద్రోసి పుచ్చెను - వట్టివెంగలి
　　కాలేదు విశ్రాంతి కలుగు నన్న
వెంపరలాటతో విప్పుబంధము స్నేహ
　　పూర్వకమ్ముగ పదములకుఁజుట్టు
కొనఁబటాపంచ లొనరించి హనుమ చూపె
తన ప్రతిభ, దూరదర్శిత్వమును, బవిత్ర
దృక్పథమ్మను గార్యసిద్ధికిఁబ్రయత్న
మునఁబ్రదర్శించె నత్తఱి భూరిశక్తి　91

ఏ యాకర్షణకందక
ధ్యేయమునకుఁగట్టువడి తదేకనిరతిమైె
బోయెడి సమీరజుంగని
హాయిగ నిట్టూర్పు విడిచి రంబరచారుల్　92

ఆకాశచారులంతటఁ
బ్రాకటముగ మెచ్చుకొనిరి పవన తనయు న
స్తోకమ్ముగ స్తుతియించుచు
నీ కార్యముఁబూర్తి సేయు నీతండంచున్　93

చిఱునవ్వుల్ తొలఁకించి వాయుజుఁడు లేచెన్ యానముంజేయ నం
బర మార్గమ్మున చారణుల్ తిరుగుత్రోవన్ దీవ్రవేగమ్ముతో
పరులెవ్వారును చేయలేని పనికిన్ బ్రాగ్రేసరుండౌచు వే
గిరకాఁడై చను మారుతిన్ సురలు సంకీర్తించి రుత్సాహులై 94

ఉరురయమున శతయోజన
శరధిన్ దరియింపఁబూన సాహసమగుచో
గిరిపై నిలువక ముందున
కరుగుట దుష్కరమె ! దీని నతఁడొనరించెన్ 95

హిమవంతుని తనయుంగని
యమర విభుఁడు సంతసించి యభినందించెన్
సమధికముగ స్వాగతమును
నమరించితి పనిలజునకు నద్భుత ఫణితిన్ 96

నిర్భయముగ నూరామడ నింగియందు
నంబునిధి దాఁట రామకార్యార్థమతఁడు
ఇంత దుస్సాధ కార్యము నెటుల నిర్వ
హించునో యన్న భీతి వేధించుచుండె 97

క్ష్మాధరమ్ములకుఁబక్షములు నే ఖండించు
సమయాన శ్వసనుండు సాయపడుచు
నినుఁదెచ్చియిచ్చట నీరధిలో దాఁచె
నప్పటినుండి నీ నంబురాశి

లోమున్గి యుంటివి సామీరి ! సాగర
తరణమ్ము నేయ నధ్వమున నతని
కే యపాయము వచ్చునోయను భయముతో
మేముండ శిఖరము మీఁద నిలిచి

కొంత వడి నట విశ్రాంతిఁగొనుట కతని
రమ్మటంచుఁబిల్చితివి హిరణ్యనాభ !
స్వామి కార్యార్థమై పోవు సచివు నాఁపి
మంచి పనిఁజేసితివి నీవు మహిత బుద్ధి 98

గౌరవముగఁజేసితిని సత్కారమెలమి
సంతసించితి నభయమొసంగు చుంటి
స్పష్టమయ్యె సమీరజు బలపరాక్ర
మములు మైనాక ! నీ యభిమానగరిమ 99

ఇచ్చవచ్చినరీతి వర్తించు మింక
ధర్మబుద్ధిని హిమశైల తనయ ! హనుమ
పోవఁ గలుగు నూరామడల్ చేవఁగలిగి
భయమడఁగె నాకు నతని నాఁపంగ నీవు 100

అనుచున్ గద్గదకంఠుఁడై సుఘవుఁడాప్యాయమ్ముగాఁ బల్కఁగన్
దనికెన్ శీతనగాత్మజుండెలమి స్వాంతంబందు సంతుష్టుఁడై
ఘనుఁడా హనవుఁ డట్లనుగ్రహముతోఁ గారుణ్యముం జూపుచున్
దనకుం బ్రీతి వరమ్మునీయ నిలిచెన్ దత్స్థానముం దట్టులే ! 101

కదలి దాఁటుట దుష్కరకార్యమగును
విక్రమస్ఫూర్తి రెండవ విధత హనుమ
పూనికమైనాకు నాతిథ్యమును దిరస్క
రించి తన ధార్ష్ట్యమును నిరూపించె మరల 102

అమరవిభుఁడు మహర్షులు నంబరమున
మాతరిశ్వతనూజుని మహిమ నరసి
సమ్మదమున సురారిపురమ్ముఁ జేరఁ
గా నమర్థుఁ డటంచు నక్కజపడిరొగి 103

క్షణకాలమ్మునఁ జాలదూరమరిగెన్ సామీరి వేగమ్ముగా
వినువీధిన్ విబుధుల్, మునీంద్రగణముల్ నిర్భ్రాంతితోఁ జూచుచున్
హనుమంతుండును సాగరోత్తరణకార్యమ్మందు మున్ముందుగాఁ
జనునేమో యొకదుష్టవేళ కనుచున్ సంకోచముం జెందుచున్ 104

సరభసముగ హరంతట
సురసయనెడి నాగమాత సూర్యోపమునున్
దరిసిరి వాయుజు వేగము
నరికట్టగఁ గొంతకాలమర్థించి రిటుల్ 105

చూచితివే నీవు సురస! మారుత్సుతుఁ
దరుదెంచు ద్రుతగతి నభ్రవీథి
నీ వేగమునఁ బోవనెంతొ కాలము పట్టు
దతనికి లంకలో నడుగుపెట్ట

సుత్సాహమున దుర్గమహార్ణమ్మునందున
లంకఁ జేరినయెడ లాభమున్నె ।
అతనిమార్గము నడ్డగించినఁ గొంత
వ్యసనధివచ్చును వాని బలపరాక్ర

మము, లుపాయము వ్యక్తమౌ మాకు వికృత
రూపమునఁ గోఱలునుఁ మిడిగ్రుడ్లుఁగలిగి
పర్వతాభదేహమ్ముతో వక్త్రి మాక
సము వఱకు విస్తరించి విఘ్నము సలుపుము 106

ఎదిరింపుము రాక్షసి వలె
నదురు బెదరులేక నీవు సభమున నిపుడే
వదనమును దెఱచుకొని యా
పదఁ బాపగ జగములకును పదః శీఘ్రముగా 107

అతఁడు నిను గెల్చినచో
భీతి యడఁగు మాకు వాని విక్రమ మెఱుఁగన్
హేతువుఁ గలుగును నేర్పుగ
సీతాన్వేషణ నతండు నేయగ ననువౌ ।" 108

లోక క్షేమమునకుఁ దమ
యాకాంక్షను దెలుపగా మహర్షులు, సురలున్
వేఁకరమును దప్పింపఁగ
నూకొట్టుచుఁబోయె సురస యుడువీధికొగిన్ 109

భీకర నిశాటికై వడి
నాకాశము వఱకు నోటి నామె తెఱచుచున్
గేకలు వెట్టుచు మారుతి
నాఁకిడఁగా సురస యరిగె ననుపమశక్తిన్. 1

అంచితులైన వేల్పుల, మహర్షుల ప్రార్థన మేరకున్ నిరో
ధించెను నాగమాతయును దీక్షగఁ బోవుచునున్న పావనిన్
పెంచుచు స్వీయ దేహమును బెద్దగఁ బర్వత మట్టులన్ గరా
శించుచుఁ దోడుతోఁ బలికె రేఁగుచు నాతనిడాసి ధీరయై 1

ఆగుము! ఆగుమో కపినరా! నిను దేవతలంపినారు నా
కోగిరమౌటకున్ గరుణయున్ మమకారముఁ బిచ్చలింపగన్
సాగర లంఘనమ్ముఁ గొనసాగదు-చొచ్చుము నాదువక్త్రిమున్
వీఁగుచు బ్రమింగి వైచెదను విస్మృతిఁ జెందకు-రమ్ము శీఘ్రమే! 11

పవనసుతుఁ డంత వికసితవదనుఁ డగుచు
సురసతోఁ బల్కె "దశరథ సుతుఁడు రాముఁ
డనుజుఁ డగు లక్ష్మణుండును నతివ సీత
వెంటరాఁజేరె దండక విపిన సీమ 11

రక్కసులతోడ బద్ధవైరమ్ము కలిగె
రాముఁడన్యకార్యనిమగ్నుఁడై మనలగ
రావణుఁడు సీత దొంగిలె - రామదూత
నగుచు నామె జాడలరయ నరుగు చుంటి 11

రామశాసనమ్మున నేను లంకకేఁగు
వాఁడ నీ వాతనికి సాయపడుట పోయి
రాము రాజ్యమునందుండి రామకార్య
నిర్వహణయందు విఘ్నము నెఱపమేలె ? 115

తాదేవినిఁగాంచి యావిషయమున్ శ్రీరాముతోఁదెల్పి విన్
తం జేయగనేఁగుదెంచెదను మూఁరింబుచ్చి నీ నోటిలో
ాఁతిన్ జొచ్చెద నీవు కోరినటుఁ గర్తవ్యమ్ముగా నెంచి, నే
తత్కార్యము నిర్వహింతును నిశాటీ ! ఒట్టునేఁబెట్టితిన్ 116

ఇది సత్యము — నామాటల
సదమల హృదయమున నమ్మి చననిమ్ము ననున్
బదపడి వచ్చి ప్రవేశిం
చెద నీ వదనమున రాక్షసీ ! ఆ పయినిన్ 117

ఇది విని సురస వెంటనె
బదులిడె నిటు "వలను పడదు పవన కుమారా !
ఇది యిపుడె జరిగి పోవలె
నెదుటను గల భుక్తి విడవరెవ్వరు నెపుడున్ 118

కామ రూపిణి సురస యక్కపి ప్రవరుని
ముదలపెట్టి యాతని బలమును బరాక్ర
మము నెఱుఁగఁగోరి హనుమను మార్కొని తన
వదనబిలమును దెఱచుక వచ్చి పలికె 119

నన్నెవరు మీఱి పోలేరు - నాకు వరము
బ్రహ్మ దయచేసె - నేనెటు వదలు దాన ।
హనుమ ! సిద్ధాన్నమెవఁడుఁడా నారగింప
కెటుల విడుచును - మ్రింగెద నిపుడె నిన్ను" 120

అని నాగమాత పలికిన
హనుమంతుఁడు సురసఁగాంచి యనెఁగుపితుండై
నను మ్రింగివేయగల నో
టినిఁదెఱచినఁజొత్తునే నిశాటీ ! యిపుడే 121

హనుమ గద్దింపగి నాయమ పదియోజ
నములమేరకు వదనమ్ముఁదెఱచి
మీఁది మీఁదికిరాఁగ మ్రింగఁగ్రోధమ్మున
హనుమంతుఁడును బదియామడల వ
ఱకు శరీరముఁబెంచె వికృతంబుగా యిరు
వది యామడలఁజేసె వదన మామె
ముప్పది యోజనములు పెంచె మేను హ
యుజుఁడామె నలుబది యోజనములు

చేసెఁదననోరు హనుమ పెంచెను దనువును
నేఁబదామడలెత్తున, నిడుమ పడుచు
నఱువదామడల్ చేసె నాస్యమ్ము సురస
కామరూపిణి - హనుమయు గట్టివాఁడె ! 122

పెరిఁగె డెబ్బది యామడల్ నలు కతండు
వక్త్రమెనుబది యామడల్ వఱకు సురస
విస్తృతమ్ముగఁజేయఁగపిప్రవరుఁడు
తొంబదామడలెత్తయ్యె ధూర్వహుతను 123

నూరామడలఁజేసె నోటి నా సురసయు
మారుతి యంగుష్ఠ మాత్రదేహుఁ
డయి ప్రవేశించెఁ దదాస్యబిలమ్మున
వెలుపలికేతెంచె వేగముగను
వదన ప్రవేశమ్ముఁబైటికి వచ్చుట
గమనింపలేదామె - గాడ్పుపట్టి
గగనవీథికెగిరి కడు నమ్రుఁడగుచు" దా
క్షాయణీ ! నీ యనుకాంక్ష మేర
కేను నీ వక్త్రమునఁజొచ్చి యివలికిదిగో
వచ్చితిని - నా ప్రణామము - బ్రహ్మవరముఁ
గూడఁజెల్లెను - జనకజ కొఱకు ప్రొద్దు
గ్రుంకు లోపల లంకకేఁగుదును సురస ! 124

రాహుముఖమందునుండి వెల్వడిన శీత
భానుకైవడి మారుతి వఱలుచుండ
సురస నిజరూపమును దాల్చి కరువలిసుతుఁ
గని వచించెను హర్షాశ్రుకణము లురల 125

"నీవేగెల్చితి నేనె యోడితిని నిర్ణిద్రుండవై సాగుమా !
పావిత్ర్యమ్మగు రామకార్యమును నిర్వాహమ్ముఁ గావించుచో
సేవాధర్మము, శక్తియుక్తులుఁ బ్రపంచీభూతమౌచున్ దశ
గ్రీవాధీశ్వరు లంకలో జనకపుత్రింజూడ సాధ్యంబగున్ 12

సౌమ్యుడా! వానరోత్తమ ! సాహసికుఁడ !
స్వేచ్ఛగా పొమ్ము నీకార్యసిద్ధి కొఱకు
ఆదరింపఁ జేయవలె మహాత్మఁడైన
రఘువరునిచేత జానకీరమణి నీవు 12

హనుమ బుద్ధిశాలి, యతి బలశాలి, యు
పాయశాలియగుట బైటపడెను
సురస పట్టునుండి సురలకు, మునులకుఁ
దెలిసె నతని బలముఁ దెలివి, ప్రతిభ 138

పరులు చేయలేని పనులొనర్చుచునున్న
పవనతనయు మూడవపనిఁ గాంచి
సర్వభూతములును శ్వసనపుత్రుని "బాగు!
బాగ"టంచు మెచ్చె వీఁగు హృదుల 129

నాగమాతయు దీవెనలనిచ్చి మెచ్చె, సా
మీరి ప్రయాణము మింటియందు
మరలసాగించె నామార్గము మేఘముల్
జలధారలను వీడు నరణి, పక్షి

సంతతుల్ వేడ్కతో సంచరించు పథమ్ము
హరివిల్లునకు స్థానమైన త్రోవ
గానమ్ముఁ గావించు గంధర్వవిద్యాధ
ర వ్రాతమేఁగు సరవి, దివౌక

సుల విమానముల్ విహరించు సున్నితాధ్వ
మశని ఘాతమ్ములంబుట్టి నట్టివహ్ని
లవఘళించి తేజస్సుల సవదరించు
చోటు, సుకృతులు నడఁగూడు బాటయద్ది 130

తారకల్, గ్రహములుఁ దపనుఁడు మఱియును
శీతరశ్మియుఁ బ్రకాశించు తావు
ఐరావతమ్ముతో నందగించు పథమ్ము
నంయమీంద్రులు, సిద్ధ, సాధ్య, నాగ

గణములతో నిండి కనువిందుగానుండి
యితర సంపర్కము లేమిలేని
తెరువు, స్వచ్ఛమ్ముగా నిరవొందు మార్గము
దిగ్గజమ్ములతోడి తెన్ను, హనుమ

గరుడివలెఁ బయనించెను – కరువలివలె
జలదపటలమ్ముఁ జీల్చుచు సాగిపోయె
శంక రవ్వంత యెఱుఁగక లంకదెసగ
నభమునను ఱెక్కలు గలుగు నగము రీతి 131

మాటిమాటికి వారిద మండలమునఁ
జొచ్చి మరలను బైటికి వచ్చు హనుమ
హర్షకార్యములందుండి బయట పడెడి
చంద్రుకైవడి భాసించె చక్కఁదముగ 132

మారుతాత్మజుఁడును నిరాధారమైన
వ్యోమమునవ్రేలు రెక్కల భూధరమువలెఁ
జెలఁగెఁగామరూపిణియైన సింహికయను
యామినీచరి పెరిగి యిట్లని తలంచె 133

"నేఁటికి బాలకాలముగ నేను భుజింపగలేదు తృప్తి నీ
సాటి బలాఢ్య జంతువిటు ప్రక్కకురాక ప్రహర్ష చిత్తతన్
నూటికి కోటికిన్ దొరకునో మఱి లభ్యముగాక పోవునో
వాటముగా లభించె ననపాయముగా గ్రసియింతుఁ బ్రీతిమై 134

ఛాయాగ్రాహిణి సింహిక
వాయుసుతు పేరాసతోడఁ బావనినిఁదినన్
ధ్యేయమును బాదు సేయగ
మాయింపగ నీడఁబట్టి మార్గాని లాగెన్ 135

ఎదురుగాలికి నౌక కదలక నిల్చి పో
యినరీతి వాయునందనుఁడు నాఁగె
బలపరాక్రమములు వెలుతితమై పోవ
నాపద తెలియక యట్టె నిలిచి

పైకిని క్రిందకుఁ బ్రక్కలకున్ దృష్టి
సారించి యా మహాసత్త్వముఁగని
“యిద్ది నీడనుబట్టి యీడ్చిమ్రింగెడి పెద్ద
జంతు వటంచును స్వాంతమందు
నెంచి రవిజుఁడు దీనిగుఱించి తెలిపె
ననుచు నచ్చెరువందుచు నద్దిగొప్ప
శక్తిఁగలుగు దానవియని-యుక్తిఁ జూపి
దానిఁజక్కాడ మారుతి పూనుకొనెను 136

బుద్ధిశాలి హనుమ ముదిరమ్ముపలె దేహ
ముసు బెంచె మిన్నగా దనుజఁగాంచి
పాతాళ వివరమ్ము రీతి వక్త్రమ్మును
తెఱచి గర్జించుచుఁ దెప్పునఁబవ
మాన నందనునిఁ దామార్కాన మీఁదికి
దుమికెను-మేధావి, ధూర్వహుఁడగు
నామహాకపి తదీయాస్యమ్మును శరీర
పరిమాణ మాయుష్ప పట్టులరసి
వజ్రదేహుఁడు, బలశాలి, ప్లవగుఁడగుట
దనుజవదనమ్ముఁ జొచ్చుచుఁ దనువునతఁడు
సారెకుఁగుదించి, యుపరాగసమయమందు
రాహుగ్రస్త రాకాశశి రమణఁబొలిచె 137

సిద్ధులును, చారణులును జూచిరి కపివరుఁ
డటుల సింహిక భీకరాస్యమునఁ జొరగ
నతని శక్తిపై విశ్వాస మందఱికిని
మరల దుష్కరకార్యము జరుప వలఁతి

రయతన్ వాఁడినఖమ్ములన్ దనుజమర్మస్థానముల్ చీల్చి ని
ర్భయుఁడై బైటికివచ్చె వేగముగ-సాలప్రాంశువాతండు వి
క్రియచే, ధైర్యముచేఁ బటుత్వమున యుక్తిన్ దృష్టిచే నిగ్రహ
క్రియచే మారుతసూతితాఁ బిలుకు మార్చెన్ గుండియన్వచ్చుచున్

మరల మనోవేగమునకు
సరియగు జవనిమననెగిరె శ్వసన తనయుఁడున్
బరమేష్ఠిచేత దానవి
మరణమ్ము లిఖింపఁబడెను మారుతి వలనన్

హనుమంతుఁడు వధియింపగ
దనుజశవము నభమునుండి దబ్బున పడియెన్
వనధి జలమ్ముల నాకస
మునఁదిరిగెడి భూత గణము ముదమెసలారన్ 1

“ఓ కపివర ! నీవిపుడొక
భీకర కార్యమ్మొనర్చి వెరవరి వగుచున్
బోకార్చినావు సింహిక
నీ కభిమత లక్ష్యమొదవు నిర్బాధముగా 14

నీవలె ధారణ ధైర్యముఁ
జేవయు, ధిషణయును గలుగ సిద్ధించుఁ గదా!
పావిరి కార్యము లన్నియు
పావనచరితా! యటంచుఁ బ్రస్తుతిఁజేసెన్ 143

అతుల నాకాశసంచారులైన పూజ్య
భూతములచేత గౌరవమ్మును బడయుచు
హనుమ సిద్ధ ప్రయోజనుఁడై నభమున
వెడలె మరల గరుత్మంతు వేగమునను 144

శతయోజనాయత సాగర తరణమ్ము
దుష్కరకార్యమౌ-ధూర్వహతను
దాని కొడంబడి మైనాకు నాహ్వాన
మును గాలహరణమువోలెఁ ద్రోసి
సురస, నాగజనని సురలుఁ బ్రార్థింప ని
రోధింప ధీశక్తి లోఁగఁజేసి
నీడనుబట్టి క్రిందికి లాగు సింహిక
నోర్పుతోఁ జక్కాడి వ్యోమసీమ
కెగసి సీతాదిదృక్ష నహీన బలుఁడు
స్వామికార్య నిర్వహణను సలుప భక్తి,
యుక్తి, యనురక్తి, నిగ్రహశక్తిఁజూపి
యర్ణవము దాఁటెఁదా ననాయాసముగను 145

అనతి దూరమ్ములో లంక కనఁబడె, జన
ఘోష వినిపించె సాగరఘోషఁగలిసి
వ్యోమ చారుల స్తోత్రముల్ పొదలి, యేర్ప
రింపగారాని విధమున రేఁగెఁజదల 14

త్వరమాణుండయి వాయునందనుఁడు ప్రస్థానమ్ముఁగావించె నం
బరసీమన్ జలధిన్ దరించుచును నిర్వర్ణించె లంకాపురిన్
చరణమ్ముల్ వెసమోపెఁదృప్తిపడుచున్ క్షాంతిన్ బ్రదర్శించి సా
గర ప్రాంతద్రుమపంక్తులం దిరిగ నుత్కంఠన్ వినోదించుచున్ 147

వానరమ్ము వలెను, పంచాస్య మట్టుల
గ్రద్దవోలె సూకరము విధాన
పొట్టి గుఱ్ఱమటులఁ బొలదిండులను మోస
పుచ్చి లంకలోనఁజొచ్చె హనుమ 148

వాయుతనూజుఁడు ప్రాప్తమనోరథుఁ
డై విలాసమ్ముగా నచటి పుష్ప
తారామముల, మలయాద్రి నికట వన
మ్ముల నభిదర్శించె - జలధి పత్ను
లగు నదీముఖముల సొగసు వీక్షించెను
వానరుండగుటచేఁ బాదపముల
పైని లంఘించుచుఁ బరితుష్టి వెలయించె
ద్వీప సౌందర్యము, దీప్తిఁగాంచెఁ

ప్రకృతి దృశ్యముల్ కనుఁగొని పరవశుఁడయి
గంతులనువైచె - దునికెను కరువలి సుతుఁ
డట హరిత శాద్వలమ్ముల హర్షపులకి
తాంగుఁడై యొనరించె విహారములను 149

తనరూపమొక పరిఁదాఁబరికించి మా
రుతి యిట్లు భావించె "రోదసి నిటు
మేఘమాలికవోలె మేదురమ్ముగ నావ
రించిన కైవడి మించియున్న
నా యీ శరీరము నక్తంచరులు చూచి
చుఱచుఱలాడుచు నొరిది వింత
పడుచును నావెంటఁబడుట తథ్య" మటంచుఁ
బ్రాజ్ఞుఁడయిన వాఁడు భ్రాంతి విడుచు
విధముగా దేహమెంతో హ్రస్వకరించి
పొందె నిజరూపమును విష్ణుమూర్తి బలినిఁ
ద్రొక్కి-యవలఁద్రివిక్రమ రూపము నిడి
పూర్వరూపముఁ బడసిన పోల్కి- హనుమ 150

లీలాచుంచుఁడు మారుతాత్మజుఁడు ప్రాలెన్ సత్వసంపన్నుడై
వేలాడంబడు పర్వతాగ్రమున సువ్వీశ్లారుచున్, దూఁకుచున్
వాలంబెంతో మనోహరమ్ముగను లేపంబూనుచున్ హేలగా
వాలాయమ్ముగ సంచరించె నచటన్ వాహ్యాళిఁ గావించుచున్ 151

పిమ్మట సముద్రతటముఁ గపిప్రవరుఁడు
చేరుచుఁ ద్రికూటపర్వత శిఖరమందు
కట్టబడి యుండినట్టి లంకానగరము
నుత్సుకతఁ దిలకించె ప్రయోజకుఁడయి 152

నగముపై హనుమఁగనుగొని
ఖగములు, మృగములు బిరానఁగలవరపడుచున్
బెగడొంది పాఱిపోయెను
లగువున గమ్యమ్మెఱుంగ రాని విధముగన్ 153

అమరావతికిన్ దీటుగ
రమణీయముగాఁజెలంగు రావణుని పురం
బమరికగాఁబొద కట్టెను
సమీరతనయునకుఁ బుణ్యచారిత్రునకున్ 154



# ద్వితీయ సర్గము

— o —

సరవిన్ సాగరలంఘసమ్మనిన దుస్సాధాధికామంబు ధీ
వరుఁడై వాయు తనూజుఁ డాపనికి విశ్వాసమ్ముతో దీకొనెన్
నిరతిన్ రామనృపాలు దూతగఁ బ్రయాణించెన్ నభోవీథిలో
శరధిన్ సాహసవిక్రమ స్ఫురణ దీక్షన్ దాఁటె సంతృప్తితో 1

మతిమంతుండగు వానరోత్తముని నామంత్రించు మైనాకునిన్
ధృతితోఁ బ్రక్కకునెట్టి సంయమన బుద్ధిన్ ద్రోసె నాహ్వానమున్
సురసన్ యుక్తిమెయిన్ బరాజితగ విస్ఫూర్తిన్ బొనర్చెన్ నిశా
చరియౌ సింహిక విక్రమోద్ధతుఁడుగాఁ జంపెన్ విభిన్నక్రియన్ 2

ధరణిజ బ్రముచ్చిలన్ విమత దానవనాథుఁడు రావణుండు మే
దురవిరహాన రాఘవుఁడు దుర్భరవేదనతోఁ జలించుచున్
దురమున విద్విషన్ జెనఁకి తోయజనేత్రనుబొందఁ బావనిన్
సరగున బంపెగా నవవిజాతను గన్గొన నబ్ధి దాటగన్ 3

శ్వసనజుండుఁ ద్రికూట శైలాగ్రముననున్న
లంకాపురమును నిశ్శంకఁ జూడ
నద్భుతమ్ముగ నుండె నమరావతిం బోలి
నందనా రామమున్ గ్రిందుపఱచు
కుసుమితోద్యానముల్, గోరంట, సరళ, స
ప్తచ్ఛద, ఖరూర, పనస, నీప
కర్ణికార, కుటజ, కరనీర, కంకేళి
మాకంద, పాటల, మాతులుంగ

ఖుంగ, జంబీర, వకుళ, లవంగ, కోవి
దార, భల్లాతకీ, రంభ, పారిజాత
కేతకీ, నారికేళాది క్షితిజ సంయు
తంబగుచు రమణీయమై తనరె లంక

వానిపై నెన్నొ జాతుల పక్షులుండి
కలకల ధ్వానముల నేయఁ గరువలిసుతుఁ
డద్భుతంబగు ప్రకృతి దృశ్యముల కలరి
సంతసమ్మున బరికింపసాగెఁ దమిని 5

నూరు యోజనములమేర సంద్రము దాఁటి
యలపు, సొలపు లేక హనుమ నిలిచె
నదియె కాక యింక నాపైని మఱి యన్ని
యోజనములు దాఁటుయోద్ధ యతఁడు 6

ఊర్జితుండు నిడువఁ డొక్క-నిట్టూర్పును
దూర గమన శ్రమముఁ దోఁచకుండె
వీరులందు మేటి వీరుండు-దుమికెడి
వారిలోన దొడ్డవాఁడు హనుమ 7

వీర్యవంతుల నెనలేని విక్రముండు
సాటివారల సరిలేని పోటుమగఁడు
కనుకనే సాగరముదాఁటి కాలుఁబెట్టఁ
గలిగె రావణు లంకలో బలముఁ జూపి 8

నడుమను చాఁపరాల్కలిగి నల్లగనుండిన శాద్వలమ్ములన్
నడచెను కొండ కొమ్ముల, వనంబుల దివ్యపరీమళంబులున్
గడలుకొనంగ వృక్షములు కప్పినశైలములన్ గమించుచున్
వెడలెఁ గపీశ్వరుండు సరవిన్ బరికించుచు, సంతసించుచున్ 9

సర్వ ఋతువులయందు వృక్షమ్ములచట
పూసి, ఫలియించు ఋతుభేదముల నెఱుఁగక
దానవేశ్వరు మంజులోద్యాన వనుల
కనుల పండువఁ జేసెఁ దత్కపివరునకు 10

స్వచ్ఛ జల సరోవరములు, వానియందు
హంస, సారస, కారండవాది జలవి
హంగ కలకూజితమ్ములు, హారిపద్మ
కుముద, కల్హార, నీలోత్పలముల గములు 11

మండలాకృతి పూలపై మధుకరములు
తమకముగ ఝుంకృతులను నృత్యమ్మొనర్చు
నా వన సరోవరాత్త వాతావరణము
కలుగఁజేసె నాహ్లాదము కపివరునకు 12

తానుదిగిన త్రికూట భూధరముపైని
చల్లగాలికిఁ బుష్పవాసనల నాస్వ
దించుచుం బూలుపడి పుష్పదేహియగుచు
దుముకుచును విహరించె నా ధూర్వహుండు 13

మున్ను మయుఁడు చతుర్ముఖు నాజ్ఞ మేరకు
నగరమ్ములో భవనమ్ములన్ని
నిర్మించెఁ బరమేష్ఠి నియమమ్ముతో వైశ్ర
వణుఁడు దానికి నధిపతిగ నయ్యె
రావణుఁడతనిఁ బరాజితుఁ గావించి
యాక్రమించెఁదదాది యద్ది శత్రు
దమనులుఁ గ్రూరులు దానవ వీరుల
రక్షణలో నుండె రాత్రి పవలు
కోట బురుజులపై శతఘ్నులును, శూల
ములును గలుగును జుట్టు సముద్రముండె
సహజ పరిఖా సదృశముగ – జగములన్ని
రావణుని యేలుబడిలోన రహిఁజెలంగె

లంకాపురమున కలంకార ప్రాయమ్ము
గా నుండె లోతైన కందకమ్ము
అంబరమ్మును దాఁకునట్లుగ నెత్తుగా
తిన్నగాఁబెరిగిన దేవదారు
వృక్షముల్ కనులకు విందుగా నెట్టని
కుసుమముల్ గల కొండగోగుచెట్లు
గుత్తులు గుత్తులై కొమరారు ఖర్జూర
ఫలములు. సురభిళ ప్రసవచయము

మలయపవనమ్ముఁ బీల్చుచు మారుతి గిరి
చుట్టును విహారమొనరించె నెట్టుకొనుచు
దీర్ఘికల్ కూడఁ గన్పించె దీటుకొని, మ
యూరగణ నృత్యముల నిండియుండె కొండ 15

కోటచుట్టు పరిఖనానుకొనుచు తాఁడి
యెత్తుగను రాతిగోడ భాసించుచుండె
కోకనదములు, కుముదముల్ గుప్పుమనుచుఁ
బూలతోరణముల భాతి పొలుపు మీఱు 16

కనుఁగలిగి కోటగోడల ననవరతము
భీకరాకార రాక్షస వీరవరులు
పురుగునైన రానీయరెప్పుడును గూడ
కఱకు కత్తుల కావలికాయు చుండ్రు 17

వందల కొలఁదిగ బురుజులు
క్రందుకొనున్ గోటపైనిఁ గమనీయముగా
సందందు గాలి కెగురుచుఁ
బొందు పడున్ వివిధ వర్ణముల కేతనముల్ 18

సీతను హరించి తెచ్చుట చేత రామ
చంద్రుఁడెపుడైన రావచ్చు సతి కొఱకని
కాపు గడఁబెంచె రావణుఁడాపురమున
నప్రమత్తులై తిరుగుదు రసురులచట 19

తవిలి నవగ్రహములు దిగి
భువికిం జనుదెంచినటులఁ బొంపిరి వోవున్
మివుల, శరన్మేఘములటు
భవనమ్ములు ధవళరుచుల ప్రసరించు నొగిన్ 2

నవకమండలాకర భవనములతోడఁ
బర్వతాగ్రమునంగల పట్టణమ్ము
నభమునన్ వ్రేలు గొప్ప పట్నమ్ము వోలె
కనులపండువుగాఁదోఁచె హనుమ కద్ది 2

స్వర్గధామముఁగ్రిందుపఱచు లంకాపురి
కనిపించె నొక్క చక్కని పడుచుగ
ప్రాకార వప్రముల్ పడఁతికి జఘనమ్ము
సాగరమ్మెప్పు వస్త్రముగ, శూల
ములు, శతఘ్నులుఁ గేశముఁ గొత్తడమ్ములు
లవణిమఁగర్ణాభరణములగును
మయుఁడాపురమ్మును మనసుతో నిర్మించి
నట్లుండె బరికింప హనుమ - చేరు
కొనెను నెమ్మదిగా గుటికొనుచు నగరి
ఉత్తర ద్వారమును - లంక యున్నతముగఁ
జెలఁగి కైలాస పర్వత శిఖరము వలె
నాకసము నంటుచుండె హర్మ్యముల తోడ 22

నాగులతో నున్న భోగవతీ నగ
    రమ్ము పోలిక ఘోర రాక్షసులకు
నిలయమగును లంక - నిరతిఁ గుబేరుఁడొ
    కప్పుడీ పురిలోన నధివసించె
వీరదానవు లకూపారమ్ము దానికి
    రక్షణగా నుండె రావణుండు
క్రూరాత్ముఁడైన శత్రువు హనుమంతుఁడు
    తలపోసెఁ బ్లవగుల తరము కాదు
లంకఁ జేరగ - వచ్చిన లాభమేమి ?
దానిఁ జొరఁగష్టమగు - దేవతలును బోరి
గెలువలేరు దశాస్యుని నిలువరించి
దాశరథికిని గూడ సాధ్యమ్మొ ? కాదొ ? 23

లంకలోఁ గొన నెవరికి లగువు కాదు
సామదాన భేదమ్ములు సరిపడ విట
నలనికాదు రక్షణవలయమ్ము దాఁట
నెంతొ దుర్భేద్యమై యుండె నీ నగరము 24

వానర వీరుల నేను, నీలుఁడు, నంగ
    దుఁడును, సుగ్రీవుఁడుఁ దోయధి గమి
యించి లంకను బ్రవేశించఁగల్గుదుము, ని
    రర్థకమట్టి తలంపు నాకు

తెలియగావలెను నై దేహి ప్రాణములతో
నున్నదో, మరణించెనో ! తెలిసినఁ
దలపోయవచ్చును తదుపరి భావి కా
ర్యక్రమమ్మును ధూర్త్వహతను జూతు

నితర విషయములను గూర్చి యిపుడు రాక్ష
సులను వంచించి జానకి పొలకువలను
దెలిసికొన మంచిదగును గాదే ! త్వరపడి
వారితోఁబోరునేమి లాభమ్ము మొదట ?

వానర శ్రేష్ఠుఁడా తరువాత శైల
శిఖరమున నిల్చి మదిఁదలంచెను రఘువరు
నభ్యుదయమును గోరుచు నక్కజముగ
భావికార్య నిమగ్నుఁడై పరవశముగ

కనఁబడకుండ జానకినిఁగాంచిన మంచిది రాత్రివేళయే
యనువగు దానికిన్ దెలియు నందఱొ, కొందఱొ నిద్రనుండియో
కనులను నిద్రమంపుననొ కానగ యత్నము సేయఁ బోరు నా
పని సుకరంబగున్ దిరుగఁబట్టదు పెద్దగ కాల మిత్తఱిన్

నిదురలో లేక యుండిన నెలఁతల కవ్వు
గిళ్ళలోనైన నుందురు కెలసముగను
పరవశీకృత దేహులై పాన్పులందొ
కుసుమ కుంజములందునొ కుతుకముగను

క్రూరులును బలశాలులు వీరులైన
రాక్షసులు కాఁచు నీ నగరమున నెట్టి
రూపమునఁ బ్రవేశింపఁగ నోపువాఁడ
నే పగిది నీరి నేను వంచింపఁగలను 29

అంతయు వ్యర్థమై చను, దశాస్యుఁడు చూచిన నన్ను, సీత నే
కాంతమునందుఁ జూడవలె-కాలము, దేశము గుర్తెఱుంగకే
చింతనలేక కార్యములఁజేసిన దూతలు సత్ఫలమ్ము లా
వంతయుఁ బొందఁజాలరుకదా! దరిసించెద నొంటిపాటుగా ! 30

దూతలు గ్రుడ్డిగా నేతటి నాలోచ
నములేని పనుల నొనర్పరాదు
సూర్యోదయమ్మున సురుగు చీఁకటులటు
పూనిన కార్యముల్ పోవు చెడుచు
"మేమె పండితులము. మేమేమి చేసిన
విఫలమ్ము కాదని విఱ్ఱవీఁగు
మూర్ఖ దూతలు కార్యములఁ బాడుసేతురు
ప్రభువు లాలోచించి ప్రథితనిర్ణ
యములఁ జేసిపంపినఁ గూడ-నటుల నిపుడు
నాకునైక్లబ్య మరుదెంచునా? రఘువరు
కార్యభంగము కలిగినఁ గష్టమగును
చెడదు-సీతను దర్శింతు-నేగిరాదు" 31

ఈ కార్యము చెడకుండగ
నే కరణిని నిర్వహింతు నీకడలిని నే
నే కాగ్రుడనై దాటుట
ప్రాకటముగ సీత నరసివచ్చుటకె కదా! 32

ఇక్కరణి వనధిఁ గడచుచు
రక్కసులకుఁ బట్టువడిన లాభము కలదే?
మక్కువగ నీనఁ గాచుచు
నక్కల పాల్జేయుటగును-నలుఁగుటె సుభమా! 33

నారాక వ్యర్థమై చను
నా ? రాక్షస గణములిపుడు ననుఁగాంచినచో
నా రాకణు నాశనమును
శ్రీరాముఁడు చేసి కార్యసిద్ధిఁబడయునా ? 34

రాముఁడొనర్చు యత్నము పరాస్తము కాదొకొ నేను లంకలో
స్వామినిఁజూడకుండఁబొరపాటున నీరికిఁజిక్కినన్ సతీ
క్షేమపువార్త రామునకుఁజేరదు నన్నిట బద్ధుఁజేసినన్
రాముఁడువేచి యుండు నట ప్రాణము కన్నులలోన నిల్పుచున్ 35

దనుజ రూపమ్ముబోఁటోవ దనుజులు ననుఁ
బట్టివైతు రసాధ్యులు - నెట్టుకొనుచు
రావణాధము మ్రోల నిల్పంగ నాకు
మోక్షముండునె లంకలో ముడుఁగ నగును 36

నేను నిజరూపమునఁబోవ నిశ్చయముగ
దొరకిపోవుట తథ్యము - దూరమందు
నిలిచి ననుఁ బసికట్టి బంధింపగలరు
కనుక నిజరూపమునఁబోవఁగాదు నాకు 37

తక్కిన రూపముల్ ధరియింప సుఖమేమి ?
వాయువు వీవంగ భయపడు నిట
వీరికిఁ దెలియని వృత్తాంతములు లేవు
ఈ రూపమునఁబోవ నూరుకొనరు
చెడిపోవు నాపయిఁ జెడుఁ బ్రభుకార్యము
నా రూపె కొంత చిన్నదిగఁ జేసి
నిశవేళ లంకలోనికిఁ బ్రవేశించెద
రావణశుద్ధాంత రమణులఁగని

యెట్టికట్టు దిట్టములున్న నెట్టులైన
వెదకి సీతను బోల్చెద తుద" కటంచు
హనుమ సూర్యాస్తమయమగునంత దనుక
నెదురు చూచుచు నిలిచె నొక్కెడను బొంచి 38

రామాభ్యుదయముఁ గోరుచు
సామీరి త్రికూటశైల సానువులందున్
సామీప్యమునన్ నిల్చెను
స్వామిని జాడల నెఱుంగ సమయముకొఱకై 39

రవియస్తాద్రినిఁ జేరఁజీఁకటులు పర్వన్ సాగె లంకాపురిన్
బవమానాత్మజుఁ డంతఁ బిల్లివలె రూపంబెంతొ సంక్షిప్తమై
తవులంజేసి పురప్రవేశమును నిస్తంద్రుండుగా దూఁకుచున్
వివిధప్రాంతములన్ గవేషణను గావించెన్ మహీజాతకై

వీథులు సర్వమున్ విన్నాణముగఁ దీర్చి
దిద్దినట్లుండుచు ముద్దుఁ గొలిపె
నాకాశమును దాఁకు హర్మ్యముల్ వరుసలు
వరుసలై పురినిఁ గన్పట్టుచుండె
ప్రతిసౌధమందు స్తంభములు హిరణ్మయ
యమ్ములే! తచ్ఛిఖరమ్ములఁ బయి
పసిడికుంభములుండె స్ఫటికశిలల్ ప్రతి
భవనమ్మునందుఁ దాపడము సేయ
నేల సర్వమద్దమువోలె విద్దముగను
బొలుచు నవరత్నములుఁగూడఁ బొదుగఁబడెను
వ్రేలుచుండె ద్వారముల ముత్యాలసరము
లమరు కాంచన తోరణాలందు నిందు

ఏడెనిమిది యంతస్తుల
మేడలు కలవెన్నొ పురిని మిసమిసలాడున్
పైడియు, వెండియుఁ దడబడఁ
బోడిమి నవరత్నకాంతిఁ బొలుచుచు నుండన్

అదిచూడ వైదేహి నరయవచ్చిన వనే
చరునకు హర్ష విచారము లోక
పరిఁ గల్గెనంత క్షపాకరుండును బొడ్పు
గుబ్బలిపైఁ దోఁచె నిబ్బరముగఁ
దనియింప జగము జ్యోత్స్నావితానమ్ముతో
నక్షత్ర గణముతో నభమునందు
మారుతి కప్పుడు మైనాకుఁడును, సము
ద్రుఁడు మార్గమందున దోడుపడిన
చందముగఁ గానిపించెను చంద్రబింబ
మపుడు శంఖమ్ము వలె, క్షీరమటు, మృణాళ
మటుల ధవళమ్ముగా రాజహంస పగిది
గాడ్పుపట్టికిఁ జూపట్టె గగనసీమ 43

సర్వజనుల పాపములనాశనముఁ జేయు
చును, సముద్రముఁ బొంగించుచును సమస్త
ప్రాణుల విరాజితముసేయ వచ్చుచున్న
చంద్రముని దర్శనమ్మయ్యె శ్వసనజునకు 44

పావని లంబపర్వతముపైని నిశీథముదన్క నిల్చుచున్
బోవగ నుద్యమించెఁ బురమున్ జొరబాఱగ నేత్రపర్వమై
పూవులతో సరస్సులు, విభూతికి చిహ్నములైన సౌధముల్
వావిరితోఁచె గట్టెదుట-వాయువు వీవదొడంగె చల్లగా 45

హనుమంతున కెటుఁ జూచిన
జనఘోష సముద్రఘోష చాడ్పునదట్టై
వినఁబడుచుండెను చెవులకు
గొనకొని పుటభేదనమునకుం జనుచుండన్

బంగారు ద్వారముల్, వైడూర్య మణివేది
కలు, వజ్రములు, స్ఫటికములు, ముత్య
ములు, మణుల్ తాపిన నిలయముల్, కాంచన
వారణమ్ములును, సర్పములు, రత్న
ఖచిత సోపానముల్ కలిగిన రమ్యసౌ
ధమ్ములు గగనమ్ముఁ దాకునంత
యున్నతంబుగ నుండి యుజ్జ్వలకాంతితో
కనువిందుఁజేసె లంకాపురమ్ము

హంస, సారస, కారండవాది పక్షి
సముదయ విరావములు, బర్హిణముల కేంకృ
తులను గాంచుచు, వినుచును ధూర్వహుండు
పరవశీకృత చిత్తుఁడై ప్రమదమందె

అతిబలిష్ఠంబయి యలకాపురిం బోలి
రక్షింపఁ బడుచుండె లంక, సర్ప
సంచారమును గల్గి చక్కఁగాఁ గాపాడ
బడు భోగవతిపోలెఁ బరఁగె లంక

జలదముల్, మెఱపులుకలిగి కాంతిసమూహ
ముల సమరావతివలె స్ఫురించె
కాంచనదీర్ఘ ప్రాకారమ్ముతో చుట్టు
కొనియుండె నగరమ్ము కొండపైని
కింకిణీఘోషఁ గలిగిన కేతనముల
తో నలంకృతమైన వీథులను సర్వ
విధములుగ నుత్కృష్టమై విపులమగుచు
సర్వశుభలక్షణముల ప్రశస్తిఁ గాంచు 48

పురసౌభాగ్యము కన్నుల
కరిదిగఁ గన్పట్టె నపుడు హనుమకు ప్రాకారో
త్తర ద్వారము దాఁటగనే
పరమాద్భుతమౌచుఁ దోఁప భావించె నిటుల్ 49

"ఇది భోగవతికి సురేంద్రుని యమరావ
తికి దీటువచ్చును- తెంపరులగు
రాక్షస యోధులు రాజధానిని వివి
ధాయుధ పాణులై యప్రమత్తు
లగుచుఁ గాపాడగ నన్యులీనగరమ్ముఁ
బట్టుకొనంగ నోపరు-కుముదుఁడు
నంగదుండును, మైందుఁ డర్కజుండును, ద్వివి
దుఁడు, సుషేణుఁడు శక్తితోఁడ దీనిఁ

బట్టుకొనఁగల్గుదురు - కుళపర్వుఁడేను
కేతుమాలుఁడు, మఱియు సుగ్రీవుఁడిటకు
రాఁగలము కాని తక్కిన ప్లవగులెవరు
కడలి దాఁటి లంకను జేర కష్టమెయగు 50

రాముఁడు, లక్ష్మణుండును బరాక్రమవంతులె కావుసన్ మదిన్
దీమసమేర్పడెన్ హనుమ తేజముఁబెల్లుబుకంగ మోమునన్
తాము జయించి వైచినటుఁ దస్మయమొందుచుఁ గొంతకాలమా
భూమిజ లభ్యమౌననెడి పోఁడిమి నిల్చె తదేకభావనన్ 51

అతని యుత్సాహమునకు
హేతువు తద్భావనయె మఱింత బలమ్మున్
జేతస్ఫూర్తియుఁ గలుగఁగ
నాతని సందియము సమసె నద్భుత ఫణితిన్ 52

భవ్యమౌచును సూర్యబింబముల వంటి
దీపికల తోడఁబురమెల్ల దృష్టమయ్యె
చీఁకటియె కానరాకుండఁజెలఁగె పవలొ
రాత్రియో యను భేదము రాదతనికి 53

కనుఁగొనుచు వితర్కించెను
హనుమంతుఁడు లంక గరిమ కాకర్షితుఁడై
మును భావించిన దానికి
వెనుకొనగా నూత్న నావ విలసితుఁడగుచున్ 54

మఱియొకపరి హనుమంతుఁడు నగర సుం
దరిఁదిలకించెను తన్మయుఁడయి
రత్నకాంతులె శరీరముఁగప్ప నాచ్ఛాద
నమగు వస్త్రముగఁగోశములె భూష
ణాళికై వడిని, యంత్రాగారములె సము
న్నత పయోధరములగతి స్ఫురింప
లాలసాపూర్ణనేత్రములతో మఱి మఱి
తెప్పవ్రాల్పక చూపు త్రిప్పలేక
చూచి యాశ్చర్యచకితుఁడై వేచి విశ్వ
కర్మ నిర్మాణశక్తికి కసులతోన
యతనికి నివాళులర్పించె హనుమ కపుడు
పురము చక్కని చుక్కగా పొలుపు మీఱ 55

చూచె లంకాధిదేవత సుందరుఁడటు
నిర్భయమ్ముగ నగరిలోనికిఁ జొరబడ
స్వీయరూపము వీడుచు వికృతరూప
మును ధరించుచు నాతని ముందు నిలిచె 56

అడుగు కదల్చె ముందునకు, నాతఁడుఁబోవగ సుద్యమింప న
ప్పుడు నగరాధిదేవత ప్రమోదమనస్కుని నడ్డగించి" యె
వ్వఁడువుర ! నీవటంచు నటువన్ బెదిదమ్ముగ బెగ్గడిల్లి స
ల్గడఁదిలకింపఁగన్బెదుటఁగాంచెను వైకృతదేహనొక్కతెన్ 57

లంకాపురాధి దేవత
హుంకారించుచును బల్కెనోరీ ! పలువా !
జంకేమిలేక వచ్చితి
వంకిలపడనుంటి చెప్పుమా ! ఎవ్వఁడవో !

ఎవఁడవు నీవు వానరుఁడవేకద ! నాకనుఁగప్పి లంకలో
నవడి యొకింతనేయకయె చల్లగ వచ్చితివేమికోరి, దా
నవులకు స్థావరంబయిన నా నగరమ్మును జేరినా వెటుల్
వివరములేమి ? నీ వడుగుఁబెట్టితివిప్పు నిశీధవేళలో !

ఏపనికై వచ్చితివీ
యీపట్టణమేలఁజొరితి విప్పుడు నే ని
న్నాఁపెద - ముందునకేఁగుట
కోపవు నిలునిలుము మచటె - ఒప్పరికింపన్ 8

కడుభద్రంబగు లంకఁజేరుకొనుటే కష్టమ్మె ! ఆపైని నె
వ్వఁడుఁజొత్తెంచగ సాహసింపఁడిటులన్ ప్రాణాలపై నాశ లే
కడుగుంబెట్టితి వర్ధరాత్రమున సద్దా ! నేను లంకన్ సుమీ !
విడువంబోవక ముందె ప్రాణముల నీవే చెప్పుమీ నీ కథన్ 6

రావణుసైన్యముల్ పురిని రక్షణ సేయుచు నుండ శక్యమే
నీవిట కాలుమోపుటకు నేనిటనుండగ నన్ను గెల్వగా
లేవు వనేచరా ! బ్రదుకలేవిక కంఠములోన ప్రాణముల్
పోవకముందె తెల్పవలె పోటు మగండవ ! అద్ది చూచెదన్ 62

వాయు సుతుఁడు హనుమంతుఁడు
నాయమ పల్కులను వినుచు నద్రిగ విలిచెన్
గాయముఁబెంచుచు నేమియు
చేయక యొక కొంత తడవు చిఱచిఱలాడెన్ 63

హనుమంతుఁడు ధీమంతుఁడు
కనుకన్ భావించె నామె కాంతారూపం
బున నున్న లంకయే యిటు
తనకుం బ్రత్యక్షమైనదాయని యెంచెన్ 64

ధీరుఁడు పవనకుమారుం
డా రాక్షసి హుంకరింపు నాపుచుఁదోడ్తో
నోరిమి వీడుచుఁ గినియుచు
వారక ప్రతివచనమిచ్చి ప్రతిషేధించెన్ 65

పర్వతాభదేహమ్ముతో ద్వారసీమ
కడ్డముగనిల్చి గద్దించునామెఁగాంచి
హనుమ క్షణమాత్రము చలించి యవలఁదేటి
బదులుచెప్పె నిశాచరివంకఁజూచి 66

"ఒదికముతోడ నీ వెవతెవో మును ముందుగఁజెప్పు మాపయిన్
నుడివెద నావిశేషముల నూల్కొనురీతిగ-మిట్టపండ్లతో
ముడుఁగు మొగమ్ముతో వయినముల్ ననుఁజెప్పుమటంచుఁగోరుచున్
గడుసుగఁబల్కుచుంటివి సగర్వముగా-పనియేమి నీకిటన్ 67

గుమ్మము నిండుగ నిలిచితి
విమ్మడ్కిని దారుణముగ నెందులకిటఁ బ్ర
శ్నమ్ముల నడిగెద వెవ్వతె
వామ్మికతో నద్దుపడగ నోరడిమిగులన్ 68

కామరూపిణియైన లంకాపురి తన
మాట కెదురుప్రశ్నింపఁగ మండిపడుచు
పరుషముగ హరివీరుతోఁ బలికె కనుల
వహ్నికణములు రాల విహాదపడుచు 69

రావణుండెంత దుర్ధర్షుఁడో తెలియునా?
చతురుండు దానవ చక్రవర్తి
మూడులోకములలో లేఁడాతనికి దీటు
వచ్చెడి మొనగాఁడు-వాసవుండె
భయపడుచుండు రావణుని యాజ్ఞను సా
రమ్ముగాఁ జరియించు-లంక నేను
రక్షించుచుందును లంకాధిదేవతన్
కనుబ్రామలేవు నగరమునందు

నెవడుఁగూడఁ బ్రవేశింప నియ్యకొనను

వచ్చెనా చచ్చినట్టులె! వానరాధ
మా! యిపుడు నిన్నుమర్దింతు మా పురమ్ముఁ
జొచ్చితివి భీతినెఱుఁగక ప్రముచ్చుపగిది 70

కాఁచుకొనుము మట్టిఁగఱపింతు నొకదెబ్బ
తోడ నిన్ను ! ఎంత ధూర్వహుఁడవొ
తెలిసికొనెద వీదు తెగువయు, బలమును
వనచరుండ ! సిద్ధపడుము నీవు 71

లంకాపురి మాటలు విని
జంకునుమఱి గొంతు లేని శ్వసనతనయుఁడా
మంకునిశాచరి యెదుటను
బెంకెతనము మిగులఁబలికెఁబెచ్చు పెరుగుచున్ 72

'ఆలాపించెదవేల దీర్ఘముగ నా యాకూతముందెల్పెదన్
ప్రోలుంజూడగ జన్మధన్యమయి తీఱున్ బోయి రమ్మన్ననేఁ
గాలుంబెట్టితి, నేఁడు సౌధములుఁబ్రాకారమ్ము, లుద్యానముల్
గాలాయమ్ముగఁజూచి పోయెదను దుర్భావమ్ము లేదింతయున్" 73

ఎన నగరాధిదేవత దయంబున జంకెన చూపు చూచుచున్
'వనచర ! నీవు నన్ను గెలువన్ వలె ముందుగ లంక నెంతగా
మనసు పడంగఁజూడగను మాటలె ? నీ పని పట్టెదన్ సుమీ !
దనుజుల వాసమున్ గన వృథాయతనమ్ము నొనర్చి వచ్చితే ? 74

నను గెలువక యెవ్వరు లం
కనుజొరఁగష్టమ్ము ! అల్పకపివగు నీకున్
మనసున్న మఱియుఁగష్టము
కనుకన్ విడనాడు మట్టికాంక్ష కలిగినన్ 75

ఓరిదుష్టబుద్ధి ! ఓ పిచవానర !
రాక్షసేశ్వరుండు రాజ్యమేలు
లంకఁజూడలేవురా ! నన్ను గెల్వక
ఆశలన్నియు నడియాసలె సుమి ! 76

అని గర్జింపగ వెంటనె
హనుమంతుఁడుఁబలికె మరల నామెకు "భద్రా !
చనెదను నగరముఁగనియిం
తనె యేమియు మునిఁగిపోదు - తడబడనేలా ? 77

అని కరువలి కొమరుఁడుఁబ
ల్కినఁబెనుబొబ్బ పెట్టి కినుకను దాడిం
చెను వానరోత్తమునిఁజ
య్యన నఱచేతితోడ నాశరి పెలుచన్ 78

వేసిన దెబ్బకున్ హనుమ వెంటనె తేఱుచు సింహనాదమున్
జేసెను - వామముష్టిఁబొడిచెన్ వెన నాశరి పొట్టపైవి నం
త్రాసముతోడ లంకయు వ్యథా కలితమ్ముగ నార్చి నేలపై
గాసిలి వ్రాలె - శ్రీ యనుచు గాడుపు చూలియు వీఁడె నంతతో 79

లంకయు లబలబలాడుచు
సంకోచించును లేచి సాహసికుని, ని
శ్శంకుని, దోర్బలు హనుమ వి
శంకితముగఁజూచెఁ బ్రకట శకలిత హృదితో 80

ఆఁడుదియనుచును మారుతి
వీఁడెనొ నను జంపకుండ విజ్ఞుఁడగుటచే
సూడుఁదలంపకటంచును
వేదబమును విడిచిపెట్టె వెఱఁగునఁ దోడ్తో 81

ఆతని యౌదార్యముఁగని
భీతియడఁగ లంక పలికె "వీరా! నన్నున్
ఘాతింపక రక్షింపుము!
నాతినిఁగరుణించి విడుప న్యాయంబగుగా! 82

సత్త్వమ్ముఁగలిగిన సజ్జనుల్ ధర్మము
    నకుఁ గట్టువడియుండి సకల జగతి
కాదర్శముగ నుందు రనవరతమును, లం
    కను నేను - నీ కోడితిని మహాత్మ!
నీ పరాక్రమమును నిస్తుల మొక రహ
    స్యముఁజెప్పెదను నీకు - బ్రహ్మమున్న
వరమొసంగెను నాకు వానరుఁడెప్పుడు
    తన పరాక్రమముతో నిను జయించు
నో యపుడె దైత్యజాతికి నోపు కలుగు
నాపదలు మూఁడునని తెల్పె నజుఁడు నేడు
నీవు నను గెల్చితివి కాన నేఁటినుండి
దుర్దినమ్ములె లంకకుఁదోఁచు ననఘ! 83

ఏత మూలమ్ముగాఁ జేటువచ్చె దశాస్యు
నకును, లంకకును. దానవులకెల్ల
ధాత వచించిన దానికి భిన్నమ్ము
గా నేది జరుగదు కాన నీవు
స్వేచ్ఛగా నిపుడు ప్రవేశింపవచ్చు ని
రభ్యంతరమ్ముగ లంకలోన
నీ పనుల్ పూర్తిగా నెఱవేర్చుకొనుము, శా
పోప హతమ్మైనదీ పురమ్ము

సర్వము గవేషణ నొనర్చి జనకరాజ
పుత్త్రి పొలకువ లరయుము-పొమ్ము! వేగ
నిష్టమైన తావులకెల్ల నేఁగి, తోఁచు
విధముగాఁ జేయుమో కపివీర ! నీవు" 84

చేతులను మోడ్చి మ్రొక్కుచు శిరమువంచి
"సుఖముగాఁబోయి రమ్మ"ని ప్రశతపఱుచుచు
మార్గమును జూపె హనుమకు-సుహితుఁడంత
వెడలె లంకాధి దేవతన్ వీడ్కొనుచు 85

చండవిక్రముఁడు, తేజశ్శాలి, వానరో
త్తముఁడగు పవన నందనుఁడుఁ గామ
రూపిణియైన లంకనుదాను నిర్జించి
పురముఁ బ్రవేశింపఁబూని ద్వార

మునఁగాక ప్రాకారమును దాఁటె సుగ్రీవు
నకు మేలుసేయు యత్నమున నెపుడుఁ
జరియించు పావని శత్రుమస్తకముపైఁ
దన వామపాదము నునిచి సటుల

ధైర్యసంపన్నుఁ డానిశీథమున జాఁటి
పడిన సుమములుగల దారిబాటఁ బట్టె
ముందునకుఁ బోయి సుందరపురముఁజేర
నద్భుతమ్ముగఁ గనిపించె నతనికిఁబురి 86

విద్విషుల స్థావరములఁబ్రవేశ సమయ
మందనుసరింపగాఁదగునట్టి పద్ధ
తి యిది కావున యుద్ధనీతినిఁదెలిసిన
హనుమ ప్రాకారలంఘనమ్మను బొనర్చె 87

అక్కడ రాక్షసులందఱు
సుక్కరులై తిరుగుచుండి రుల్లాసముగా
చక్కని తూర్యధ్వనులట
మిక్కిలి వినిపించుచుండె మేటుంమగుచున్ 88

వజ్రమాలికా సంయుత భవనచయము
వనదమాలికలున్న నంబరము వోలె
నందముగఁబ్రకాశించుచు నాంజనేయు
మానసమునకు నెంతొ సమ్మదముఁగూర్చె 89

రత్నహారముల నలంకృతమగు రమ్య
ధామమ్ములై రావతముల రేవ
ధవళ సుందర వారిద వ్రాతముంబలె
నయన పర్వముగఁగన్పట్టె నెదుట
చెలఁగుచుఁగమల స్వస్తిక నామముల తోడ
నవకమౌ వర్ధమాన గృహపంక్తు
లుండఁబట్టణమును మూర్ధస్వి తిలకించి
శిరము పంకించె విస్మితిని మెచ్చి
ముందునకుఁబోవఁబోవగ ముగ్ధుఁడయ్యె
నొక్క సౌధము కన్న వేతొక్క సౌధ
మద్భుతమ్ముగఁ గనిపించెనందు పైని
విమల గానముఁద్రిస్థాయి వినగనయ్యె 9

కలకంఠముల గానములు చేయు హారంద
ఱును గూడఁబడఁతులే ! ధనికుల సద
నములనందమ్ముగా నడయాడు రమణుల
నూపురమ్ముల, మొలనూళ్ళ శబ్ద
ములు – వారు సోపానముల మీఁద నడపంగ
మట్టెల ధ్వనులును మంజులముగఁ
గరుపలి సుతునకుఁగర్ణపేయమ్ముగా
వినిపింపఁదొడగెను విరతిలేక

సాము గరిడీల మల్లులు జబ్బచఱచు
చప్పుడులు, సింహనాదముల్ సరభసముగ
తొడలనాస్ఫాలనమ్ములు మెదవిఱుపులు
భుజబల పరీక్షలందందుఁబొలుపుమీఱె 91

దనుజ గేహములఁ గొందఱు జపమ్మొనరించు
        సమయమ్మునందు విస్పష్టముగ, వి
నఁబడె మంత్రోచ్చాటనము-మఱికొందఱు
        వేదపఠనముఁ గావించుచుండి
రందందు-నిఁక కొంద అసుర నాథుని నామ
        మును స్మరియించుచుఁ గనఁబడిరట
రాజమార్గమ్ములో రాక్షసయోధు, ల
        నేకులు కన్పించి రాఁకపెట్ట
వివిధ శస్త్రాస్త్రములతోడ వివిధ చర్మ
సదృశ వస్త్రములను గవచములఁ దాల్చి
ధ్వజములుఁ బతాకలు ధరించి ప్రసవమాల
లఱుతలందెలముచునుండ నద్దిరపడె 92

దర్భలు కలవు కొందఱి హస్తములయందు
        హోమముల్ వేయుచునుండిరి మఱి
కొందఱు-గుజ్జులు కొందఱు-కుండ బొ
        జ్జలవారు కొందఱు, శ్రవణమొకటి

యే కల్గువారును, నేకాక్షులౌ కొంద
 అందమ్ములో మిన్న లెందఱో, పరు
షమ్ముగానుండు ముఖమ్ములవారును
 వికటమ్ముగానుండి వెక్కసమ్ము
కలుగ రజపీచరులు వీరగంధములను
బూసికొని మేలిభూషణముల ధరించి
వివిధ శస్త్రాస్త్రములతోడ వీధులందు
కానిపించిరి పెక్కురు కపివరునకు 93

స్వేచ్ఛగా పలువిధముల వేషముల ధ
రించి, సీధుపులంద్రావి రిత్తమాట
లాడుచు దశాస్య నగరి మధ్యమ గనఁబడి
రెందఱో పవన సూతి కరిందమునకు 94

దనుజ భర్త నగరు తనరు భూధరశృంగ
 మందు, దానిచుట్టు నమరు పరిఖ
హేమ తోరణమ్ము లిరవొందు నగరికి
 జలజ కుముద చయముఁగల దగ్గ 95

ఉన్నతంబగు ప్రాకారముండె నగరి
కచ్చముగ స్వర్గమట్టుల మెచ్చుఁగొలిపెఁ
బలువిధమ్ముల సంగీతములు వినఁబడు
చుండె వాయునందనునకు మెండుకొనుచు 96

కనిపించెఁ గపికిఁ బ్రాంగణమందుఁ బెక్కు ర
థమ్ము, లశ్వములు, వేదండ చయము
భూషణరాజితోఁ బొలుపారుచును, విమా
నములుఁ బల్యంకికల్ నవకముగను
మండితమ్మైయుండె దండిగా - మృగపక్షి
గణములెంతయొ శోభఁగలుగఁజేయు
చుండె - దానవు లెందఱుండిరో గణన కం
దక గాడ్పుకొమరుఁడుఁ దికమక గొనె
ఆయుధమ్ముల ధరియించి యప్రమత్తు
లగుచు రక్షించుచుండిరి నగరు - భద్ర
తావలయమెంత దృఢమౌనొ తానెఱుఁగుచు
మెల్లగాఁ బ్రవేశించె సమీరజుండు 97

అనిలసుతుఁడు ప్రవేశించు సమయమునకు
వెన్నెలలఁ బ్రసరించుచు విధుఁడు వ్యోమ
మధ్యగతుఁడయి గోవుల మందలో ప
డించిన మహోక్ష మట్టులఁ దేటరిలెను 98

లోకుల దుఃఖములన్నియు
నా కౌముదులందొలంగె సంతతి పొంగెన్
చీఁకటులు చెట్లనీడలఁ
బ్రాకుచు మూలలకు నొదిగె రయమున భీతిన్ 99

భూమిపై, మందర భూధరమ్మున నెట్టి
కాంతియుండుఁ బ్రదోష కాలమందు
కడలిపై నెటువంటి కాంతి చెల్వారునో
సలిలమందలి జలజములలోన
నెట్టి కాంతి చెలంగు నట్టి కాంతియె నిశా
పతిలోనఁగన్పించె నతికృతముగ
వెండి పంజరములోనుండిన హంసతే
వను, మందరాద్రి గహ్వరములోని
సింహమటుల, హస్తిని నధిష్ఠించినట్టి
యొక మహావీరు చందాన నుజ్జ్వలముగ
చంద్రముఁడు విరాజిల్లెఁ దత్సమయమందు
పుచ్చపూవుల వెన్నెలల్ వచ్చె భునికి 1

వాఁడి కొమ్ములుగల వృషభమ్మువోలె
గొప్ప శిఖరమ్ములంగల్గు కుధరమటుల
దంతములతోడి మత్తవేదండము వలె
పూర్ణశృంగుఁడై జాబిల్లి పొలిచెఁ జదల 1(

శుక్రాదిగ్రహముల సోకక సూర్య కి
రణములుపడి శీతరశ్మిపైని
శశిబింబమందుఁ దుషారపంకము, నల్పుఁ
దత్కాంతితోపోయి ధవళమయ్యె

పర్వతశిఖరమ్ముపై నుండు సింహ మె
ట్లుండునో, సంకుల ఖండనమ్ము
జరుగుతావున మదసామజ మెట్లుండు
నో, సింగపుంబీట నూతనముగ

నెక్కి- పట్టాభిషిక్తుఁడౌ నృపవరేణ్యుఁ
డెట్టులుండునో విధుబింబ మట్టులుండె
రాక్షసులు విజృంభించిరి ప్రణయ కోప
ములను జల్లారె స్త్రీలకుఁ బురుషులకును 102

దేదీప్యమానమ్ముగా దివమ్మున చంద్రుఁ
డుదయింపఁ జీకటుల్ కుదియబడెను
క్రవ్యాద మాంస భక్షణ దోష మిరవొందె
ప్రేయసీప్రియులకు వీడెఁగోప
తాపముల్ వారి చిత్తములలోనఁ బ్రసన్న
భావముల్ విరిసె - శోభావిలసిత
భగవత్స్వరూప విభావరి స్వర్గ తు
ల్యముగ నానందదాయకమె యయ్యె
వీనులకు విందుసేయుచు వినగనయ్యె
మధుర వీణానినాదముల్-మత్తుఁ గొనిన
నసురులును, ఘూకములు చెరలాడ మొదలు
పెట్టె నానక్త సమయాన భీతిఁగొలుప 103

దీపములుకూడ సహజముగా మదించి
మద్యపాన మత్తులతో సమాయుతముగ
నుండి తురగ రథమ్ములు, మండితాస
నములతో విరాజిలుచు నందముగనుండె 104

తిరిగెను రాజవీథులను దీక్షగ - సంబరమంటు హర్మ్యముల్
పరిగొని చూడఁగొన్ని సితవారిదముల్ వలెఁగొన్ని పద్మముల్
కరణిని, స్వస్తికాకృతినిఁ గ్రాలెను నింకొక కొన్ని రమ్యమై
కరువలిపట్టి తద్భవన కారకు నైపుణిమెచ్చె విస్మితిన్ 105

ప్రతిభవనమ్ము నొం నెఁ బ్రవత్తిని స్వామిని సీతకై మహా
మతి పవమాన నందనుఁడు మానస సీమను రామచంద్రుఁడే
కొతుకుచు నిండిపోవఁ బరిగొన్న దశాస్యుని దుష్టభావమున్
గితవము గాడు సేయఁ బరికించె రఘూద్వహు నాజ్ఞమేరకున్ 106

రంగుల పూలతోరణములన్ వెలయించిరి ద్వారసీమలన్
బంగరు జాలకమ్ముల సువాసన లీవలికేఁగు వెంచెడిన్
పొంగెడి సుందరీమణుల పోఁడిమి, నవ్వుల పూలజల్లులన్
తొంగలి ఱెప్పలన్ హనుమ ధూర్వహతన్ గమనించె గీములన్ 107

ఒక భవనమ్ము వెంబడి మఱొక్క గృహమ్మును జూచుకొంచు జా
నకి నరయంగఁ బావని ఘనంబగు యత్నముఁ జేసెఁగాని యొం
తకుఁ గనరాదు భూమిజ - యథాస్థితియే యొరవొందె రామమూ
ర్తికిఁ దెలుపంగ నాతనికి తియ్యని వార్తయె లేదు చూడగన్ 108

ఆ భవనమ్ముల నగుపించి రతనికి
నప్సరః కాంతల నతిశయించు
నందకత్తెలు, వీణియలపైని నవ్యక్త
ముగ గానమొనరించు ముదితలు, మొల
నూళ్ల సవ్వడులును, నూపుర ధ్వానముల్
కర్ణపేయముగ నిగారముగను
విన్పించు చుండెను - విభులతోఁ బ్రత్యను
రక్త కామినులు నిద్రల మునింగి,
రన్నిగృహముల ముందర నపుడుఁగూడ
వాజు, లేన్గులు, రథములు వరుస నాయి
తములుగా నిల్చియుండెను - దైత్యవరులు
కినుకమెయిఁ బ్రవర్తింప సాగిరిపెలుచఁగ 109

దనుజులు కొందఱు దర్పమ్ముతోఁ బర
స్పర దూషణలతోడ సంచరింప
మఱికొందఱాశరుల్ మాటలు పెరుగ భు
జాస్ఫాలనమ్ముల నఱచుచుండ
మధువు నాస్వాదించి మత్తప్రలాపమ్ము
లాడుచు నిఁక కొందఱచట మండ
చెట్టపట్టాలతోఁ జెలఁగుచు మత్త కా
మినులతోఁ గొందఱు మెలఁగుచుండ

కొందఱెదురొమ్ము విఱుచుక సందడింప
ధనువులానించి శింజినీధ్వనుల రేఁపి
కొంతమంది నిశాచరుల్ కులుకుచుండ
వెదకె మారుతి తత్పుర వేశ్మములను. 11

గంధానులేపన కార్యమ్ములో నిమ
గ్నలగ నుండిరి కోమలులు నివేశ
ములలోనఁ గొందఱు ముదితలు గాఢని
ద్రల మఱికొందఱు తల్పములను,
ఇఁకఁ గొంతమంది పొల్తుకలు హాస్యోక్తులఁ
బరవశత్వమ్మునఁ బగులపడుచు
నవ్వుచునుండిరి - నాతుకల్ కొందఱు
కోపమ్ముతో బుసకొట్టుచుండి
రిట్టులా ప్రదేశము సర్వమబ్బురముగ
మదగజమ్ములతో నున్న మడుగురీతిఁ
దోఁచె నసురుల బుద్ధిమంతుల, సుగుణుల
సుందరులఁ దైవభక్తులఁ జూచె నతఁడు. 11

మంచిబుద్ధికలిగి, మంచిపనుల్ చేయు
మంచివారు కానిపించిరచట
శ్రద్ధఁగలుగు వారు చక్కని నామముల్
కలుగువారు పురిని గలుగఁజూచె 11

పురుషులలో విరూపులును, ననేకరూ
పమ్ములవారుఁ గన్పడి రతనికి
చంద్రశాలలలోన చక్షుస్యలుండిరి
విలువైన మండనమ్ములను, వస్త్ర
ములఁదాల్చి, మధుపానమునమున్గి ప్రియులతో
నుల్లాసముగనుండి రుత్సవమున
మేనులఁ బూలతో మిసమిసలాడ, న
లంకార మొనరించి రంగుమీఱ

ప్రియుల కౌఁగిళ్ళలోన సిబ్బితినొందుగుచు
పరవశముగ బ్రహ్మానందభరితలగుచుఁ
గొందఱుండిరి యిఁక మఱికొందఱెలమిఁ
బతులతొడలపైఁ గూర్చుండి రతిముదమున 113

ననబోఁడుల్ తమ నాథులన్ గదిసి యానందమ్ముతో నుండి ర
త్యనురక్తిన్ మదనమ్ముమీఱ విషమాస్త్రావేశనంధుక్షిత
మ్మున శోభించిరి నగ్నకాంతలుఁ దనూపృష్ఠప్రకాశమ్మునం
దున బంగారు శలాకలట్లు హనుమంతుండున్ విరక్తిన్‌గనెన్ 114

బంగారపు బొమ్మలవలెఁ
బొంగారుచు జవ్వనమునఁ బొలుచు యువతులన్
సంగతములేక విరహము
నం గలఁగుచు నున్నయంగనలఁ జూచెనటన్ 115

ఆతని కభిసారికలును
ప్రీతలగుచు విభుల రతులరేఁగు వనితలున్
కౌతుకమునఁ దోఁచిరి సం
కేత స్థానమ్ములందు గీములలోనన్ ॥

మానవ దానవ కాంతల
పైనము తెలుఁగంగ నతఁడు వారిముఖమ్ములన్
మానసము తృప్తినంద ని
దానముగఁ బరీక్షఁజేసెఁ దత్పరమతితో ॥

మనుజానకి మండనముల
హనుమంతుఁడు చూచెఁగాన నతివలనగలున్
గొనకొని పరిశీలించెను
కనఁబడలేదవనిపుత్రి గాడ్పుసుతునకున్ ॥

సీతను, బరమాభిజాతఁ బధిస్థిత
        క్షత్రియవంశ సంజాతను, సురు
చిర ప్రఫుల్లలతాభ సీతను, మనసాభి
        జాతను దర్శింపఁజాలఁ డయ్యె
పరమ పాతివ్రత్య భవ్యచరిత్రను
        శ్రీరామ నిష్ఠిత దృగ్విలాన
మన్మథావేశిత మానస సీతను
        వల్లభు మనసులో వరలుసీత

మహీజ, మహిత నారీశిరోమణిని, విరహా
తాపపీడిత సానుస్మృతాక్రాంతి
రమ్యపక్ష్మాక్షి, మహా స్వరపనలేకి
చందముగనున్న సీత గోచరముకాదు. 119

స్పష్టముగ గోచరింపని చంద్రరేఖ
పాంసు సంవృత సుందర స్వర్ణరేఖ
ప్రహరణ ప్రరూఢ పిండిత బాణరేఖ
శ్వసన వికలిత సుందర జలదరేఖ
పవనసూతికి సీత కన్పట్టలేదు 12

వక్త్రలందు వరిష్ఠుఁడు వాయుసూతి
దాశరథి ధర్మపత్ని సీతారమణిని
కనుగొనక దుఃఖశోకము లినుమడింప
నిలిచిపోయెను మూర్ఛ వలె నిరాశ 12

పంచనఖములతో గొప్ప పనసు పోలె
రాక్షసేంద్రుు నివేశము రక్షితులగు
వేలకొలది నిశాచర వీరు లప్ర
మత్తులై యుండగా హనుమంతుఁడరసె 12

వగచెను మారుతాత్మజుఁడు స్వామినిఁగానక ముందుఁ దిన్నవా
నిగఁ బయిలోడి పోయె లఙనీచి నాపసిమేడలోనికిన్
సొగసుగ దీపిలెన్ బ్రహారి సూర్యని బింబము పొటివచ్చుచున్
నిగుడుచు ఘోరరాక్షసులు నిత్యము రక్షణసేయుచుండగన్ 12

ఆ రమ్యప్రాసాదము
నారయ నైశ్వర్యవంతమై భాసించెన్
క్రూరుల యోధుల నాకపి
వీరుఁడు తత్ధామమందు వీక్షించె గాగన్

తురగలించును కాంచన తోరణములు
గొప్పగొప్ప ద్వారము లెన్నొ యొప్పుచుండె
నశ్వసామజ రథములయుం దమాత్య
వర్గ మేతెంచి నిలిచిరి ప్రాంగణమున

సచివులందఱు సింహశార్దూల చర్మవి
రచిత కవచమ్ముల మేనులందుఁ
దొడిగి యుండిరి బెట్టిదులువారు రథచక్ర
నిస్స్వన మపుడు విన్పించె, భవన
మందుండె హేమరత్నాసనమ్ములు పెక్కు
వివిధ జాతుల పక్షివితతి యుండె
నెక్కడఁ జూచినఁ జక్కని స్త్రీ, లనే
కులు గల రట రక్షకులును నప్ర
మత్తులై యుండి రతివల మండనముల
ధ్వను లనూనారఘోషగా వినగనయ్యె
నగరు ధూమముల్ వ్యాపించు నన్ని యెడల
శంఖభేరీమృదంగ విస్వనములాలయు

జరుగు శివపూజ నిత్యమూ సౌధభూమి
హోమములు సాగుచుండెను టీమమందు
రత్నములు నశ్వహారణ రథసిచయము
లంక కాభరణముగఁ వెలంగు చుండె 127

మన్ జూడని రీతిగా హనుమ పోయెన్ సూక్ష్మరూపమ్ముతో
సంబంధు దశాస్య్ఘ దగ్గఱెను నిర్బాధమ్ముగా సుందర
వనీజాత గవేషణమ్మున మహాయత్నమ్ముఁ గావించుచున్
వహారమ్మును నిట్టయమ్ముగను జేయంబూనె నాసక్తితో 128

కఁగానరాదు పరికించిన శ్రద్ధవహించుచున్ హనూ
తుఁడు దానవేశ్వరుని సుందరమంతయుఁ జూచినన్ - వృథా
తరణమ్ముఁజేయు తన సాహసమెల్లను రిత్తయైచనన్
తెలెనిట్లు వాయుజుఁడు సీతనుఁ గాంచుసుపాయ బుద్ధితో 129

అయ్యో! జానకి వైనముల్ తెలియు భాగ్యమ్మున్నదో! లేదో! మా
న్యం బెల్లయు వ్యర్థమై చనునె? పాలించున్ ననున్ రాముఁడే
న్మ్యాలించుచు వేగఁ దోడుపడు నాటన్ - వేఁడెదన్ దైవసా
య్యమ్మందును మంచికార్యముల కూహన్ మించుచున్ నిత్యమున్ 130

నేనెంత వెదకిన జానకి పొలంతవ
కనఁబడ దెటనైనఁ గాని కుజను
బంధించెనో యేమొ పాపాత్ముఁడును రహ
స్యమ్ముగ దాఁచి సిశాచరాంగ

నలకాపుగడలోన నవయించు చుండెనో
        సుదతిని - నేనామెఁ జూచి యెఱుఁగ
నెప్పుడు - గుర్తించు టెటులామె యింగితా
        కార చేష్టలవల్లఁ గాని యితర
విధములుగ సీత గుర్తించు టెరవుచేట
టంచు భవనము సర్వమూ హనుమ వెదకె
భవనపు విమానముల నెక్కెఁ బుష్పకముల
పైకి దూఁకె నుద్యానముల్ పాఱఁజూచె 131

అన్వేషణ నొనర్చె నాపయి కుంభక
        ర్ణ విభీషణ శుకసారణ, ప్రహస్త
వికట, విద్యుజ్జిహ్వ, శుకనాభ, వజ్రదం
        ష్ట్రి, సుమాలి, ధూమ్రాక్ష, జంబుమాలి
దంష్ట్రి, మహోదర, హస్తిముఖ, పిశాచ,
        సూర్యకేతు, కరాళ, శోణితాక్ష
లోమశ మఱియు విరూపాక్ష యింద్రజిత్
        ఘన, విఘన, బ్రహ్మ కర్ణ దైత్య
మందిరమ్ముల వెదకెఁ గడిందిర్గ
వానిలోన ననంత వైభవమె కాని
జానకీదేవి యునికి యెచ్చటను గూడ
కనఁబడక యెంతొ చింతించె గాడ్పుచూలి 132

ఇంక మఱికొన్ని యసురుల గృహములరసెఁ
గాని యెందును భూమిజ కానఁబడక
పోవఁ బవమాన తనయుఁడు పోయె మరల
రావణుని మందిరమునకు రమణిఁ జూడ 133

తోమరములు, శూలములు, పట్టిసలును, ముద్గ
రాది వివిధాయుధమ్ముల హస్తముల ధ
రించి మిడిగ్రుడ్లతోఁ బొదరించి యున్న
రాక్షస స్త్రీల రక్షణ లావు మిగుల 134

ఆ రాత్రించర చక్రవర్తి విభవంబా వాయు పుత్త్రుండు వి
స్ఫారాక్షిద్వయ దర్శనోత్సుకత హర్షస్వాంతుఁడై చూచుచున్
శ్రీరామాభ్యుదయమ్ముఁ గోరి, వసుధాత్మజన్ జూడ శ్రద్ధాళువై
ధీరుండా భవనమ్ము సర్వమును శోధించెన్ బ్రశాంతిన్ వెసన్ 135

సాయుధులైన పెక్కు బలశాలులు రాక్షసు లప్రమత్తులై
వేయికి మించి నిల్చి పరివేష్టితులై పసుఁ గల్గి కాపలా
కాయుచు నుండి రంతిపురి - కానగనయ్యెను వాజిశాలనుఁ గుల్
కూయికినందు దూరమునఁ గొట్టముల నేమగ నాయితమ్ములై 136

సామజమ్ములైరావత సన్నిభములు
పంచకల్యాణి జాతి వశ్వములు - కనుల
పండువగఁ గానిపించెను వాయుసుతకు
యుద్ధ శిక్షణ నిచ్చిరా యుగ్యములకు 137

దానధారలు కురియు వేదండచయముఁ
జెలఁగు వారివాహములు వర్షించు పగిది
మఱియు సెలయేళ్లతోడ రమ్యమ్ములైన
పర్వతమ్ముల భాతిఁగన్పట్టుఁగరుల 138

కాపలా కాయుచున్న రాక్షస ప్రతతియు
రత్నములఁ బొదిగిన యాభరణము లెన్నొ
తాల్చి మేలి వస్త్రమ్ములు తనర పవన
నందనునకుఁజూపట్టె నానందమెసఁగ 139

ఇమ్ముకొను పల్లకులు, భవనమ్ముపట్టు
పమ్మియుండె లతామండపమ్ము లెన్నొ
కలుగు నచటఁ గూటాగారములు, విశాల
రథ్యలును, గృతకాద్రులు, రతి గృహములు 140

తనరు నచట దివా వినోదములఁ బ్రొద్దు
పుచ్చుటకు ననువైన దీములు సహితము
మందరాద్రినిఁదలపించు మందిరమ్ము
నెగడును శిఖావళమ్ముల నిలయముగను 141

ఎక్కడఁ జూడఁ బతాకము
లెక్కడఁగనుఁగొనిన హృదయ మెసగెడుశిల్పం
బెక్కడఁగాంచిన రతనపు
టిక్కగ శంకరుని భవ్య గృహమటులుండెన్ 142

రత్నకాంతులతోడ రావణబ్రహ్మ య
పార పర్వస్ఫూర్తి భవనము ధగ
ధగలాడుచుండెను - సొగసైన శయ్యలా
సనములుం బాత్రలు, శాతకుంభ
నిర్మితమ్ములగుచు నేత్ర పర్వమ్ముగాఁ
దోఁచెఁ బానవనికి మధువులుఁ జషక
ములు సిద్ధమై యుండెఁ దెలుపఁగా - చందన
ధూపము లగరు ధూపములును
లేని మందిరమున గుబాళించుచుండె
కుసుమములుఁ బూలమాలలుఁ గుప్ప తెప్ప
లగుచుఁ గనిపించె హనుమకు నచటి దీప
ములు వెలుఁగు బరిమళ తైలముల సొరిదిగ 143

చక్కఁగా లోకపాల కైశ్వర్యమంత
నచటనే స్థిరపడినట్లు లగపడె - మృదు
నూపుర నినాదములు మొలనూళ్ల యులివు
మర్దల ధ్వానముల హనుమంతుఁడు వినె 144

ధరణి జాతను వెదకుచుఁ దత్పరుఁడయి
భవనమెల్ల గాలించెను పవనసూతి
క్రమముగాఁ గక్ష్యలన్నియుఁ గడచి యంతి
పురిఁ బ్రవేశించె భూమిజ నరయ నచట 145

భవనమొప్పె కుబేరుని భవనము వలె
మధువులును నాసవమ్ములు, మానికంపు
పాత్ర సముదాయమును గల్గి నేత్ర పర్వ
మగుచు తొడత్రొక్కిడియు లేక యలరుచుండె

చరణమంజీర రమ్యఘోషలును, గాంచి
నినదములు, మద్దెలల మ్రోఁత నిలయముఁ బ్ర
తిధ్వనించుచు నుండెను దివ్యసౌధ
మంతట గవేషణ మొనర్చె ననిలసుతుఁడు



# తృతీయసర్గము

వైడూర్యఖచిత సువర్ణగవాక్ష సం
చయముతో దశకంతు సౌధమెంతో
తురగలించుచును విద్యుల్లతా సహిత హా
రిదమండలము వోలెఁబొదలు చుండె
వర్తిల్లుచుండెనవాంతర గృహములు
ప్రతి భవనమ్మున - వలభులుండె
నాయుధశాలలు నలరు నన్ని గృహాల
సమకొను నన్ని ధామముల యందు
ఆ మనోహర భవనమునందు గల్గు
రుచిరకృతకాద్రిసొగసు, శిరోగృహాముల
నరపె బలవంతుఁడైన వానరుఁడు తమిని
కన్నులింతలుగా మేను గగురుపొడవ 1

మించి ధనములతోఁ బ్రకాశించునవియు
శ్రేష్ఠ దేవదానవులుఁబూజించునవియు
దోషములు లేనివియుఁ దనదోర్బలమున
సంచిత గృహమ్ములంజూచె నంచితుండు 2

ఆ గృహములన్ని కూడ ప్రయత్న పూర్వ
కముగ నిర్మింపబడి విశ్వకర్మచేత
నను నిధమ్ముగ నుండె నీ యవనిపైని
సకల గుణ సమంచితముల ప్రకటితమగు 3

మనసరి హాయునందనుఁడు మానిని మైథిలి జాడ నారయన్
బవివడిశోధవన్ జరిపెఁ ద్రాంతగృహమ్ములనన్నిటిన్ మహా
మననముతోడ బుష్పక విమానము దీప్తులఁ జిమ్ముచుండ దా
నినిఁదిలకించె నాస్థను సనీడమునన్ విలసిల్లుచుండగన్

ఆ పుష్పకము సాటియైన దెచ్చట లేదు
అద్ది బంగారపు ముద్ద - భూరి
భూధరమట్టులఁబొలుసారు చుండెను
దానవేశ్వరు రూపదర్ప శక్తి
ప్రచురతేజో వైభవములకు సర్వ వి
ధమ్ములఁదగియుండె దాని యొఱపు
రత్నకాంతులతోడ రమణీయమై భూత
లమునకు దిగిన స్వర్గపురి భంగి
సుమ సమంచిత రమ్య వృక్షముల తోడి
శైలశిఖరమ్ము పగిదిఁదేజరిలు, నప్స
రసల మించిన స్త్రీలతోఁబొసఁగి చంచ
లాసహితనీలమేఘవిలాసగరిమ

హంసగణవాహ్యమానమై యంబరమునఁ
దిరుగు సుకృతాత్మల విమాన దీప్తిఁగలిగి
మెఱయుచుండె గైరికధాతు మిశ్రితమయి
చిత్రముగ నున్న సుందర శిఖరి వోలె

చుక్కల గమితాదుఁదక్కిన గ్రహములు
 నక్షత్రములుఁగల్గునభము భాతి
రమణీయమగు మేఘరాశి కైవడినుండె
 నా విమానము - దాని యందు సర్వ
భూధరమ్ముల తోడి భూమండలంబంతఁ
 జిత్రితమ్మై యుండెఁజిత్రముగను
తత్పర్వతమ్ములుఁ దరువులతో నిండి
 యున్నట్లు చెక్కిరి చెన్ను మిగుల
వృక్షములుఁబుష్పములతోడ విటియఁబాటి
ప్రసవములు, రేకలును, గేసరములుఁగలిగి
రమ్యముగ నుండు రీతిఁజిత్రమగు శిల్ప
మమరుఁదద్విమానములోన నద్భుతముగ 7

తెల్లని నివేశనములఁజిత్రించినారు
జలజకుముదముల్ గలుగు కాసారములును
పద్మములఁగేసరమ్ములు భాసురముగఁ
జిత్రితములయ్యెనందు విచిత్ర ఫణితి 8

భవనమధ్యసంస్థితరత్నప్రతతి చిత్రి
తమ్మగుచు హేమరచిత వాతాయనములు
కలుగు తద్విమానముఁజూచె కపివరుండు
విమల ప్రతిమలతోడ శోభించు దాని 9

పాపులకుఁ బొందరానిది పరమ పుణ్య
వంతులును, మహాత్ములును, ధనవంతులు మఱి
ముదితులు, యశస్వులయిన విబుధుల విమల
మందిరము వోలె నుండె విమానముఁగన 9(

ఇంతియె కాక ప్రహృష్టముఁ గావించు
మఱికొన్ని కలవు విమానమందు
వైడూర్యహేమ ప్రవాళరజతఖచి
తమ్ములు శకునముల్ తనరుచుండె
వివిధ రత్నములతో విస్ఫూర్తిఁ జెక్కిన
వ్యాళముల్, వాజులుఁ బరిఢవిల్లు
పక్షుల ఱెక్కలు వంగియున్నట్లు శి
ల్పములఁ జిత్రించిరి - ప్రసవ బాణ
దేవు పరివారములవి దృష్టమయ్యె
నిమ్ముగా లక్ష్మి పద్మాసనమ్ముపై, ని
షణ్ణయై హస్తముల జలజములుఁ గలిగి
ప్రక్కల గజమ్ములున్నట్లుఁ జెక్కి రెలమి 1

విశ్వకర్మ మయుండు వేత్తయై నిర్మించెఁ
దద్విమానమ్ము నందముగ నెపుడొ
అట రత్నములు లేని, యందమ్ముగా లేని,
యర్థమ్ము కాని దెయ్యదియు లేదు

ప్రభుని వాంఛానుసారమ్ముగా నెగురుచు
 పోవు నెచ్చటికైన వ్యోమ సీమ
ప్రసవసుగంధసంపన్నమై మధుమాస
 శోభఁగ్రిందుపఱుచు సురుచిరమయి
కుసుమమయముగ భాసించు కుజమురీతి
నందమగు కందరమ్ముల నలరు శిఖరి
వలెను మంగళకరమగు ప్రాజ్య పుష్ప
కమును జేరి శోధించెను కపివరుండు 11

రాక్షసేంద్రు బాహువులచే రక్షితమయి
పూజితంబగుచున్న తత్పురిఁదిరుగుచు
నిఖిలజనపూజ్య, పతిగుణనిర్జిత యగు
జానకీదేవి దర్శింపఁజాలఁడయ్యె 12

అంజనాతనయుఁడును, మహాత్ముఁడైన
కీశవరుని మనస్సు దుఃఖించె మరల
నతఁడు పరిపరి విధముల నవనిజకయి
విహ్వలస్వాంతుఁడగుచు భావించె నెంతొ 13

పరమపూజ్య, పతివ్రత, స్థిరతనూజ
మైథిలీదేవి జాడ విమాన మెల్ల
వెదకినను బావవికిఁగానిపింపలేదు
ననరెను నిరాశతోడ నవ్వానరుండు 14

భవనముల మధ్యఁజెన్నారు భర్మ రత్న
మయముగాఁబుష్పకాఖ్య విమాన మెంతొ
సుందరమ్ముగ నట్టి వస్తువు మఱెచ్చ
టను మఱొక్కటి లేదని హనుమ తలఁచె

ఆకసమ్మునఁ బయనించు నర్క మార్గ
మునకు గుర్తుగఁ గనిపించుఁ బుష్పకమ్ము
శ్రమపడి మయుండు విరచించెఁ బ్రతిమలన్ని
ప్రకృతి దృశ్యము లన్నియు ప్రతిభ మెఱయ

అందుగల విశేషమ్ములా యమరులకద
నైనలేవు దశాస్యు మహాతపస్సు
వలన బాహుపరాక్రమముల వలనను
లభ్యమయ్యెఁ బుష్పకము వరమ్ము పగిది

అది యనేక శిఖరమ్ములఁ బొదలుచుండి
మనసునకుఁ దుష్టిఁ గలిగించెఁ గనినతోడ
నద్ది శరదిందు నిర్మలంబై రహించు
పెద్ద గిరి వోలెఁ గపికిఁ గన్పించె నపుడు

సుందరవసంత వేళ కుసుమసమూహ
మువలె నందముగా నుండి ముదముఁగొలుపు
నామనిని మించి కడుమనోహరముగఁగన
మానసము పొంగిపోయె నా వానరునకు

మకర కుండలములఁ దాల్చి మల్లడించు
చును మహాకాయులగు రాక్షసులును భూత
గణములా విమానము మోయుకరణి దాని
క్రింద విగ్రహా వితతి జెక్కఁబడి పొలయఁగ 20

విగ్రహమ్ముల నేత్రముల్ విరివియగుచు
వేగముగ సంచరించెడి విధముతోఁచు
కొమరు మిగులు వసంతము కుస్తరించు
కుసుమములు చిత్రితములయి కులుకరించు 21

ఆ విమానమునందు విహారముసఁటొ
సల్పువారి కోరికఁ బట్టి నడచు వ్యోమ
మార్గమున శీఘ్రగామియై మహిమఁగలిగి
చోదకుఁడు లేకయే చనుచుండునద్ది 22

ందరపుష్పకమ్ముఁగనుచున్ హరివీరుఁడు డెందమందు నా
దము నొందుచున్ జనక నందన జాడ నెఱుంగ శ్రద్ధతో
దళితాంతరంగుఁడుగఁ గన్నులుగా నొడలెల్ల శోధనన్
దువ మొప్పఁ జేసెను ప్రగాఢమనస్కృత సన్నితాపులన్ 23

ధృతి యప్రమేయుఁడు, మహామతి, మారుతి యర్థయోజనా
తమును సుందరమ్మయిన హర్మ్యములెన్నియొ కల్గురావణా
కనముఁ జేరుచున్ భవనమంతఁ గవేషణముం బొనర్చె న
హాత యత్నముల్ సలిపె ద్రష్టగఁ ద్రిమ్మరుచున్ బ్రపత్తిమై 24

ఆయుధపాణులై యసుర వీరులు పెక్కు-
రా మందిరముఁ గాతు రహరహంబు
నాల్గుదంతమ్ముల నాగములా భవ
నమ్ము చుట్టును రక్షణమ్ము సేయు
రావణుసతులు బలాత్కారముగఁ బరా
క్రాంతిఁదెచ్చిన రాజకన్య లెంద
ఱో సుందరాంగులు వాసించి యుండిరి
పంక్తికంధరు హర్మ్య పంక్తులందు
మకర తిమితిమింగల మత్స్యనికరసహిత
వనధిలో సుడిగాలి రేఁగినసమయము
నందెటులనుండునో యటులా దశాస్య
నవసథ మ్మల్లకల్లోలమై రహించె 25

ఐలబిలుని యైశ్వర్యము, నమరవిభుని
సంపదయు వరుణుని నిధి జమునిభోగ
భాగ్యములుఁ దదితరలోకపాలుర ధన
మంతయును రావణుని గేహమందు నిలిచె 26

భవనమధ్యమ్ము నందుఁ బుష్పకముకలదు
పంక్తి కంధరుఁ డద్దాని వైశ్రవణుని
నాలమునగెల్చి తెచ్చెను హనుమ మరల
వెదకి చొరబాఱె రాక్షస విభుని గృహము 27

అద్భుతావహముగ హనుమ కా హర్మ్యమ్ము
రాక్షసేశ్వరు ప్రియురాలివోలెఁ
ప్రత్యక్షమయ్యెను- భవన సోపానము
లింపుగా మణులతో నెసకమెసఁగ
వాతాయనమ్ములు భర్మనిర్మితములై
రత్నచితమ్ముగా రమణమీఱ
స్పటిక శిలల్ నేలపై నతికించిరి
స్తంభముల్ వెలయు ముత్యములఁ బవడ
ములు రజత కాంచనమ్ములు మురియఁబడుచు
వానిపై చిత్రితములయ్యె వనులు, నదులు
సాగరమ్ములు, శైలముల్ సంతపడుసు
కలకలమ్ముల నికిరముల్ పొలుచునచట 28

వివిధ సుగంధ ధూమములు వెల్వడుచుండెను జాలకమ్ములన్
గవయుచు ఘ్రాణతర్పణముగా నగరమ్మున నెల్ల తావులన్
వనములందు భామినులు పాటల నృత్యములం జెలంగఁగన్
వులును గర్ణపేయముగఁ దత్పరతన్ హరివీరుఁడుండగా 29

శైలముల్ నదులును, శాద్వలమ్ములును వృ
క్షములఁ గూర్చిన రత్నకంబళములు
భవనముల్, భూజముల్ భాసురమ్ముగనున్న
క్షితివోలె నేలయుఁ జెలఁగచుండె

నందమ్ముగానుండి డెందమ్మునకును నా
నందమ్ముఁ గలిగించు మందిరమ్ము
దేహమ్మునకు నెంతో దీప్తి నొసంగుచు
దుఃఖహారమ్ముగా తోఁచు గేము
సకల శ్రీ సంపదల కట్టి స్థావరమ్ము
కుడ్యచిత్ర సముజ్జ్వల మీద్యమాన
మైన కళలకు నిలయమై యసురనాథు
రమ్య ప్రాసాదమొప్పు పారమ్యగరిమ

మందమారుతము రమ్యమ్ముగ వీచును
చారుదృశ్యమ్ములు సంతరించు
శ్రవణపేయమ్ముగ సంగీతములు సాగు
ఘ్రాణతర్పణమై సుగంధ మలమె
నాహార సంచయం బతిరుచ్యముగనుండి
యుగ్గడింపగనె నోరూరఁ జేయు
మెఱపుతీవలవంటి యొఱపుతో సుందరుల్
స్వైర విహారముల్ సలుపుచుండి
రమరధామ సమానమౌ హర్మ్య మద్ది
ఆచటిరేని సౌందర్యము నచటలేని
భోగభాగ్యముల్ సంభూతి పుడమిఁగాని
నాకమందునఁ గూడఁ గన్పటఁబోదు 31

రసరూపగంధస్పర్శాశబ్దముల వల్ల
సంతృప్తి నందెను శ్వసనసూతి
కర్మేంద్రియములై దు-కపివీరుఁ డసుకొనె
నదిచూచి యతలమో, యమరలోక
మో, యమరావతియో, బ్రహ్మలోకమో
యని- ద్యూతమందోడి నట్టి జూద
రులు నిశ్చలమ్ముగ నిలిచి పోయెడిరీతిఁ
దద్గృహదీపముల్ ధ్యానగతము
లగుచు నిశ్చలమ్ముగ నుండె మిగులకాంతి
తో దశాస్యుని వర్చస్సుతోడ వివిధ
భూషణమ్ముల నిగనిగల్ పొలుపుమీఱి
మెఱసి పోవుచునుండె సమీక్షణమున 32

ప్రమదలు రత్న కంబళములన్ సుఖనిద్రలనుండి రెంటొ యం
దముగను మేలివస్త్రములఁ దాల్చి, సుమస్రజముల్ ధరించి కై
శ్యముల, యథేచ్ఛ మద్యముల నాస్వాదనమ్మొనరించి తృప్తిగా
సమధికసంగతిన్ బడలి శ్రాంతిఁ గొనన్ శయనించి రచ్చటన్ 33

కొలఁకులన్ హంసగణములు కూర్కుచున్న
విధముగా ప్రొద్దుపొడుపున వికసిత జల
జములు రాత్రిని ముకుళించు చందముగను
సుందరీమణులచ్చటఁ బొందుపడిరి 34

తారకాయుతమగు శరత్కాల నభము
తరళితమ్మగు నట్టులఁ దద్భవనము
అందముగను దేజస్వంతమై నెగడెను
తరుణులను గూడు కొనుచుఁ దత్సమయమందు

ఆ స్త్రీల వర్ణము, నవరూప కాంతి, నై
    ర్మల్యమచ్ఛముగఁ దారకలఁ బోలు
నతిమధు పానమ్ము, సతిరతి క్రీడల
    వల్ల నివశలౌట వలన వారి
భూషణముల్, మాల్యములు నెగుడుదిగుడు
    గా పడియుండెఁ గకపిక నచట
తిలకముల్ చెదరెను చెలులు కొందఱికిఁ బి
    క్కాలదాక కొందఱు కాంతలకును
నందెలెగఁ బ్రాకె-హారముల్ కొందఱికిని
ప్రక్కలను వ్రేలుచుండె-నిరస్తవస్త్ర
లగుచుఁ గొందఱు-మేఖలల్ తెగుచుఁ గొంద
ఱాడు గుజ్జములట్టుల నగపడిరట 30

మగువలు కొందఱు మణికుండలముల ధ
    రించిరి వారు ధరించిన సుమ
మాలలు నలిఁగెను మత్త వేదండము
    వనములో నలిపివేసిన లతలటు

పడీ యుండె - కొందఱు పడఁతులు ముత్యాల
సరములఁగై సేయ సరములపుడు
జాఱి తత్పదతుల స్తనముల మధ్యకు
జరిగి నిద్రించు హంసల విధముగ
నుండె - కొందఱి తనువుల మండనములఁ
దొలఁగి పోయి కదంబ పక్షుల కరణిని
నింక కొందఱు తాల్చిన హేమ సూత్ర
ములఁటొలిచె చక్రవాక పక్షుల పగిదిగ 37

నలినసేత్రలు పృథుజఘనముల తోడ
హంసలును జక్రవాకము లధివసించి
యున్న పులినములం గూడియున్న నదుల
చందమునఁదోఁచుచుండి రాసమయమందు 38

మువ్వలే తామరమొగ్గలుగా స్వర్ణ
భూషణమ్ములె పద్మముల వడువున
శృంగార చేష్టలే పృథురోమములుగ, శ
రీర కాంతిచ్ఛటల్ తీరములుగ
వాహినులటులఁగన్పట్టిరి - కొందఱు
ననవిల్తు సంగరమ్మునను మండ
నములు జాఱినఁగూడ నవకాంగములఁగుచ
ముల మీద వాని నొక్కులు శరీర

ముల పయిని భూషణమ్ములు కలిగినటుల
బొలుచుచుండెను కొందఱి ముఖములఁబడి
యున్న చీర చెఱఁగులు నిట్టూర్పు గాలి
కెగసిపడుచుండె నెంతొ వింతగ నెగురుచు 39

హరి సురభిళ నిశ్శ్వాస మారుతమ్ము
శర్కరాసవ గంధ సంసక్తి నద్ది
యినుమడించి దశాస్యుమెల్లనఁదఱియుచు
రమ్యముగను సేవించు సరణినిఁబొసఁగు 40

నిద్రలో నుండిన నెలఁతలు కొందఱు
రావణాస్యములని ప్రక్కనున్న
ముదితల ముఖముల ముద్దుపెట్టుచు నుండి
రందులోఁగొందఱు హస్తవస్త్ర
ముల దిండులుగ నిద్రమునిఁగి యుండిరి - చాన
యొక్కతె వేఱొక యువతి ఱొమ్ము
పై శిరముంచుక పవడించి యుండె నిం
కొక్కతె దానిపై నొఱగి యుండె
దానిపై పిరుదులపై పుఁదలను బెట్టి
యింతి మఱియొక్కతె యట నిద్రించుచుండె
దాని చేతులపై నొక తరుణి గాఢ
ముగను నిద్రకుఁబడుచు నిమ్మకొని రచట 41

ఒకతె పై వేఱొకతె చేతునుంచుకొనుచు
నుండుటంబట్టి పూవుల దండలవలె
నితతముగఁబూసియున్నట్టి లతల పగిది
నందముగఁదోఁచుచుండి రయత్నముగను 42

కొంతలందఱుఁగలగాపులగంబుగ
శయనించియుండ హస్తమ్మెవతెదొ,
వస్త్రమెవ్వతెదొ, యూపై నగలెవతెవో
చెప్ప నసాధ్యమై చెలఁగె నచట
గాఢనిద్రనుబంక్తికంధరుఁడుండ జా
జ్జ్వల్య మానముగ దీపమ్ములన్ని
సుందరవనితలఁజూచుచున్నటులుండె
కలరన్ని జాతుల కాంతలందు
రాచకన్యలు, గంధర్వ రమణు, లాసు
రాంగనలు, దేవతాస్త్రీలుఁ జెంగలింతు
రందఱిని రావణుఁడు యుద్ధమందు గెలిచి
తెచ్చి నిలిపెను స్వీయ మందిరమునందు 43

వారిలోఁగొంతమంది రావణుని స్వయము
గా వరించి వచ్చిన వారె ! కాని యొక్క
సీత తప్ప తక్కిన వారు చేత మందు
రాక్షసేశ్వరుఁ బ్రేమించు రమణులె కద ! 44

ఆ కాంతల కన్యలపై
నే కాంక్షయు లేదు దానవేశ్వరుఁడనినన్
వేకూర్చువాఁడె ! దైవమె !
లోకేశుఁడె ! రసికలోకలోలుపుఁడతఁడే!

వారిలో నొక్కతెయుఁబెరవాని పత్ని
కాదు – కులహీనయుఁగురూపకాదు పుటియుఁ
చతురత నెఱుఁగనట్టి దెవ్వతెయుఁగాదు
సుఖము, సంతోషమును లేని సుదతి కాదు 4

రమణి యొకతెయు బలహీనురాలు కాదు
పురుషుని మనస్సు కెక్కని పొలఁతి కాదు
తలఁచె వారినిఁగాంచి యనిలసుతుండు
రావణుని తోడ సుఖపడు రామలనుచు 47

ఇటుల రామునితో సీత యిన్ని సుఖము,
లింతయానందమును బొందనెంత బాగు !
పడఁతి గుణవతియగుఁ జెఱపట్టితెచ్చె
రావణుఁడంచునపుడంగలార్చె హనుమ 48

హనుమంతుండు విదేహ రాజసుతకై వ్యాసక్తి నచ్చోటఁద
ద్వనితా మధ్యమునందునన్ వెదక నాపంకేజపత్రాక్షి సూ
చనయేతోఁపగపోవ నాత్మఁదలచెన్ సామీరి "యాసాధ్వి రా
వణు సౌధమ్మున నేలయుండునని దుఃఖాప్తుండు వాఁడౌటచే ! 49

హరివీరుఁడంత శయన మందిరముఁజొచ్చి
దర్శించె నొక్కయుత్తమశయనము
దంతకాంచన నిర్మితము - రత్నవైడూర్య
ఖచితమౌశయనము - కలవు దాని
పై విలువైన తల్పమ్ములు, ద్విపటులు
మౌక్తికమాలాసమంచితమయి
తనరుశ్వేతచ్ఛత్రమును దానికొక ప్రక్క
హరిణలాంచను బింబమటుల మెఱయు
సుందరముగ మంచమున నశోకపుష్ప
మాలలెన్నొకై సేసిరి మగువలచట
వీవనలను వింజామరల్ వీచుచుండి
రిమ్ముగా శయ్య చుట్టును గ్రమ్ముకొనుచు 50

ఆ ప్రదేశము చక్కని యగురు ధూప
ముల గుబాళించుచుండి ప్రమోదమొసఁగె
రావణుఁడు గాఢ నిద్రఁదల్పమున మునిఁగి
యుండె నీలమేఘము రీతి నుండె నతఁడు 51

దనుజేశ్వరుఁడు ధరించిన కుండలమ్ములు
మిలమిల లాడుచు మెఱయుచుండె
నా కంఠముగ మద్య మాస్వాదనముఁజేసి
యుండె నాతండు - బాహువులు పొడవు

గాఁజాపి యుండెను - కట్టెను బీతాంబ
రము, నెత్తి గంధములలదె మేన
దానితో నతఁడు సంధ్యారాగ రంజిత
మై ప్రకాశించు శంపాలతయుత
వారిదము రీతి భాసించెఁ బలువిధముల
భూషణమ్ముల ధరియించి పొలిఁచె వివిధ
వృక్షములతోడ లతలతో విలసితమగు
మందరాద్రి శయించిన మాడ్కి నపుడు

రాత్రి రాక్షస కన్యల రతులఁదేలి
యలసి, శయనించి యుండె దశాస్యుఁడపుడు
గొప్ప కాలోరగము బుసకొట్టు భాతి
విడుచుచుండె నిశ్వాసము వెక్కసముగ

దనుజపతి రావణునిఁగాంచి వెనుక కదుగు
వైచె భయపడినట్టులఁ బవనజుండు
మరల నొకమెట్టుపై నెక్కి తిరిగి పంక్తి
కంధరునిఁదేరిచూచెను కలఁకవీడి

శయనమ్ముపైని రాక్షస సార్వభౌముఁడు
మడుగులో శయనించు మత్తవార
ణము భంగి నుండె, భుజములంగదములతో
నింద్ర ధ్వజములటులెగురు చుండె

రణములలోన నైరావతదంతఘా
తవ్రణితములు, సుదర్శన, పవి
గాయ కిణాంకములున్ కనిపించె స్ఫుటముగా
రావణాసురు పేరురమ్ము మీఁద
హస్త పద్మములు, నంగుళు లమరియుండె
సద్భృతముగ సాముద్రిక మందు చెప్ప
నఖిల లక్షణ సంపన్నుఁడై రహించు
వీను మిగిలిన జగదేక వీరుఁ డగుచు 55

అయిదు తలల త్రాచులవోలె హస్తయుగము
తల్పముననుండ యతనికి దనుజవనిత
లందముగ రక్తచందన మలదియుండి
నదియెంతొ ఘుమఘుమ లాడుచున్నది సుమముగ 56

దితిజులతని హస్తముల మర్దించినారు
దేవజాతుల మున్ను మర్దించె నవ్వి
మందరావనిధరదరులందు నిదుర
పోవు క్రూరసర్పమ్ములఁ బోలు నవియు 57

అతఁడా హస్తములతోడ నలరుచుండి
శిఖరములుగల్గు శైలము చెలువుమీఱె
నతని నిట్టూర్పు గాలిలో వాసన, సుమ
పరిమళమ్ములతో నిండె భవనమంత 58

రవణిల్లన్ శిరమందుఁ దాల్చిన కిరీటం బాతఁడున్ నిద్రకున్
దవులన్ జాఱుచు ప్రాలె బ్రక్కకు నిరాధారమ్ముగా నుండుటన్
శ్రవణాలంకృత హేమకుండలములున్ సారింపఁ గాంతుల్ వెసన్
గదిసెన్ గండములందు నృత్యముల వీఁకన్ నైగనిగ్యమ్ముగా 5

అలరు నాయతవక్ష మందలరు సరులు
రక్తచందన రక్త హారములు మౌక్తి
కాభరణ తతితో నిండి యసురవిభుని
కన్ను లెఱ్ఱగనుండె భయంకరముగ 60

దీపము లన్నివైపులకు దీప్తులఁ జిమ్ముచునుండెఁ బెల్లుగా
భూపుఁడుతోఁచుచుండె మెఱపుల్ తులకించెడి నీలమేఘమ
ట్లేపుగ శయ్యపై నిదుర నింపెసలార దశాస్య కామినుల్
రూపరు లెందఱో యటఁ బరుండిరి నాధుని పాదసన్నిధిన్ 61

వారి వదనముల్ చంద్రబింబములఁ దెగడు
వారు రత్నాలు తాపిన భర్మకుండ
లములఁ గైనేయఁ దత్కాంతి గములు వారి
మొగములకు వింత సోయగమ్ములను గూర్చె 62

వారిగళములనమ్లాన ప్రసవమాల
లందమగు నాభరణముల చందమయ్యె
భూషలును స్థానచలనముఁ బొందకుండ
గూర్చినవి కూర్చినట్టులే కోమరు మిగులు 63

కలరట వైణికుల్, గాయకుల్, మార్దంగి
        కులు - కాని యెల్లరుఁ గుసుకు చంద్రి
పొలఁతులు తాల్చిన భూషణముల్ రత్న
        ఖచితములై వింత కాంతిఁ జెలఁగె
లలితకుండల కాంతులను, విధుబింబ స
        మాన వదనలతో మందిరమ్ము
చుక్కలతో నున్న చక్కని వ్యోమసీ
        మను బోలియుండెను మగువలంత
సహజముగ మదవతులె యాసవముఁ ద్రావి
రందుపై రతిఖిన్నలై డిందువడుచు
నెచట స్థలమున్న వేసరి యచటెపండు
కొనుచు నిద్రించు చుండిరి కొందలపడి 64

ఒకతె నృత్యము సేసియొరగి నిద్రించు చుం
        దెను హస్తవిన్యాసమును వదలక
నావకు చుట్టుకొన్న సరోజలత భంగిఁ
        గునికెఁ గౌఁగిట వీణ తసుక నొకతె
మడ్డుక వాద్యమ్ము మమతతోఁ బసిబిడ్డ
        వలె నుంచి కూర్కొను పడఁతియొకతె
పవడించె నొక్కతె పటహపరిష్వంగ
        మునఁ బ్రియాలింగనము పగిదిగను

మదనమున నింతి యొక్కతె మత్తుతోడ
వేణువును గౌఁగిలించెను ప్రియునివోలె
తంబుఱను సందిలినిఁ గొనె తరుణియొకతె
మద్దెలను ప్రాలిని౹రించె మగువ యొకతె 65

తన్కవాద్యములం బట్టి తలిరు బోఁడు
లలసి నిద్రలకుంబడి రళకళలగుచు
నెవరి వాద్యములను వారలెనకమెసఁగ
తమ పరిష్వంగముల నుంచి తమకముగను 66

వనిత యొక్కతె కలశమ్ముపైని వంచు
కొని తడిసి కొంత వాడిపోఁటుంగ జలము
చల్లి నవకమ్ముగా నుంచు ప్రణము రీతి
నిద్రపోవుచు నుండఁ గన్పించె నచట 67

స్వర్ణకలశమ్ములను బోలు స్తనయుగమ్ము
స్వయముగాఁదన చేతులఁబట్టుకొనుచు
నొత్తుకొనుచును సంతృప్తి నొందుచుండె
గాఢనిద్రలో మునిఁగిన కాంత యొకతె 68

తన్నుఁబోలిన మఱియొక తరుణిఁగౌఁగి
లించుకొని యొక్క లేమ నిద్రించుచుండె
సిగ్గు, లజ్జ నెఱుంగని చెలులు స్వీయ
కార్యముల వినోదముఁగూర్చు కలన నుండి 69

వారందఱికి మధ్యఁ బ్రత్యేక తల్ప మొ
    కండుండె దానిపై నెందు కొలుపు
రూపాతిశయ పరారోప మొక్కటె సుఖ
    నిద్రలో నుండె నానెలఁత రత్న
భూషణ భూషిత, భూరి సౌందర్య వి
    భ్రాజిత తనుకాంతి విభవమునను
శోభఁగల్గించు నా సుందరి దశకంఠు
    మహిషి మందోదరి - మాన్యచరిత
ఆవలీముఖవరుఁడామె యౌవనమ్ము
దీప్త సౌందర్యమును గాంచి దిగ్భ్రమమున
నామె నవనిజయే యను దీమసమున
నెగిరి, గంతిడి, ముద్దాడెఁ బుచ్ఛమెలమి 70

నందమ్మున వాయునందనుఁడు సూహ సౌధముల్ గాలిలోఁ
నోపున్ వెసఁగట్టిగాఁదొడఁగె పీఁకన్ దూఁకుచున్ దూఁగుచున్
గానంబైన యెడంద దైన్యము విడ్చో దూరముం జేసి త
న్మనంబంతట సంచరించెఁదమితోత్సంగమ్ము రెక్కన్ దిగెన్ 71

నుమంతుండు సహోహాతో నటుల హర్మ్యాయత్తుఁడై యుండ నె
మ్మన మందాతని కొక్క యోచన స్ఫురింపన్ దప్పుగా నెంచె భా
వ, "సీతా తరళాక్షి రాఘవుని తప్పన్ భర్తగా నెంచ దే
వు వేఱొక్కనితో శయించునది నేరం బోలునే యెన్నఁడేన్ 72

ధరణిజాత పతివ్రత దాశరథి వి
యోగభరమున వేఁగెడి యువిద - పంక్తి
కంధరుని గీమునందునఁగానఁబడునె ?
నేను భ్రమపడి యుంటినానెలఁతఁగాంచి 73

పరునితో భుజియించునె ? పరుని కొఱకు
నెన్నడైనఁ గైసేయునే ? యితరుఁగలిసి
పాన గోష్ఠినిఁజేయునే ? పతిని విడిచి
అమరవిభుగూడ లెక్కసేయదు జనకజ 74

ఈ జగత్త్రితయంబున నెందుఁగూడ
లేఁడు రామచంద్రుని వంటివాఁడు ఘనుఁడు
అందుచే నీమె యవనిజ యగుట కల్ల !
ఈమె యెవ్వరో కాని నాకెఱుక పడదు" 75

పవన నందనుఁడా యున్న పానశాల
కరిగె వైదేహి జాడల నరయు కొఱకు
తెఱవ లెందఱొ యచట నిద్రించుచుండి
రలసి, యాటపాటల మధు వాస్వదించి 76

విలువగల మండనమ్ముల వెలఁదు లెంతొ
యందముగఁదాల్చియుండిరి - అతివలంత
సరస సల్లాపముల నేయు జాణలగుదు
రందుపై మంచి గాణలు నగుదురెలమి 77

పానశాలనచట లేని పదార్థముల్
        లేవు కల్గు నచట లేడిమాంస
మేకలమ్ములమాంస, మెనుము మాంసమ్మును
        పక్షిమాంసమ్ములు ధర్మపాత్ర
ములలోన కుక్కుటములును, శిఖావళములు
        కొంతకొంత పొసపెకుచుండె
శర్కర, మధువు, ద్రాక్షారసమ్ముతో, దాడి
        మీ ఫలరసములు మిశ్రితమగు
షాడబములు పాత్రలనిండ నింతనింతను
రత్నభూషణములు పెక్కు రమణఁ బెక్కు
పళ్లెరమ్ముల విలసిల్లు ఫలములెన్నొ
పువ్వులును, బూలమాలల ప్రోవు లుండె 78

ఆమిషమ్ములతోపాటు నమృతమటన
తరుణమున పుట్టినట్టి మద్యములు, సురలు,
నాసవములు మాధ్వీకము లమరిచి రట
రహిఁ జెలంగు సుగంధచూర్ణములు పెక్కు 79

తపనీయ రజతపాత్రల సౌరభాన్విత
        మద్యమ్ములు పెక్కు హృద్యభక్ష్య
భోజ్యపానీయముల్ పుష్కలమ్ముగ నుండె
        చషకమ్ములందు నాసవములుండె

సగము త్రావినవి, యచ్చముగఁబూర్తిగ ముట్టి
నివి మధుపాత్రల నెలవుపడెను
రత్నాసనమ్ములు, రమణీయ తల్పము
లక్కడక్కడ నుండె నక్కజముగ
చెదరిపడియుండెఁబాత్రలు చిదురుపలుగఁ
గొన్ని, మెసవగా మిగిలిన కొన్ని భక్ష్య
ఫలములుండెఁబళ్లెమ్ముల, జలములొలికి
యుండె నేలపై - వాడిన దండలుండె 80

దేవలోకరి నొకతుఁగౌఁగిలించుకొని సు
షుప్తినుందరి కొండఱు చోద్యముగను
స్త్రీ యొకతె పెరసుందరి ఏఁలాగి
కప్పుకొని పడుకొని యుండెఁగలల జగతి 81

వారు తాల్చిన సన్నని వలిపములును
పూలవంతల రేకలు, ముంగురులును
వారు విడిచిన నిశ్శ్వాస పవనములను
కదలుచుండె మనోజ్ఞముగా రహించి 82

ఘనసారచందనాగరువాసనలును
మంచిగంధపు పరిమళము, కుసుమ
సౌగంధ్యమును, మద్యసౌరభమచ్చోట
ఘ్రాణతర్పణముగాఁగడలుకొనెను

సవలాలు కొందఱు నల్లగా నుండిరి
        కొందఱుపసిమి రంగునఁజెలఁగిరి
చామనచాయగా లేమలు కొందఱు
        నవయౌవనాంగులందఱును గాఢ
నిదురలో నుండుటను బట్టి మదిర మదము
వలన వివశలుగా నున్న పొలఁతులు పెద
జల్లఁబడిన తామరపూల చందముగను
బరఁగుచు శయించి యుండిరా పానశాల 83

మూలమూలల శుద్ధాంతమున వెదకినఁ
బోల్చుటకు సుప్తవనితల మోములఁగన
జానకీదేవి చారుదర్శనము లేక
యటమటించెను హనుమంతుఁడార్తి మిగుల 84

పరభామలను, బ్రసుప్తలఁజూచితివి నేను
        ధర్మమా ! భావ్యమా ! దశముఖుండు
ధర్మవిదూరుఁడై ధరణిజ బ్రుచ్చిలి
        తెచ్చుటం బట్టి యీ తెఱవల నిట
నీ పరిస్థితులలో నిటుఁజూడగానయ్యె
        విదియకృత్యమ్మైన నేమిసేతు ?
బుద్ధిపూర్వకముగఁబొలఁతుల నేనుఁజూ
        డగలేదు – వారిఁజూడగ మనోవి

చిత్ర గృహములఁబరికించె నాత్రముగను
సరభసమ్ముగఁగాంచె విశ్రాంతి మంది
రముల నెంతయు జానకీ రమణి జాడ
లాతనికి గోచరింపక యలమటపడె 88

ఎంతకుఁగానరాదు కనులింతలం జేసుక చూచినన్ సరే!
కాంత దశాస్య సౌధమునఁ గంటిసెటంచు పచించెఁబక్షి, ఋ
ద్ధాంతము మూలముట్టు పరికఃపరిశీలచేసెతిన్ బరి
క్లాంతుఁడనైతి గావి కనరాదు తలోదరి; మందభాగ్యుఁడన్ 89

చింతించెన్ బవమానసందనుఁడు రాశీభూతదైన్యుండుగా
"కాంతారత్నము జాడలేదు కనుఁగన్ గల్యాణి నాదావణుం
డంతమ్ముంబొనరించి యుండునని పర్యాలోచనన్ దోఁచు నా
స్వాంతమ్మెంతొ తపించు రాము సతికై సంబాధముం బొందుచున్ 90

శీలముఁ బాడుచేసికొన సీత యొడంబడకున్న రావణుం
డాలరి యాచు నామెఁదెగటార్చెనొ? జానకి దుష్టరాక్షస
స్త్రీలను గాంచుచున్ దనువుఁదెచ్చెర వీడెనొ? దానవేశ్వరుం
డీలువురాలినెయ్యెడనొ యిత్వరుఁడై చెఱపట్టి దాఁచెనో? 91

ఏలీలన్ జతనమ్ము సేసినను జాడే సాకుఁగన్పింపదా
లీలామానుష విగ్రహున్ దలసి యేపేతిన విపేది..ఈ దు
ర్మీలుండైన దశాస్యు వైదముల నాసేఁపింపకే, నీరధిన్
నే లంఘించిన లాభమేమి? ప్లవగుల్ నిందింపరే నిస్పృహన్ 92

కారణమేమియనగ - నిగ్రహముతోడ
నేననన్య చిత్తుఁడనౌచు నిద్రిత వని
తలను గాంచితి నిద్ది యధర్మమగునె ?
మహిళయుండును తప్పక మనసలందె ! 85

ధరణినందన స్త్రీగాక తరుణులందె
వెదకితి నధర్మమెటులౌ నావిధము - పథము
లేళ్ల మందలోనుండునె ? లేను కాదె ?
నా మనసు పరియందు లగ్నమ్ము కాదు ! 86

ఏ జాతి ప్రాణులు నా జాతి ప్రాణుల
సాంగత్యమున సుంత సౌఖ్యపడును
దానవేశ్వరుని శుద్ధాంత మంతయుఁ జూడ
నసమంజసమ్మౌనె ? అవనిజకయి
యతివల మధ్యనే నరయుట ధర్మమ్ము !
శుద్ధమానసముతోఁ జూచితి కద !
కానిపించిరి నాకు గంధర్వ వనితలు,
నాగకాంతలు, సురనాగరులును
కాని మా తల్లి సీతమ్మ కానరాద
టంచు హనుమ విచారించి యుంట మరల
వెదకె జానకి కోసమై వేదురుల, ల
తాగృహమ్ములు సర్వము తత్పరుఁడయి 87

చిత్ర గృహములఁబరికించె నాత్రముగను
సరభసమ్ముగఁగాంచె విశ్రాంతి మంది
రముల నెంతయు జానకీ రమణి జాడ
లాతనికి గోచరింపక యలఁ మటపడె 88

ఎంతకుఁగానరాదు కనులింతలు చేసుక చూచినన్ సరే!
కాంత దశాస్య సౌధమునఁ గంటిసఁగుంచు పచించెఁబక్షి, శు
ద్ధాంతము మూలముట్టు పరితఃపరిశీలచేసితిన్ బరి
క్లాంతుఁడనైతి గాని కనరాదు తలోదరి; మందభాగ్యుఁడన్ 89

చింతించెన్ బవమానసందనుఁడు రాశీసూతదైన్యుండుగా
"కాంతారత్నము జాడలేదు కనుచన్ గల్యాణి నారావణుం
డంతమ్మొంటొనరించి యుండునని పర్యాలోచనన్ దోఁచు నా
స్వాంతమ్మెంతొ తపించు రాము సతికై సంబాధముం బొందుచున్ 90

శీలముఁ బాడుచేసికొన సీత యొడంబడకున్న రావణుం
డాలరి యొంచు నామెఁదెగటార్చెనొ ? జానకి దుష్టరాక్షస
స్త్రీలను గాంచుచున్ దనువుఁజెచ్చెర వీడెనొ ? దానవేశ్వరుం
డీలువురాలినెయ్యెడనొ యిత్వరుఁడై చెఱపట్టి దాఁచెనో ? 91

ఏలీలన్ జతనమ్ము సేసినను జాడే నాకుఁగన్పింపదా
లీలామానుష విగ్రహున్ దటిసె యేవిశిన నివేదింతు దు
శ్శీలుండైన దశాస్యు చైదముల నాసేధింపకే, నీరధిన్
నే లంఘించిన లాభమేమి ? ప్లవగుల్ నిందింపరే నిస్పృహున్ 92

నాకున్ బౌరుషముండి లేనటులె నానన్ బోవగా నౌను గొ
దా ! కల్యాణినిఁజూడకే వనచరుల్ ధార్ష్ట్యమ్మునన్ వచ్చియున్
సాకల్యమ్ముగ నెల్ల తావులను సంస్పర్శించియున్ గూడ నే
నా కాకుత్థ్సునకేమి చెప్పుదును కట్టా ! యిట్టి దుర్వార్తనేన్ 9

ఏవిధి వానరేశ్వరుని కెట్టులఁజెప్పెదనిట్టి వార్త - సు
గ్రీవుఁడు చండశాసనుఁడె ! కీడ్పడచున్ విరసుండు మమ్ము దు
ర్భావముతోడ - చూచితిని రావణుసంతిపురమ్ముఁబత్నులన్
చేవఁదలిర్పనెల్లెడల సీతను గానఁగ లేకపోయితిన్ 94

నలిఁగితినెంతొ శోధనను - నాశ్రమ మంతయు వ్యర్థమై చనెన్
బొలఁతినిఁజూడకుండగను బోవుట మంచిది కాదు వానరుల్
కలిసిన సీత వార్తలడుగన్ గనిపింపకపోయె నన్నచో
నిలుపగలేరు ప్రాణముల నేరమితోఁజన శిక్ష తప్పునే ? 95

తారేయు నాయకత్వమ్మునఁగపివీరు
లను దక్షిణాశకుఁబనిచె నార్కి-
మాసమ్ముగడువిచ్చి-మార్గమధ్యముననే
కాలయాపనమయ్యె - గడువు మీఱె
సవితృనందనుఁడెంతొ చండశాసనుఁడౌట
యువరాజు చేసెఁబ్రాయోపవేశ
మతిభీతి సంపాతియను పక్షిరాజు సీ
తా సాధ్వి లంకలో దశముఖుండు

దాఁచెనంచును బలుకంగ దాఁటి వనధి
వచ్చి పౌలస్త్య సుందర పట్టణమున
నామెఁజూడఁబ్రయత్నించి బాములుపడి
తెలియనైతిని వైదేహి తీరు, తెన్ను 96

ఆర్కి యొసగిఁన గడువు స్వయంప్రభ గుహ
యందు నుండ గతించెను యాపనమున
కతఁడు దండించు నన్న భయమ్ము వలన
ప్రమందియుందురు కపివీరులందఱు నట 97

అరిగినచో వచ్చి యంగదుండును, జాంబ
వంతుఁడు ప్రశ్నింప బదులు చెప్పఁ
గలనె ? సీతాదేవి కనిపించలేదన్న
నంగలార్చెదట నిరాశతోడ
ప్రాయోపవేశమ్ముఁ బ్రారంభ మొనరించి
ప్రాణముల్ విడుతురు వాస్తవముగ
రవిజుని చేతిలో ప్రమందుట తన్న నా
మరణమే మేలని మదిఁదలంచి
నీరధిని రెండుమారులు నేను దాఁటి
యొఱగఁబెట్టినదేముండె ? మరల వెదకి
జనకజను గాంచి కాని నేవెనుక కేఁగ
నిదియె నా నిశ్చయమ్ము - లభించు నామె 98

విసుగుదల వల్ల వచ్చును వెలితి కాని
సకల సంపదల్ బడయు నుత్సాహగరిమ
కార్యసాఫల్యమగును లంకానగము(
జుట్ట(బెట్టెద సీతను జూడ(గలను 9

హనుమంతు(డా నిశ్చయము తోడ దైత్యుల
మందిరమ్ముల, మేలుమాళిగలను,
స్వైర విహారముల్ సల్పుట కేర్పాటు(
జేసిన భవనముల్ చేరి వెదకె
మూసిన తలుపు(లెన్నింటినో తెరచెను
సౌధమ్ము లెక్కెను క్రిందకు దిగెను
ప్రత్యంగుళము(గూడ(బరికించె విడువక
అత(డు చూడని మూల అంతిపురము
నందులేకుండె - కోటలో నన్ని దారు
లందు(దిరిగె విలాసగృహాల వేదు
లెక్కె, దీర్ఘికలన్ దిగె నక్కడ గల
చెలువుల గవేషణము(జేసె - చింత మిగిలె ! 100

అతనికి విరూపులును, వికృతాంగులైన
రాక్షస స్త్రీలుతో(చిరి రమణి సీత
యెంత శోధించినను గనిపించలేదు
హనుమ సహనమ్ము(దూలెనయ్యవసరమున 101

అందమున సాటిలేని విద్యాధరాంగ
నలను, జంద్రబింబాస్యల, నాగకన్య,
లమరసుందరులను జూచె హనుమ కాని
పొలతి పొలకువ తెలియక యలతఁబొగిలె 102

సీత కనరాదు - తదితర స్త్రీలు తోఁచు
కొలఁది ఖిన్నుఁడై పోవుచుఁగుందె నతఁడు
తపననందను యత్నముఁదనశ్రమమ్ము
వనధిలంఘన కార్యము వ్యర్థమగుట 103

తీరని కాంక్షతో బయలుదేఱి సమీరకుమారుఁడంతఁబ్రా
కారము దాఁటి బమ్మరిలి కాగల కార్యము నూహసేయుచున్
భారముగాఁదలంచె నిటు "స్వామికిఁదృప్తి నొసంగ లంకలో
నేరిమితో గవేషణను నే నొనరించియు వ్యర్థుఁడైతిగా। 104

తోటలు, బాటలు, దొరువులు, చెఱువులు
కొండలు, గోనలు, గొలఁకులు, భవ
నములు, శుద్ధాంతముఁబ్రమదగణమ్ముల
దీక్షతో నేను శోధించి కూడ
జనకనందనఁజూడఁజాలక పోయితి
పక్షిరాజైన సంపాతి పలికె
నామె దశాస్యుని యంతఃపురమ్మునఁ
గలదని యటకేఁగఁ గనఁబడదట

నామె పరమ పతివ్రత - యసురనాధు
నిలయమందున మతిమాలి నిలుచు నొక్క-
పడిగ ద్యోవీధి నామె రావణుఁడు మెచ్చ
సహయమున లీలఁగ్రిందకు ఁజాఱిపడెనొ ! 1

జలధిఁగాంచి గుండెలు వ్రీలి సమసె నేమొ !
అటుల కాదేని దశముఖు హస్తములను
నలిఁగి బలవంతముగను ప్రాణముల వీడి
యుండునో ! లేద లజ్జతో నుదధిఁబడెనొ ! 1(

ఎన్ని విధముల వేఁడిన నింతి తనకు
లొంగలేదని పౌలస్త్యుఁ డంగనఁదినె
నేమొ ! లేదేని యాతని యింతులీర్ష్యఁ
బ్రాశనముగ సీతను దినివైచిరేమొ ! 10

దాశరథుల నయోధ్యను దలఁచుకొనుచు
మేను విడిచెనొ ధాత్రిజ ! మెలఁత నతఁడు
పంజరశుకమ్ము లాలించు పగిది నెచట
నైన బంధించి యుండునో ! కానఁబడదు 10

ఎటు తలంచిన గూడ నింతి రావణునకు
వశపడు నను మాట వట్టిమాట !
ఏమైన రాముని కేమి చెప్పుదు నేను
చెప్పిన నొక చిక్కు - చెప్పకున్న

నొకచిక్కు విషమమై యుండెఁబరిస్థితి
　　సీతను గనక కిష్కింధ కరుగ
నా పౌరుషమ్మేమి ? నాయత్నములు బూడి
　　దను బోయు పన్నీరె ! వనచరులును
వానర ప్రభువును నేను వ్యర్థుఁడనుగఁ
బోవఁబలుకరు - దశరథపుత్త్రులేమి
యందురందు రాముండును ప్రుందఁగలఁడు
పరుషమును దారుణంబగు పలుకు కాదె ? 109

రాముని మరణవార్తను విన్నమేధావి,
　　యనురక్తుఁడైన లక్ష్మణుఁడు, భరత
శత్రుఘ్నులును నిమిషమ్ములోఁ బ్రాణముల్
　　విడుతురు - దానితో నుడికి తల్లు
లును గతించెదరు వెంటనె - దాసుఁడు ప్రమందు
　　రుమ చనిపోవు వీరుండు వాలి
వధియింపఁబడ దుఃఖ వనధిలో నున్న తా
　　రాదేవి రవిజుమరణము వలన
బ్రతికి యుండునె ? ప్లవగుల గతియు నంతె
నేనుఁజితిపేర్చుకొని దానిపైని భస్మ
మయ్యెదను నా శరీరము వ్రయ్యఁబడుచుఁ
గుక్కలును గాకులును దిన్న కుతుకమె సుమి ! 110

ఇది మహాత్ముల పద్ధతి యింత కంటె
లేదు మఱియొక గతినాకు - రేయి సర్వ
మక్కటా ! వ్యర్థమయి పోయె - గ్రుక్కుచుంటి
నవనిజను జూచి కాని నే నరుగఁదిరిగి 111

పట్టి చేతుల నేఁ బోవ నిట్టి పెన్నొ
ఘోరములు సంభవించును - కుమిలి కుమిలి
యింతమంది నశించిన నేమి ఫలము ?
ఉవిద యిచ్చోట నెచటనో యుండి యుండు 112

నేఁడపో వృత్తినైనను నిలుతుఁగాని
సీతఁగాంచక యెపుడుఁగిష్కింధ కరుగ
నటకుఁజన సర్వనాశనమగుట నిజము
బ్రదికి యుండిన భద్రముల్ పడయవచ్చు 113

అందుచే జీవించిన మంచిదగునుగాదె !
ఇంతి యెటులైన నపహృతయే ! దశముఖు
నకును బదులు తీర్చెద నేను - నాతిఁగనగ
నైతినని రామునకుఁజెప్ప నగునె నాకు ! 114

సీతాపహరణమ్ముఁ జేసినదానికి
ప్రతికార మొనరింప వలదె నేను?
బలశాలియైన రావణు సంహరింపన?
అటుల కాదేని దశాస్యుఁబట్టి

రయముగ యజ్ఞశాలకు బలిపశువును
గొంపోవు రీతి లాగుకొనిపోయి
యభ్రమార్గమ్మున నంబుధిఁ దరియించి
రఘురాము ముందు నిల్పనె? యటంచు

హనుమ భావించె నీరీతి "నర్కజుండు
ప్రాణములు వీడ వనచరుల్ బ్రదుకలేరు ;
ప్రభువులాలించె వారలఁ బ్రాభవమునఁ
గామితార్థములన్ దీర్చి, గౌరవించె ; 115

తారమరణించినన్లైన తనయుఁడైన
సంగదుం డసువుల వీడు నార్తిఁబొగిలి
వికిరపతి మాటమున్ను చెప్పిన విధముగ
సీత దర్శనమౌ నేమొ; చింతవిడుతు; 116

ఇనవంశమ్ము నశించు వానరకులంచేటున్ మహీజాతజా
దనునేఁ జూడకపోయినన్ బురికి బ్రీడాశాస్య చిత్తమ్ముతో
కనుకన్ మందిచి పోవకుండిన మెడన్ గాలమ్ముఁ బ్రత్యాశతో
ననువర్తించుచు యోషలన్ నిలుతురా యంభోధితీరమ్మునన్ 117

కలవిచట ఫలవృక్షముల్-పలవు పెక్కు
మూలములు వాని మెసవుచు హాశినేనుఁ
దగినరీతి వానప్రస్థుఁడుగ గమింతు
కాలమును నిల్చియుండి యిక్కడనె తృప్తి; 11

నా గవేషణమును గొనసాగఁ జేతు
జనకరాజకుమారి నెచ్చటను దాఁచి
యుంచినను రావణుండుద్యమించి నేను
లంక, లంకంత గాలించి రమణిఁ గాంతు 119

మరల మరల గవేషింతు మగువ కొఱకు
పక్షిరాజు సంపాతి యాపడఁతి లంక
నుండెనని చెప్పెఁ గాన నేనుండి యిటనె
యామె జాడల నరసెద రాము నాజ్ఞ 120

రాముని నేను తెచ్చెదన లంకకు! తెచ్చిన లాభమేమి యా
రామ లభింపకున్న నిట రావణు మాట యటుంచి వానర
స్తోమముఁ జంపివైచునది తుచ్ఛమె! నావలనన్ వనేచరుల్
క్షేమముఁ గోలుపోవుచు నశించుట కొప్పను- దూఱరే ననున్ 121

అదిగో! సనీడమందుఁ గననయ్యెనదో యొక పెద్దతోట, నే
నది పరికింపనైతిఁ జని యచ్చటఁ గూడ గవేషణమ్ముఁ జే
సెదను దశాస్యుఁ డయ్యెడను సీతను డాఁచిన డాఁచవచ్చుఁ జూ
చెద వనమంత నామెకయి చెచ్చెరవోయి- లభింప ధన్యుఁడన్ 122

అదియశోకవనంబని హనుమ యెఱిఁగె
దానియందము మించు నందనము ననుచు
దనుజులాడుమాటలఁ బట్టి తనకుఁ దెలియ
నచటఁ గూడ గాలింపగ నతఁడు తలఁచె 123

క్షణము యోజించి తేజశ్శాలియగు హను
మంతుఁడు భక్తి నమస్కరించె
రామలక్ష్మణులకు స్వామిని సీతామ
హాసాధ్వికిని రుద్రులందఱికిని
యమునకుఁ బాకారి, కనిలదేవునకు సూ
ర్యునకుఁ జంద్రునకు, వేల్పులకుఁ బెద్ద
లైన సుగ్రీవాది వానరప్రముఖుల
కును గార్యసిద్ధినిఁ గూర్పవేఁడె
కరునలి సుతుఁడు వనమంతఁగలయఁ జూచె
నెందఱో రాక్షసులు గలరందు దాని
యందు లేని విశేషము లెందుఁ గూడ
లేవు త్రిజగమ్ములను జూడ రిక్తమెయగు 124

పవనసూతి తలంచె "వనపాలకులు దీని
రక్షించుచుందురు శ్రద్ధతోడ
శ్వసన దేవుండు నిచ్చట గట్టిగా వీవ
వెఱచునందురు నేను వెడలుచుంటి
సూక్ష్మరూపమ్ముతో సురలు, మహర్షులు
కార్యసిద్ధిని నాకుఁగలుగఁజేతు
రశ్వినీ దేవత, లజుఁడు, సోమాదిత్యు,
లనలుండు, వరుణుండు, నఖిల భూత

ములును, భూతమ్ములకును బ్రభువగువాఁడు
నాకుఁదప్పక సాయమొనర్చి కార్య
సిద్ధిఁగలిగింతురాధృతి సీతఁగనుల
కఱవు తీర దర్శింపగ వెరవు దొరకు [illegible]

చారువిశాలనేత్ర, విలసన్మృదుగాత్రఁ ద్రిలోక సుందరిన్
క్రూరుఁడుఁ బాపి, రావణుఁడు గొబ్బునఁ దెచ్చెను లంకకున్, బలా
త్కారముగా. రహస్యమగు స్థానమునందున దాఁచెనెచ్చటో
నేరిమితో నశోకవని నేనిప్పుఁడామెను జూఁతునా తమిన్ ।  [illegible]

ఎన్నడు చూడ గల్గుదు మహీసుత నీ శుభవార్తఁ దెల్పుదున్
సన్నుతసన్న మోదమున సాగరతీరమునన్ బ్రతీక్షలన్
ఖిన్నత నున్న మిత్రులకుఁగీశగణాధిపుఁడైన నార్కికిన్
విన్నఁదనమ్ముఁ బాప రఘువీరునకున్ విశదీకరించుచున్ [illegible]

పౌలస్త్యుఁడింతటి పౌరుషశాలియా ?
దొంగచాటుగఁ దెచ్చెఁ దోయజాక్షి
కండబలమ్మున్న గుండె బలమ్మేది ?
మిండతికమ్మున మేటికాని ।
సార్వభౌముండైన చపలచిత్తుఁడు కదా ।
త్రిజగముల్ గెలిచిన ధిషణలేదె ?
శివభక్తుఁడైనను శీలమ్ము శూన్యము
వేదవిదుండైన వెలితి గలఁడు

ఎంత సంగీత పరుఁడైన నేమి ఫలము ?
సరసత నెఱుంగనట్టి యజ్ఞానియె కద
బ్రహ్మవంశమ్మునందునఁబ్రభవమొంది
రాక్షసత్వముతో నుండు రావణుండు 128

ధ్యానమగ్నుండుగాఁగొంత తడవు హనుమ
అచట నడయాడె నటునిటు నా యశోక
వనమునందుఁబ్రవేశించు వలను కొఱకు
యోజనా తత్పరుండుగ యుక్తి నరసె 129

తీరని కాంక్షతో ద్రుతగతిన్ బవనాత్మజుఁ డూఁపుతోడఁ బ్రా
కారము పైకి దూఁకెను నికామముగా వనమెల్లఁజూడ నెం
తో రమణీయమై పొలిచెఁదోట చెలంగి వసంత శోభతో
సౌరభముల్ వెలార్చుచుఁబ్రసన్నునిఁజేయుచు వానరోత్తమున్ 130

సాలముల్, నాగకేసరములుఁజంపక
ములు, నశోకమ్ములుఁబొలుచు వివిధ
పుష్ప జాతుల తోడ - పొలుపారు సహకార
పాదపముల్ పెక్కు - వానిపైని
పలువిధమ్ముల లతల్ ప్రాకుచు గుహల చం
దమ్ముగ నుండెఁగుద్యమ్ము మీఁది
నుండి క్రింది కుటికె నూర్జితుఁడచ్చట
గుబురుల వికిరముల్ కూయుచుండెఁ

గమ్మగా – హేమగంధిత వృక్షమ్ములంటఁ
గొరలుచును మృగ[illegible] గుంపులంత
సుమవిశ్రప్రసూన [illegible]
భారసర్పమ్ములగు [illegible]ములుగలుగు 131

మామిడిగుబురుల పూసి [illegible] గుబురుల
గూడుటుండి పాడుచు నుండెఁ గోకిలమ్ము
శ్రుతిఁగలుపుచుండె తుమ్మెదల్ [illegible]ఘోషమునల
బాలసూర్యబింబమల్లియటు పరగెవసులు 132

అవనిజాంగరేఖల యుత్సాహమందు హనుమ
ముందు నిదురించు నన్నటుపట్టు [illegible]
పదరిపడి పైకి లేచె పహాంగ [illegible]
ప్రసవములు రాలిపడెను తవ్వృక్షమాలిక 133

వివిధ వర్ణమ్ముల విరులవర్షమ్ముతోఁ
పుష్పభూధరముగాఁ బొలిచె నతఁడు
ఆ సుమాంబుల తోడ నతఁడు వనమ్మున
నటు నిటు నడయాడ నవలతాత
ములు తలంచెను వాయుపుత్త్రి వసంతుఁడ
టంచు రాలినపూలనపుడు పృథివి
చూపట్టె భూషితసుందరి చాడ్పున
నతఁడు దూఁకుచునుండ నవనిజములు

దీర్ఘికలలోన హంసలు తిరుగుచుండె
కమలకుముద శోభితముగఁ గ్రాలుచుండె
ప్రక్కగానుండెఁ గృతక పర్వతము దాని
శృంగమొక నీలమేఘమ్ము భంగినుండె 13

దానిపై నెన్నొ చక్కని తరువులుండె
నందమగుపెక్కు గుహలుండె నందుఁ బుట్టి
యొక్క సెలయేరు దిగుచుండెఁ బ్రక్కలగల
భూజములు దానిపై వ్రాలి పొదలుకొనును 14

ఝురముపై వ్రాలిన తరుశాఖలను దాని
వడి తగ్గి పోవగఁ బడఁతి భర్త
పైని కోపించి పోవగ బంధువులు పట్టు
కొనియాఁపుచున్న రీతినిఁ గనఁ బడె
క్రిందికివచ్చు నీ రేపైకిఁ బోవుచు
వెనుకకు వెడలుచు వెలఁది ధ్వనిఁ
గలియు చందమ్మునఁ గానిపించెను శైల
సన్నిధిలోఁ బద్మషండసహిత
సరసులుండెను పక్కగ నిరవుకొనెను
కృత్రిమమ్మగు నొక్క దీర్ఘికయు శీత
లోదకమ్ముల నిండారియుండె రత్న
ఖచిత సోపానముల మౌక్తికసికతలుగ 141

దిగుడు బావికి చుట్టును దివ్య భవన
ములుగల వెన్నియో హార్మ్యములకుఁ జుట్టు
రమ్యపుష్పితారామముల్ రహిఁ జెలంగు
నందుహరిణముల్ దిరుగాడు నందనముగను 14

కృత్రిమారణ్యములుఁ గూడ నెసకమెసఁగు
నందుగల పాదపములుఁ గాయలను బండ్లుఁ
బూలతోనిండియుండెఁ గర్పూరవినిర్మి
తమగు వేదికలుండె ఛత్రములతోడ 14

వేదికల చుట్టు నెలకొను వింత వింత
లతలతోడి సురంగముల్ రమణమీఱె
హనుమ కొక శింశుపా వృక్షమగపడెనట
నద్ధిధర్మమయమ్ముగా నతిశయించె 14

ఆ వృక్షమూల మందలరు విశాల వే
దిక యొండు - దీక్షతోఁ దిలకించు హనుమ
అటనుండు వలుకుఁడా నపరంజి వానరుం
డై యట్లు భావించె నవ్విధమ్ముఁ
గోంకితమ్ముగఁ గుతుకమ్ము రేఁపెసు
దాని నారోహించి దాఁగెను తరు
శాఖల మధ్య నిషణ్ణుఁడై తలపోసె
"నా తల్లి సీతమ్మ నాకుఁ దోఁచు

సీలాంజనము భాతి నెంకొను సటికొన్ని
నానావిధమ్ముల నసల తోడ
నా యశోకవనమ్ము పరిరమణీయమై
నందన వనమటుఁగాంచవించు
చైత్రరథమట్లు వెలయు నక్షత్రగణప
ముజ్జ్వలాకాశమటు రత్నములను నిండి
యున్న సాగరమువోలియుండె నపర
గంధమాదన శైలమ్ము కడణిఁదనరె । 152

సలక్షించె సమీరనందనుఁడు విద్యోతించు సౌధమ్ము నొం
పు రూపమ్ముగ వేయి కంబములతో నాకర్షణీయమ్ముగా
పసన్నమ్ముగ వెండికొండ కొనయట్లుండెన్ వశతమ్ముగా
ప్రదిష్టుండు దశాస్య వైభవముఁ జూపన్ నిల్చు దానిన్ వెసన్ 153

పవడములతోడ దాని సోపానములు వి
నిర్మితములయ్యె - వేదికల్ శర్మమయము
లగుచు ధగధగ మెఱయుచు నక్షి యుగళిఁ
గాంతితో గ్రుచ్చుచుండెఁ దత్కపి ప్రవరుని 154

అచటికిని చేరువగ నొక్క యవనిజమ్ము
క్రింద వీక్షించెఁ బవమాననందనుఁ డొక
యతివఁ గతినోపవాస శుష్కిత శరీర
రాక్షసీ పరివృత దీనురాలిఁ దమిని 155

ఎన్నడును స్నానమెఱుఁగని యింతివోలె
మలినదేహగఁ గన్పించె మగువ చీర
మాపియుండెను దీర్ఘనిశ్వాసములను
విడుచుచుండె బాష్పకణమ్ములఁ దుడుచుకొనుచు 156

శుద్ధపాడ్యమి నాఁటి సోమరేఖ పగిది
దీనాస్యయైన నాతెలివఁ గాంచి
యెంతొ మలినముగ నింతి యున్నను గూడ
నందకత్తెగఁ దోఁచె హనుమ కామె
కౌశేయమొక్కఁటే కట్టియుండెను కాంత
ఉపవస్త్రమేదియు నువిదమేనఁ
గన్పట్టకుండెను కమలశూన్యమ్మగు
బిసమటు వాడి కన్పించె నామె
భీతచిత్త, యంగారక పీడిత మగు
రోహిణినిఁ దలపించెను- దూషితపట
నమున నేత్రముల్ వారిపూర్ణమ్ములగుచు
శోకతప్తయైయామె కూర్చుండి యుండె 157

ఉవిద యుపవాసములఁ జిక్కియుండె - చుట్టు
భయముఁగొలిపెడి రక్కసి బలగముండె
రమణి జడ నల్లత్రాచు చందమగ నుండె
అనిలసుతుఁడామె సీతయే యని తలంచె 158

వోరె, కలుష్టమైన బుద్ధిచంచలమ్మున,
　　సపవాదమునఁ దోషు లరిపను గ్రుంగి
జలదసంఛన్న నక్షత్రకాంతలనుఁ
　　వివరణ నొలుపని విద్య మాడ్కి
కనఁబడగ వాయుసూతి యూహించె సీత
యౌనొ? కాదో? యనుచుఁ దంపాకలితుఁడు
గా నిలిచెఁ గొంతసేపు వృక్షమ్ముఁజేరి
యవనిపైఁ గూరుచుండిన యువిదఁ గాంచి 161

కష్టపడి పండితుండు సంస్కారరహితు
వచనముల నెట్లో తాత్పర్యము కొనెడి
చందమున వాయుపుత్త్రుఁడా జానకిని
యే యనుచు నిర్ధరించుచు నేపుమిగిలె 162

రామచంద్రుఁడు వివరించు రూపు నామె
దేహమున భూషణములుంచె దీప్తితోడ
కొన్ని యవయవమ్ముల నగల్ కొంత వడెను
కాంత విడిచెనో ఋశ్యమూకమున వాని 163

వినువీధిన్ దనుజుండు తెచ్చునెడ నావ్వాన్ గట్టువస్త్రమ్ము కొం
గున మేనం గల భూషణమ్ములను నాక్రోశించుచున్ గట్టి జా
ర్చెను సీతావనజాక్షి కొండపయి సుగ్రీవుండు నాముందఁ జూ
చినఁ దద్వస్త్రవిశేషభాగములరున్ నదాశరీరమ్ముపై 164

అద్ది పీతకౌశేయమే యామె మేన
నున్న దట్టిదె । వర్ణమ్ము నొకచె దార్చి
నట్టి భూషలవంటి హాయతిన మేనఁ
గానఁబడ పొక్కిటియు సీతయే । యెలఁతుక

నష్టదారుఁడనని నవసి జాలిపడుచు
నాశ్రయించిన పత్ని యగుపడదని
ప్రియకాంత చెంతఁగన్పింపకుండె నటంచుఁ
జిరవిరహమ్ముతోఁ జివికి, చివికి
రఘురాముఁడార్తితో రాము జాడల కొండ
కొండవెల్లఁగనులుగా నుండె నచట
సర్వ లక్షణుఁడు విశాల హృదయుఁడతఁ
డామెయు సద్గుణధామయగును
అట్టి సాధ్విని వీడి రామావనీశుఁ
డెటు బ్రతికి యుండఁగలిగెఁ దానింతవఱకు
నిట్టులుండ సామాన్యుల కెటుల సాధ్య
మనుచు రాఘవు శ్లాఘించె హనుమ యెంతో ।

# చతుర్థ సర్గము

అతివ సీతా సాధ్వియని నిర్ధరించుక
హనుమ దుఃఖింపసాగెను "రఘువరు
పత్నియై, లక్ష్మణస్వామికిఁబూజ్యయౌ
వెలఁదికి వనట తప్పినది కాదు
దురతిక్రమమ్ము కాదో యెవరికిఁగాల
గతి దాఁట - రామలక్ష్మణుల శౌర్య
బలపరాక్రమములు వైదేహి యెఱుఁగును
గాన వర్షావేళ గంగవోలెఁ
బొలఁతి క్షీణింపకయె నిచ్చె - కులములోన,
వయసులోన, సదాచారవర్తనమున
నైజమందు సీతారాము లోజగొనెద
రొక విధమ్ముగ కష్టమ్ము లొందవెనటులె
ఈ సీత వలననే యింద్రజుఁడగు వాలి
రాముని చేతిలో మందెఁబంక్తి
కంధరసములు కబంధ విరాధులు
నీ సీత వలననే యీల్గిరెపుడొ
ఖరుఁడు, దూషణుఁడుఁ త్రిశిరుఁడాది దానవ
వీరులు సమసిరి వెలఁది వలన
రవిజుని కెంతో దుర్లభకీశ రాజ్యమ్ము
ప్రాప్తించె కాదె యీ రమణి వలన

వార్ధిదాఁటితి - లంకలోఁ జాడఁబడితి
నీమె యూఁరమ్మనసె - రాముఁడీమె కొఱకు
నెల్ల జగములఁ బ్రమటిలోన దుల్లఁజేయు
సాటి యెటుల త్రైలోక్య రాజ్యము సరికి 2

పరమ పూజ్యుఁడు మిథిలాధిపతి జనకుని
తనయ - సాధ్వీమతల్లిక ధరణిఁజీల్చి
కొనుచుఁబుట్టుక వచ్చిన కోమలాంగి
దశరథుని పెద్దకోడలీ తరుణి సీత 3

ధర్మజ్ఞుఁడెంతో కృతజ్ఞుఁడు, సర్వజ్ఞుఁ
డగు రామచంద్రుని యనుఁగు పత్ని
యీమె యయోధ్యలో నింపొందు సకలభో
గములఁ ద్యజించుచు గహనములకు
భర్తతో నేతెంచె - ఫలమూలములతోడఁ
దనియుచు సేవఁ జేసెను ధవునకు
వనముల రాజభవనముల మాడ్కినా
నందించె నట్టి జానకి నిశాచ
రాంగనల చేతిలోః జిక్కి బెంగఁ గొనుచు
సకల యాతనలందుచు వికలచిత్త
యగుచు నాథుని రాకకై యాసతోడ
నెదురు తెన్నులు చూచుచు బెదరు పడుచు 4

చూడదు రాక్షసాంగనలఁ జూడదు పుష్పములన్ ఫలమ్ములన్
చూడదుచుట్టు ప్రక్కలను చూడదశోకవనమ్ము సీతకున్
వేడుకలేదు దేనిపయి విప్పదు దస్సులు కూడఁ జింతనన్
గోడుఁ దొలంచు భర్తకయి కోపురి వేఁగు నిరీక్ష సేయుచున్

ఈమె యేకాగ్రచిత్తయై రామచంద్రు
నే మెడఁద నభిదర్శించు ధ్యేయునిగను
భర్తకంటెను వేరెయాభరణమున్నె!
అతివజాతఁకు లేమి కార్శ్యమ్మె తోఁచు

పడఁతులకుఁ బ్రాణనాథుఁడాభరణ మగును
అట్టి భర్త దగ్గర లేక యవనిజాత
వదనము కళావిహీనమై పరగుచుండె
సీత విడిచి రాముండు నిశ్చింప నుండె

ఈదృశసాధ్వి వీడి ధవుఁ డెట్టులయుండెనొ నింతిలేక ని
ర్వేదము దాఁచి కొంచుఁ బలవింపక లోపలఁ గుందుచుండెగా!
పైదలిఁజూడ గుండె చెఱువై కనులందున నీరునిల్చెడిన్
లేదటువంటి యోర్పుగల రేమ ధరిత్రిని బుట్టఁబోదిఁకన్

లలనయు రామలక్ష్మణుల రక్షణతోఁ బదుమూడు వత్సర
మ్ములఁగడపెన్ సుఖమ్ముగను, మున్కరుడైన దశాస్యుఁడీమె దొం
గిలి కొనితెచ్చె నిచ్చటికి కీడ్పఱచెన్ వనిలోన నేలపై
నిలువగఁ జేసె నిర్దయ ననింద్యపవిత్ర మహాపతివ్రతన్

జతవిడు చక్రవాకి వలె జాలిమెలంగుఁ దుషారసిక్తమై
కుతికిలు పద్మమట్లు విపుకున్ జికురమ్ములఁ జక్కనేయకే
పతినిఁదలంచి నేత్రముల బాష్పములన్ విడుచున్ దురుక్తులన్
దితిజలు చుట్టుఁ జేరుచుఁ బ్రతిక్షణమున్ విసిగించి యేర్పగన్ 15

ఎట్టి దుష్కర కార్యమ్ము నేని చేయు
దాశరథి తనపత్నికై - దానవేశ్వ
రుఁడు మడియుట తథ్యము - లోకయాత్ర
సుఖదమగు నింక నారాక్షసుండు ద్రుంద 16

అన్ని గుఱుతులఁ బరికించె హనుమ యామె
యవనిజ యటన్న దృఢ నిశ్చయమ్ము తోడ
తరువు నెక్కి కూర్చుండెను తరుణ మరసి
రామ సందేశ మందింప రమణిఁగలిసి 17

కలువ పువ్వుల రాశిగా కాంతులీను
చంద్రబింబము పశ్చిమాశకును వ్రాలె
శ్వసనజునకు సుధాంశువు సాయపడువి
ధమున శీతమయూఖముల్ సమకొనెనట 18

నేదగొనె హనుమంతుఁడు సీత కొఱకు
నగరమెల్లను వెదకుచు - నాతియునికి
తెలిసెఁ గావున నొక కొంత తేఱుకొనగ
నరుసమున చెట్టు గుబురులో నతఁడు నక్కె 19

వస్తుభారముతో నౌక వనధి మునుఁగ
సిద్ధముగ నున్న రీతిగ సీత దుఃఖ
భారమున గోచరించెను బవనసూతి
కామె రాక్షసీ పరివృత యగుచు ధరణి 20

లీలగా వానరుఁడు విమర్శించి చూడ
సీత చుట్టునుగల రాక్షసీ జనమ్ము
వివిధ శస్త్రాస్త్రములతోడ వికృత వదన
లగుచుఁ గన్పించి రవనిపై హనుమ కపుడు 21

ఆ రాక్షసాంగనల్ ఘోరదర్శను లందు
నేకాక్షి యొక్కతె, యేకశ్రవణ
ముండె నొక్కతెకు - వేఱొకతెకు శ్రోత్రముల్
శిరమెల్లఁగప్పెను - చెవులె లేవు
మఱియొక్కతెకు - శంకు మాదిరి కర్ణముల్
కలవు - నిట్టూర్పులుఁ దలను దాఁకు
నొక నిశాచరికి - వేఱొకతె బానపగిది
కడుపుతోనుండె - నొక్కతెకు శిరము
గుంపవలె నుండె నొక్కరక్కసికిఁ గంధ
రమ్ముఁ బొడవుగనుండె బకమ్ము భాతి
నొకతెకు శిరోజములె లేవు - ఒకతెజుట్టు
కంబళము పఱచినరీతిఁ గ్రాలుచుండె 22

చెవులు భుజమ్ములఁ దవులు నొక్కతెకు, ను
దురు పొదుచుకొని ముందునకువచ్చె
నొక దాన వాంగన, కొకతె స్తనమ్ములుఁ
బెద్దవై క్రిందికి వ్రేలుచుండె
పిక్కలు పొడవుగా నుక్క కంబమ్ముల
వలెనుండె నొకతెకు, పంది కోఱ
లటు దశనమ్ములుఁ బటుతరమ్మై యుండె
దనుజ కొక్కతెకుఁ బెదవులు వహ్ని
కణముల విధాన నెఱ్ఱవై తనుకు నొక్క
టక్కరికిఁ గ్రింది పెదవి గడ్డమును గప్పె
నొకతె మరుగుజ్జుగా నుండె నొకతె లొట్టి
పిట్టవలెఁ దోఁచె నొకతెకు పిల్లికళ్లు 23

కతెకు రొట్టకన్ను, మఱియొక్కతె కుండెసు చిట్టి పండ్లు, వే
నొకతెకు, నూఁచ కాళ్ళు, నిఁక యొక్కత పేఁకు మొగమ్ము చాన, యిం
కొకతె వికారరూప, మఱియొక్కతె కుండెసు కేవొకండె, వే
రొకతెకు ముక్కులేదు; ఇఁక నొక్కతె నాసగజేంద్రుతుండమే 24

కొందఱికిఁ గనులు పెద్దవి
కొందఱి నాలుకలు వ్రేలి కుహరమ్ముల దీ
తిందల కొను నాస్యమ్ములు
కొందఱికిన్ బొఱ్ఱలటుల గోళ్లను గలుగున్ 25

కొందఱివి పంది మొగములు
కొందఱు శార్దూలముఖులు, గోమాయువులన్
గ్రిందు పఱచు వదనమ్ములఁ
గొందఱు జనకజను జుట్టి కూర్చుండిరటన్

పరిఘా పట్టస శూల పాణులగుచున్ బ్రాల్మాల కాసక్తితోఁ
బరివేష్టించి నిషణ్ణలై మదిర నాస్వాదించుచున్, నంజుడుల్
సరగన్ మెక్కుచు మధ్యమధ్యను పిశాచస్త్రీలు సీతా సతిన్
వెఱఁగందన్ బరుషమ్ములాడఁగని నిర్వేదించె సామీరియున్

ఒకతరు మూలమందువిద సీతాసాధ్వి
కూర్చుండియుండెను క్రూర రాక్ష
సీ గణమ్ముల మధ్య క్షీణ పుణ్యగ భూమి
పైరాలి పడినట్టి తారపగిది
పంచాస్యముల మధ్యఁ బరఁగు కరేణువు
కైవడి, మేఘముల్ కప్పినట్టి
శశిబింబ మటుల, పుష్పరహితలతభంగి
దుల్లిన తంత్రుల వల్లకి గతి
పంకమంటిన వనజము భాతియామె
యందముగ, వికారమ్ముగఁ బొందు పడెను
స్రుక్కి మూర్తీభవించిన శోకమునలెఁ
గనఁబడినఁ గూడ హర్షించెఁ గపివరుండు

పట్టి పట్టిచూచెఁ బడఁతిని కరువలి
పట్టియామె పుడమిపట్టి యౌనొ
కాదొ! తేటపాటు కను లింతఁ జేసుక
నిట్ట వొడిచె మేను - నెలఁత సీత 28 (అ)

తన గవేషణ సత్ఫలితముల నీయఁ
గాంతఁ గాంచిన ప్రమదమ్ము శాంత పఱుప
నూఱట లభింపఁ బొంగె వాయుజుఁడు రామ
కార్య నిర్వహణమ్మునఁ గష్టపడియు 29

జాలిఁబడుచును దీర్ఘనిశ్వాసములను
విడుచుచుండెను మృగమటు బెదరు చూపు
లను ధరణిఁజూచుచుండె విరక్తి, యలఁత
వదనమునఁ బ్రస్ఫుటింపఁగ వనరుహాక్షి 30

హనుమ శోకమ్మునందియు నవని జాత
కష్టములు తీఱు నిఁక ముందు కొంత వలన
ననుచు నానందబాష్పముల్ కనుల వెల్లి
గొనగ మ్రొక్కెను రామలక్ష్మణుల కెలమి 31

తరువుపై నుండె సదాగతి నందనుం
డంతలో వేగు జామయ్యె, నంధ
కారమ్ము సడలె లంకానగరమ్మున
నలుగడ వేదఘోషలు వినఁబడె

మంగళ వాద్యముల్ చెంగలింపగ మహా
　　బలశాలియైన రావణుఁడు మేలు
కొనుచు ప్రస్తవసనమణిహారమాల్యముల్
　　సరిపడ నమరించి జనకరాజ
తనయఁదలఁచెను - వెరవేఁకిఁదలఁకి, తలఁకి
ఆఁగికోలేకరేఁగు నూహాల నొకింత
సుందరాశోకవనమున సుందరిఁగన
నరిగె దశకంధరుఁడు కామ మతిశయింప　32

సుదతినిఁగాంచ రావణుఁడశోకవనమ్మునకేఁగ రమ్యమై
పొదలె వనమ్ముఁబుష్పముల, భూజముఁలన్ మఱి తోరణమ్ములన్
రొదలొనరించు పక్షుల విలోచనముల్ తనివారు వాపికల్
మదినలరించు చుండిన సరస్సులనేకము గల్గి గోముగన్　33

అమరగంధర్వ భామిను లనుసరింప
బయలుదేఱు మహేంద్రుని భంగిఁబంక్తి
ముఖుని వెంబడి నూర్గురు ముదిత లనుస
రించి వెడలిరి పురికొని వేఁడుఁగదల　34

కాంచన కరదీపికల తోడఁగొందఱు
　　వింజామరమ్ముల, వీవనలను
వాలవ్యజనములఁబాణుల ధరియించి
　　పడఁతులు వేని వెంబడి వెడలిరి

కదలిరి హేమ భృంగారముల్ జలపూర్ణ
ములఁజేసికొని దశముఖుని ముందు
కొంతలు మఱి విచ్చు కత్తులఁగొందఱు
రత్నకంబళముల రమణఁదాల్చి
కరములను మఱి కొందఱు గరితలు, మధు
వులను శాతకుంభ పాత్రల ధరించి
కొందఱును హస్తముల వెల్ల గొడుగుఁబట్టి
వెలఁది యొక్కతె రావణు వెంటఁగలరు 35

మేఘముతోపాటు మెఱుపు తీవల వలె
నిద్రమత్తున నున్న నృపుని పత్ని
లును వెంట వచ్చిరి లలితములైన యా
భరణముల్ చిందర వందరయ్యె
రాలి పోవగ నంగరాగమ్ము లటనట
కైశ్యముల్ వీడి మొగములఁజెమట
ముమ్మరమ్ముగఁబట్టెఁగొమ్మలఁబాన ని
ద్రామదమ్ములను నేత్రములు నింక
నెఱ్ఱగా నుండె వారు ధరించినట్టి
పుష్పములు స్వేద సిక్తమైపోయె వారు
భర్త యెడలను గౌరవ భావముండి
ప్రేమఁగలిగియు వెడలిరి విభుని వెంట 36

మనసును సీతపై నిలిపి మద్యముఁద్రావుచు వారి తోడ మె
ల్లన నడచెన్ దశాస్యుఁడు విలాసముగా హనుమంతుఁడంత నా
వనితల పాదనూపుర రవమ్ములు వీనుల సోఁక వారలన్
గనుఁగొనె ముందు రావణునిఁగాంచెను ద్వారప్రదేశమందునన్ 37

మెఱసెఁగరదీపికల నెల్లు మీఁదఁబడగ
దనుజనాథుఁడు ధగధగ కనుల జ్యోతు
లటుల నరుణమ్ముగా నుండ నతసుఁడలరు
బాణముల వీడి వచ్చిన పగిదిఁదోఁచె 38

అంసమున నున్న యుత్తరీయమ్ము జాఱఁ
బంక్తి ముఖుఁడలవోకగా పైకిఁదీసి
కొనుచునుండె విలాసము తనుక, వచ్చ
నతఁడె రావణుండని యెంచె ననిలజుండు 39

హనుమ యగోచరుండు గను నాకుజశాఖలమధ్య దాఁగె నా
జనకజ, విక్రమోద్ధతుని, సాహసు, భూషితుఁ బానమత్తతన్
గనుఁగొని ఝుఁరులోఁ గదళికై వడి నూఁగి వడంకెఁ బెల్లుఁగన్
దనుజనృపుండు తాను వనితాసహితుండుగ వచ్చుచుండఁగన్ 40

తోడనే జనకాత్మజ తొడలతో, సు
దరము, బాహువులను బయోధరములుఁ గనఁ
బడని విధముగఁ గప్పుక ముడుచుకొని ని
షణ్ణయయ్యెను దానవేశ్వరుఁడు రాఁగ 41

మహిజ కన్పట్టెను మంత్రరుద్ధోరగి
మాదిరి, చింతన మానిమఱచి
నట్టి విద్యవిధాన, నపవాదమున పోవు
కీర్తిచాడ్పున, ధూమకేతు వావ
రించిన రోహిణీరీతిగ, మంచి వం
శమునందుఁ బుట్టి దుష్టకులమందుఁ
బడిన కన్యవిధానఁ బాడఱు ధనలాభ
మటుల, శుష్కంబైన నాపగ బలె
సైనికులు నశియించిన సేన ఖాతి
ద్రవ్యములు లేకచెడిపోవు దైవపూజ
పగిది, చల్లారిపోయిన వహ్ని తేవ
రశ్మి రహితయౌ చీఁకటిరాత్రి కరణి 42

శిత వృక్షశాఖ పృథివిన్ బడియుండినరీతి సీత దు
ద్రు వధియింపవేగ రఘురాముని రాకను గోరుచున్ దురా
సమగు నాపదన్ దలఁచి జాల్మనిఁగాంచి హతాశయై పదిం
ఎగ దురంత దుఃఖమునఁ బావని మూర్ఛగమయ్యె నంతటన్ 43

గ్రహణ మందున్న పౌర్ణమిరాత్రివోలె
సామజము పాడుసేయు కాసారమటుల
మందతప్పించి కట్టిన మదకరివలె
కటిక చీఁకటి నిశవోలె కానిపించె 44

దీన, పతివ్రత దేహమ్ము శుష్కమై
యానంద శూన్యమై మేన మలిన
వస్త్రమ్ముతోడఁ దపస్స్వమాధినిఁగల
వైదేహి నరసి రావణుఁడు సాంత్వ
నోక్తులు పలుకుచు నురియాడు సీతకుఁ
దనయభిప్రాయముఁ దనుకు కనుల
వివరింపఁబూనె "నోభువన సుందరి! నన్నుఁ
బొడగని నంతనే ముడుఁగుచుంటి
వేల స్తనములు నుదరమ్ము నిటులఁగప్పి
కొనుచు నా చూపు నరికట్టఁ గోర లగ్గె!
సాధ్వసంబేల రావణసార్వభౌముఁ
డే వలచివచ్చెఁ గరుణింపవే సుభపడ 45

దనుజులు. మానవుల్, సురలు, ధైర్యముతో నినుఁ దేఱిచూడఁ గన్
మనమున నిచ్చగింపరు సుమా! నసుఁగాంచి భయమ్ముఁజెంది, నీ
వును భయమందరాదు నినుఁబొందగ యత్నము నేయుచుండ ని
న్ననువున నీవు నాదు వదనమ్మును జూడవదేమి కర్మమో! 46

పరకాంతా హరణమ్మను
బరభామా సంగతమ్ముఁ బాపమె! మా యా
చరుల సనాతన ధర్మము
తెలివా! కిల్బిషమురాదు తిలకించు మొగిన్ 47

ననుఁగామింపని నిన్నుఁ దాఁకుటకు నెన్నండేను యత్నింపఁటో
వను సీతా। భవదీయసాధ్వసము విశ్వాసమ్ముతో పీడుచున్
ననుఁ బ్రేమింపుము దుఃఖమున్ దొలఁగు కానన్ నీకు నా పొందుతో
ననుకూలమ్మగు సర్వభాగ్యములు రాజ్యంబిచ్చి మన్నించెదన్

నేను తొందరపడఁ గాని యేమాత్రము
సాధ్వసమ్మునకు నాస్కారమేది ?
విశ్వసింపుమునన్ను–ప్రేమించుమాపైని
శోకమ్ముతోడఁ గూర్చుండ మనమె ?
తలదువ్వకొనకుండ ధరణిపై శయనించి
మలినాంబరమ్ముతోఁ గలఁచె బాటి
మనసెక్కడో యుంచుకొనుట మంచిది కాదు
ఇదినీకుఁ దగనిదోయింతి ! నీవు
నన్ననుగ్రహించి నావలెఁ జిత్రవి
చిత్ర హారచయముఁ జెలువుగాఁ
బ్రీతిఁదాల్చు సాటిలేని పానీయము
లాని తృప్తిహొందు మవనిజాత !

అంగరాగమ్ముల నలఁగించు కొనుచు నా
ఘ్రాణించు మగురు పొగల నవనిజ
ధరియింపవలె వివిధములైన వస్త్రముల్
దివ్యభూషణములఁ దొడవ మిగుల

నాఢ్యాసనముల, శయ్యల నుపయోగించు
కొనుము, పాడుము, పాటలను వినవలె।
ఆడుము రక్తితో నాటలఁ జూడుము
వాద్యముల్ వినుము భువనముల గల
సుందరుల కన్న మిన్నవు సుఖములకును
దూరమై యెంత కాలము దుఃఖపడుచు
నుండమంచిదె? నాయందనుండి నీవు
ప్రేయసీ! నను గరుణింపవే వయముగ 5

నాతి! గొప్పది నీ యౌవనమ్ము - మిగుల
రమ్యమైనది- గడచిన రాదు మరల
జలప్రవాహము ముందుకు జరుగుఁగాని
వెనుక కెపుడైనఁ దిరిగి వచ్చునె తెలుపుము! 51

సుందరులకన్న మిన్నవు- సుఖములకును
దూరమై యెంతకాలము దుఃఖపడుచు
నుండ మంచిదె ! నాయందనుండి నీవు ?
దానవేశ్వరు రాణివై తనరమేలు ! 52

ధర్మమే జవ్వనమ్ము వ్యర్థముగఁ గడప
నీదు సౌందర్యము సృజించి స్వాదువుగ, వి
ధాతమఱి సృష్టిసేయగఁ దలఁకి మాను
కొనె నటించుచు దలఁ చెదఁ గోమలాంగి ! 53

నీ సౌందర్యము మించు నందమెట నేనిన్ గాంచనే సందుచే
వాసింపన్ భవదీయ యౌవనము రూపంబున్ విలోకించినన్
గాసిం బొందుచు బ్రహ్మదేవుఁ డయిసన్ గాపూతురుండౌనుసూ!
ఓ సీతా! యిఁకఁదక్కు వారి విషయం బోలాకు కాదేతమిన్ 54

ఎక్కడెక్కడనుండియో యింపులొలుకు
సుందరాంగనలను దెచ్చి యిందునిలిపి
నాఁడ! భార్యలగా వారుఁ నాకు సుఖము
లిచ్చుచుండిరి సుఖమంది మచ్చెకంటి! 55

నీదేహమ్మున నెందుఁ జూచినను గానీ! నిల్చు నా నేత్రముల్
వైదేహీ! యటనే - విచారమును సుద్భ్రాంతమ్ము వీడన్ వలెన్
నాదుష్టత్వముఁ జీరికిన్ గొనక యానందింపుమా భార్యవై
వాదం బాడక నీకు పట్టమహిషీత్వం బిచ్చి మన్నించెదన్ 56

నేను సమస్త లోకముల నెమ్మిఁ జరించుచు నెన్నొ రత్నముల్
కానుకగా గ్రహించితి సుఖంబుగ వాని గ్రహించి నీవు నా
పైని ననుగ్రహమ్ము నెఱపన్ నినువేఁడెద లంకనంత స్వా
ధీన మొనర్చెదన్ దరుణి! తెక్కలికానిగ నెంచఁబోవకే! 57

నీకున్ భృత్యుఁడనై చరింతు నెపుడున్ నీ యాజ్ఞయే యాజ్ఞగాఁ
బ్రాకాశ్యమ్ముగనెల్ల కార్యముల నిర్వర్తింతు, భూమండలం
బేకాగ్రుండుగ నే జయించి యిడెదన్ హెచ్చిల్ల సీతంద్రికిన్
నాకున్ మాన్పుము మన్మథార్తిఁ జెలియా! నాస్ఫూర్తి వెల్గించుచున్ 58

నాకు సాటియగుచు నైపుణిం గలిగిన
వీరుం డొకండు లేండు విశ్వమందు
నన్ను యుద్ధమందు నయముగ నెదిరించి
గెలుచు వాండులేండు పొలంతియెందు 59

దేవదానవు లెందఱో నావలనం బ
రాజయమ్మును బొందిరి రమణి! పెక్కు
సారు లెవ్వరు నను గెల్వం జాలకదలి
పుంజములం ద్రెంచుకొని పాఱి పోయిరెపుడు 60

మనసు సరిచేసి కొనుము సామాన్య వగుదె!
సకల భూషణముల్ దాల్చి సముఖమందు
సంచరింప నానందింతు జానకి ! నను
స్వీకరింపుము భర్తగా చెలువ మెసంగ 61

చక్కనమ్మ కూడ చిక్కిన నందమే
కృశతగోచరించు కృశముమేన
రాజ్యహీనుం డైన రాముండు బలపరా
క్రమములందు నీడు కాండు నాకు 62

నా సర్వస్వము నీవే !
నీ సుందరమూర్తి యింక నేవళ మడుగుచున్
వాసించు సకల భోగము
లాశించి సుఖింపు మవనిజా ! చేకొనుచున్ 63

విశ్వసింపుము నన్ను వెలఁది ! నాతోడ భో
గముల ననుభవింప ఘనత కాదె !
నా సర్వ రాజ్యము, నా సర్వ ధనము నీ
యిష్టమేరికి నైన నీయ వచ్చు !
నాతోరమింపుము నా చేత సేవలు
చేయించు కొనుము నీ చేత బంధు
వులుఁగూడ హర్షింతు రెలమి నా బల పరా
క్రమములఁజూడుము - గౌరవమ్ము.
యశము నెంచుము భూపుఁడనగుదు, వల్క
లమ్ముల ధరించు నీ పతి రామచంద్రు
తోడఁబనియేమి ? రాజ్యము తొలఁగె - లేదు
హావి కెట్టి యైశ్వర్యము ననులఁదిరుగు 64

మంగళ రూపిణీ! మామకనిస్తుల
యశమును, సంపద నరయవేమి?
వల్కలమ్ములఁ దాల్చి వనములఁ దిరిగెడి
రామునితోడ నీవేమిచేతు
వాతని రాజ్యము నపహరించిరి మున్నె
వ్రతములో నుండిన వట్టి బేల!
చుట్టును జలముండె మెట్టలేఁడాతఁడీ
నేలపై యేలధ్యానింతు వతని

విజయమును మూలఁ బెట్టిన వెఱ్ఱివాఁడు
ధరణి శయనించు ననివేకి దశరథసుతుఁ
డుండెనో, యూడెనో వానియునికి లేదు
చారులెవ్వరు తెలుపరా జనుని మాట
ఓ విశాలాక్షి ! కరుభోరు; ఒంటరముగఁ
జూచెదేలను కాంక్షించు చుంటి నిన్ను
సకల లోకమనోహారి! సాదరముగ
గౌరవమ్మునఁ బ్రేమింపఁగా వలచెద 64

హేమకశిపుడు తన భార్య నింద్రుఁడు కొని
పోవ నారదు పరిముఖమ్మునను వేఁడి
తెచ్చుకొనె పాటులంబడి తిరిగి - యింక
వెలఁది ! రాముఁడు నిన్నుఁదప్పింపలేఁడు

నీ మందహాసము నిరుపమానము, నీదు
దశనముల్ చక్కనై తనరుచుండు
సొగసుగా నుండు నీ సోగకన్నులు, నైన
తేయుండు పాములఁ దినహరించు
మాడ్కినై దేహి నా మనసు హరించితి
వంబరమ్మును మాని - యమనమేల ?
ఉపవాసముల తోడ నువిద ! నీ కాయము
నందుఁగృశత్వముఁబొందుపడును

నిన్నుఁ జూచిన కనుల నానెలఁతలఁగన
నెంతయొ వికారమగ నుండి చింత వచ్చి
వారి మీఁదకు మరిఁ మ వలపు, మనసు
వారిపై నధీశ్వరి పోదు వలపు మింక ! 66

అప్సరసలంత లక్ష్మికి నవసర పరి
చర్య లొనరించునట్లు నా భార్య లంత
నీకు సేవలఁజేయుదు రాశ్రయించు
కొనుచు సువిధేయులై నిత్యమనుమతించి 67

రాజిలుచుండె నైలబిలు రత్నములన్నియు నాకడన్ మహా
రాజగు నాకుఁబత్నివయి రాజ్యము, రత్నము లన్ని నీవిగా
తేజము మీఁటొందిది యరతిందొలఁగింపుము నాకు కోమలీ !
ఓజ గొనున్ బరిస్థితులు యుక్తములై పొసఁగన్ బ్రయత్నమున్ 68

తపములో, విక్రమంబున, ధనములోన
యశములోఁ దేజమందు నీ యనుఁగురాముఁ
డెపుడు సరిగాఁడు నాతోడ నింపు మిగులు
మద్యమానుచు ననుఁగూడిమాడి తిరుగు ! 69

రమణి ! నీ రామచంద్రుఁడు బ్రదికి యుండె
నో మృతుండయ్యెనో చూడ యువిద ! తెలియ
రాదు-చారులుఁజెప్పగా లేదు నాకు
బ్రదికి యుండిన రాలేఁడు లంకపైకి 70

లోకాలోకమ్ముల న
స్తోకవిహారముల నీకుఁజూపించెదఁబ
ల్లోకి రమింపుము వైభవ
మాకర్షితమై వెలంగ నభిమానముతో

మా సముద్ర తీరమ్ములు మహిజ! పుష్ప
వృక్షములతోడ, లతలతో వెలయుచుండు
నచట నీవును నేను విహారములను
సలుపవచ్చును తమిమీఱ చంద్రవదన!"

అనుచున్ సాహసయుమ్ముగాఁ దన బలంబైశ్వర్యమున్ మిన్నగాఁ
దనుకుంగన్నులతో వచింప విని దుఃఖావేగముల్ మించ రా
ముని భావించుచు నంతరంగమున నామోదింప కా సీతయున్
దనకున్ జేరికి మధ్యనొక్క తృణమున్ దా నుంచి పల్కెన్ ధృతిన్

"అనుచితంబగు నీ వాంఛనడఁచు కొనుచు
విస్మరింపుము మోహమ్ము విడిచి నన్ను
క్రూరకర్ముఁడు మోక్షమ్ముఁ గోరఁదగఁడు
తగునె నన్నుఁ గోర నీకు యుక్తమ్ముకాదు!

నేను పుట్టిన వంశము నిరుపమాన
మటులె మెట్టిన వంశమ్ముఁ బటుతరమ్మె!
నాకు నాపతి దైవము సోఁకులదొర!
తుచ్ఛవాంఛల నిలుపవ దోసఁగువచ్చు!

వానప్రస్థవ్రతమ్మునఁ
గా నలఁదిరుగాడుచున్న కొనుత్థ్సుఁడు లం
కానగరముఁ జేయుటయన
గా నమ్మగలేవు కడలి కలుగన్ జుట్టున్ 76

నేనుఁ బరస్త్రీని, నీకు భార్యను గాను
ధర్మమ్ము గుర్తించి దనుజ! సాధు
మార్గమ్ములోఁ బోవ మంచిది, నీభార్య
లను నీవు రక్షించుకొను విధముగ
నితరులు కూడ తా మింతుల రక్షించు
కొనెదరు విను నీవె మనసున నొక
యుపమానముగ వాంఛ నుత్సర్జితముఁజేసి
కొనుచు నీ పత్నులఁ గూడి తృప్తి
పడుము - స్వీయ కాంతలఁ దృప్తి పడని వాని
పరిభవింతురు పరసతుల్ పాపి! నీకు
బుద్ధి చెప్పు పెద్దలులేర? పొసఁగినయెడ
వారి మాటలు వినిన నీ బాధ యున్నె! 77

విపరీత బుద్ధితో నృపతివై యుండియు
సంచరించుచు సదాచార ముపు
రాక్షసేశ్వరుఁడ! తిరస్కరించితివిగా
సదుపదేశముఁ జేయు సజ్జనాళి

దనుజవినాశమ్ముఁ గవిపెట్టు కొనియుండ
దానిమన్నింపవు - ధాత్రివిభుఁడు
మంచి చెడ్డలను గుర్తించక పోయిన
దుర్నీతిపరుఁడైనఁ దొడరి సర్వ
నాశనం బౌను-నేఁడు నీ నగరమెన్నొ
రత్న రాసులతోసుంగ రావణ! యిఁక
నీ వలన భస్మరాసులు నెలవు కొనుచు
దుష్కృతమ్ముల విభవమ్ము తొలఁగిపోవు

దూరం బాలోచింపని
వారల దుష్కృతము వలనఁ బాడఅగఁ బ్రతీ
కారము చేయఁగ జనములు
స్ఫారాశులఁజూచి సంతసముఁ బొందరొకో!

బలమున్ పౌరుషమున్ బరాక్రమము, నైశ్వర్యమ్ముఁ జూపింప నే
నెలమిన్ లొంగెద నంచు నెంచితివి కాదే! రిక్తయే యద్ది దు
ర్బలగాఁ జూడగరాదు నన్ను దితిజా! భంగించు నీ యత్నముల్
విలసద్రామమహీశుతుంటు దునుమున్ విక్రాంతి నిన్నే త్రుటిన్

నీయాటల్ కొనసాగవెమ్మెయిని భ్రాంతిన్ వీడుమోయీ! పతిన్
నాయారాధ్యునిగాఁ దలంతు నభిమానంబొప్పఁ బ్రేమించెదన్
ధ్యేయం బతఁడె. తద్భుజాశ్రయమునన్ దీపింతుఁగానీ నినున్
శ్రీయున్ సంపదఁ గల్గినన్ వలవ నిస్సీ! రావణా! ప్రేమయా?

పరమ్మై నాకును రామ చంద్రు కవినాగాపమ్మె కల్గున్ మఱె
వ్వరిపై లగ్నము కాదు నామనము - నా ప్రాణమ్ము రాముండె, యె
త్తఱి విద్యాధన మొక్కస్నాతకునిదే దాహ్యంబు నీ కాంక్ష యా
శర! నే నెప్పుడు రాముపత్నినె - దు రాశన్ వీడ న్యాయంబగున్ 82

జలజ బాంధవు విడిచి తేజమ్ము నుండ
నటుల నాథుని కెడమౌచు నెటుల నిలుతు?
మానుమిఁక నీ ప్రలోభము మహిప! వెదక
నేల మృగతృష్ణలో జల మెచట దొరకు! 83

నేను కులపాలిక నగుట నింద్యమైన
కార్య మొనరింపఁ బూనిన కలుషమె కద!
నేను మానవస్త్రీ నౌట మానవపతి
తోడ సుఖమంద ధర్మము- దురితమేల? 84

ఒక్క దురూహకుఁబాల్పడి
చక్కని నీ లంకయును నిశాచరకుల మి
క్కతన నశింపఁగఁజేయగ
మక్కువఁజూపెదవె చెప్పుమా! శ్రేయమొకో? 85

రావణా! మంచి దారికి రమ్ము! వనము
నందున వియోగ బాధతో నటమటించు
కరిణి గజరాజుతో చేర్చు కరణి నీవు
దుఃఖితను నన్ను రామునితో కలుపుము 86

దనుజ ! సుఖముగ నీ వుండఁదలఁచితేని
ఘోర దుర్మరణముఁబొందఁగోరవేని
సఖ్యమొనరింపవలె రామచంద్రు తోడ
నతఁడు ధర్మజ్ఞుఁడగుట నీ కగును శుభము । 87

పావనుఁడు శరణాగతవత్సలుండు
నీ వతని నాశ్రయించిన నెగడు సుఖము
నిన్ననుగ్రహించును రామునికిని నన్ను
నంచితముగ సమర్పింప మంచి జరుగు। 88

రాముని నన్నుఁజేర్చినఁబురాకృతపాపము లేది క్షమమౌ
భామను దొంగిలించిన యపప్రథపోవును నిన్ను మిత్రుఁగా
గోముగ స్వీకరించును నిగూహనముంబొనరింపమాని నీ
వా మహనీయుతో చెలిమి నద్భుతముల్ నవరింప నౌనుగా । 89

లేద । మఱియొక రీతిగా నోదనుజ । ప్ర
వర్తిలిన సర్వనాశమే । పాకవైరి
వజ్రమైన, జముఁడు పాశ బంధమైన
విడువ వచ్చును నాపతి విడువఁడు నిను 90

నీకును నీ వంశమునకుఁ
బ్రాకటముగ శుభము కలుగు ప్రయతుఁడవై, న
న్నా కల్యాణ గుణోత్తము
నౌకలన మొనర్చి చేర్పుమా । యిపుడైనన్ 91

వాసవుఁడు విడుచు పవిస్వానమటుల
రాఘవుఁడు వీడు ప్రదరరావముండు
దాని త్వరలోనె వినెదవు-దాశరథుల
బాణములు నిష్ఫలమియు సర్పముల భాతి। 92

రాక్షసుల శవములతోడ లంకనిండి
పోవు వారి తీవ్రాశుగముల వలన, ని
శాచరులు పోట్లై రామచంద్ర విభుఁడు
గరుడిగా మాఱు సమయమ్ముఁగదియు నసుర। 93

రాక్షసాధీనము గల రాజ్యలక్ష్మి
వామనుని రూపమునను గైవసముఁజేసి
కొనిన భంగి రాఘవుఁడు పోరున వధించి
నిన్ను-నసుఁదీసికొనిపోవు నిజము। నిజము।। 94

మును జనస్థానమున గల దనుజులంద
ఱిని మహీక్షితుఁడే సంహరించె నొకడె।
ఈః వశక్తుఁడ, వధముఁడ వింతి దొంగి
లించితివి దాశరథులట లేని తఱిని 95

భషకమును బులి వాసనఁబట్టి నిలువఁ
బోవ దా ప్రాంతమున నట్లె నీవు రామ
లక్ష్మణుల వాసనలు దవ్వులగ భయమున
నసుర। రాలేకపోదువా యనవరమున 96

తొలి వృత్రాసురుఁడేమి సేసెను మహేంద్రున్ సంగరం బందు న
ట్టులె నీవా రఘురాము బాణముల పట్టుం జూచియే యుందువో
పొలదిండీ! యనుజాయుఁబ్రక్కనిలువన్ బోరాడి సూర్యుండొగిన్
జలముల్ పీల్చిన భంగి నిన్నిచటనే చక్కాడు నిక్కమ్ముగా

వైశ్రవణు పట్టణమున రావణ! వసించి
నను, వరుణుని శఁబు వేఁడినను పిడుగునఁ
గూలిపోయెడి యొక మహా కుజము రీతి
చావు తప్పదు రాము హస్తముల నీకు

అనుచుఁ బ్రతిఘటించు నవనిజాతనుగాంచి
యుగ్రుఁడౌచు దశాస్యుఁడిటుల పలికె
"పురుషుఁడుఁ బ్రీతితో బుజ్జగించు కొలంది
స్త్రీలు భావింతురు లోలకర్ణు
డటుల లోఁకువఁ జేసి, యతని నిష్టము వచ్చు
రీతి మాటాడుచు రెచ్చగొట్టి
పరిభవించెదరు, చతురుఁ డైన సారథి
తెన్నుఁ దప్పుచుఁ బర్వుతీయు వాజు
లను బథమ్మునకుం దెచ్చు కొనెడి లీల
మహిజ! నీయెడఁ గల్గు కామమ్మె నాకు
నీపయినిఁ బుట్టు కోపమున్ నిగ్రహించి
నన్ను నిర్వీర్యు నొనరించు నాతి! చూడు

మనుజులకుఁ గామ మెప్పుడు మత్తుఁ గొలిసి
యెంతొ ప్రతికూలముగనుండు నెట్టి కామ
మెవరిపై పుట్టునో వారలెంత దండ
నార్హులైనఁ జెలంగు స్నేహమ్ముఁ బ్రేమ 100

వెలఁది! రామునిపై నీవు ప్రేమఁ జూపు
చుండినను, జంపదగినట్టి మొండివైన
పరిభవింపగ నర్హ మౌ పడఁతి వైన
నిపుడు నా కామమే చంపనీయకుండె 101

భామ! నాయెడ వాడిన ప్రతి వచనము
నిన్ను వధియింపఁ దగినదే! మన్నిగొనను
నీకు నేనిచ్చు గడువులో- నియమ మింక
రెండు మాసములుండెఁ బరీక్ష నేతు 102

గడువు గతించునంత దనుకన్ బరికించెద నింక మీఁదటన్
వడచిన నేఁటి తీఱుగను నాథునిగా నను స్వీకరింపకే
ముడుఁగుచుఁ గూరుచున్న యెడ భూమిజ! నిన్ వధియించి సూదుడున్
వడపును వండి ప్రాతరశనమ్ముగ జాలిఁ దొఱంగి ద్రేల్మెడిన్" 103

అనుచు గర్జింపగ నసురేశ్వరుం దది
విశదముగాఁ జూచి విబుధకన్య
కలును, గంధర్వ కాంతలు వదనమ్ములఁ
బ్రక్కకుఁ ద్రిప్పి నేత్రములు వారి

పూర్ణమ్ము లగుదు నాభూమిజ నోదార్చి
రక్షులఁ బెదవుల సతికృతముగఁ
గదపుచు దీసి రాక్షసుఁడుఁ జూడని రీతి
దాసితో నెంతయు ధైర్యమూని
శౌర్యమును దెచ్చుకొని పల్కె జనకజాత
"అనుభవజ్ఞులు నీదు శ్రేయస్సుఁ గోరి
తగదు నీకిట్టి ఘోరకృత్యంబటంచు
మందలించు పెద్దలు లేరె? మత్తహృదయ 104

వాసవుని పత్ని శచివంటి వనితనేను
నన్నుఁ గోరు దురాత్ముఁడు నైకృతికము
గా మఱొక్కఁడు మూఁడులోకమ్ములందు
కనఁబడఁడు రాక్షసాధమ! కలుషబుద్ధి! 105

అమితతేజశ్శాలియైన రామునిభార్య
ముచ్చిలి నీవెందుఁ బోవఁ గలవు
రక్షించు కొనగ నీ ప్రాణముల్? రాముఁడు
మత్తేభ సదృశుండు మనుజమాత్రు
డని తలపోయకు మనురాధమా! క్షుద్ర
శశముఁబోలుచును నాశర! ఖరాది
రాక్షసుల్ మ్రందిరి రఘురాము చేతిలో
గుర్తుండదే యిది కూడ- గజము

శరము( బోరాడ నెటులుండు! సాహసికుడు
రాము(డెక్కడ? నీవేడ? లజ్జలేదె?
ఆశ్రమమునందు( బతిలేని యవసరమున
తెచ్చితివి నన్ను దొంగిలి దిటిట! ఘనమె? 106

రాక్షసా! నన్ను( గాంచు నేత్రమ్ములింక
రాలి పోలేద? దశరథరాజు స్నుషను
నన్ను దుర్భాషలాడిన నాల్కయూడి
పోవదేమి? నిన్ క్రుటిలోన బుగ్గి సేతు 107

అటుల నేయగ నాకు రామాజ్ఞ లేదు!
నా తపమ్మును క్షీణమౌ నాలిముచ్చు!
కాన నే నూరుకొనుచుంటి(గాల్పకుండ
రాము(డుండిన(దేలేని రావణ నను! 108

విధి నీకు వ్రాసె నొంటక
నిధనము నా భర్తృహస్త నీరేజములన్
బ్రధనమున(గనుకనే యిటు
లధికామము మిన్నుముట్ట నాశర! మెలగన్ 109

ఈవు కుబేరుసోదరుడ వెంతొ పరాక్రమశాలి వయ్యు దు
ర్భావముతోడ( దెచ్చితివి వంచనతో నొక మాయలేడిగా
వావిరి నొక్క రాసవుని(బంపి వసూ త్తముడేగ బైటికిన్
చీవరధారివై దరిసి దేశ్పడ(జేయుచు నిష్వరుండవై 110

అంతటి వీరుఁడ" వనుచును
కాంతయు నిష్ఠురములాడి గాసిఁబడగ నే
త్రాంతముల నిప్పు లుమియుచు
దంతురిత స్వాంతుఁడయ్యె దానవపతి తాన్ 11

నీలమేఘము భంగి నెగడె నాశరభూపుఁ
డున్నత భుజుఁడును నూర్జితుండు
స్తనిత గంభీర మాతని గళనాదము
సింహబలుండు, విచిత్ర వేషుఁ
డతని మకుటముఁ బర్వతశిఖరము వలెఁ
గ్రాలును, పుష్పహారమాలఁదాల్చె
రక్తవస్త్రముఁగట్టె రమణీయ తారహా
రములు, బాహుపురులుఁ గ్రమముఁదప్పి
క్రింది కొరగెను మందరగికిఁజుట్టి
నట్టి వాసుకి వలె నుండె నాతని మణి
మేఖలయుఁగుండలమ్ములు మెఱసె బాల
సూర్యబింబము పగిదిగ సురుచిరముగ 112

కల్పతరువు రీతిఁగామవల్లభములా
దివ్యభూషణముల దేహమందుఁ
దనరుచున్నఁగాని దానవుండు శ్మశాన
చైత్యమటుల భీతి సంతరించె 113

కన్నులెఱ్ఱఁజేసి, కమలలోచనఁగాంచి
మండిపడుచుఁజెంత మగువలుండి
తీఁపురముగఁజూడ - దీర్ఘమ్ముగాఁబెర్గె
రజ్జులాఁడు కొఱికి రదన పఙ్క్తి 114

సీత ! నీభర్త సజీవుఁడో, నిర్జీవుఁ
డో నీకు తెలియునా ? యుత్పథమున
నినుఁగొని తెచ్చి యాతనిని నిర్జీవుఁగా
నించితి నిన్నుఁదప్పించి యతని
దృష్టిలో తొలఁగించి దేహిగా నుండిన
నతఁడు శవప్రాయుఁడగుట నిజము
బలపరాక్రమములు పంచబంగాళమై
పోవు నీవిరహమ్ము పొసఁగు కతనఁ
జిపికి, చివికి ప్రాణములఁద్యజించి యుండు
చెప్పు మిప్పుడు వాఁడేమి సేయఁగలఁడు ?
బ్రదికి యుండిన నా ప్రతాపమున కీడు
కాఁడు, జీవన్మృతుండు, రాలేఁడిచటికి 115

పరమ దరిద్రుఁడై వసులఁబట్టి చరించుచు నీతిహీనుఁడై
గరిమ యొకింతలేక నరకంబుగఁగాలముఁబుచ్చు నీధవున్
మరిమరి నా సమక్షమున బంధుర భావముతో స్మరింతు వా
నరుణుఁడు చీఁకటిన్ దఱుమునట్లు సమూలము నశియింపఁజేయుదున్" 116

అనుచు గర్జఁజేసి యసురుఁడు పిలిచెఁబి
శాచ వదనలగు నిశాచరాంగ
నలను జర్ఝరుల, వినమ్రులై వచ్చి ని
ల్వగను గర్కశముగ పలికె నతఁడు 117

మీరందఱేకమై ఘోరయత్నములతో
సీత నా భార్యగాఁజేయ వలయు
లొంగిన మంచిదే! లొంగనిచో యేమి
చేసినన్ సరియె మెచ్చెదను మిమ్ము!
దనుజులార! యవనిజను సామదాన భే
దములనే కాకుండ దండయుక్తి
నైన సాధించి భార్యను జేయవలె నాకు
కడుజాగరూకతఁగలిగి మసలుఁ

డనుచుఁగట్టడఁగావించి యవలి కరుగ
నపుడు ధాన్యమాలిని యను నతని పత్ని
తన పరిష్వంగమందున ధవునిఁజేర్చి
ముద్దుగొనుచు వాచించె గోముగఁబ్రియుఁగని 118

"ఈ దరిద్రమానవకాంత, యీ విరక్త,
యీ యకామతో ప్రియుఁడ నీకేమి ఫలము?
నే సకామను నా తోడనే రమింప
నీకుఁగలుగు నానందము నిరవధికము, 119

నీభుజబలార్జితములైన నిఖిలభోగ
ముల ననుభవించు యోగమ్ము నలువ యీమె
ఫాలమున వ్రాసినటుల కన్పడదు, నీకుఁ
దగ వపేక్షలు నిరసించు తన్వియెడల 120

నీదేహాకారముననే
వైదేహియదంగు నింకపైఁ దృష్టియెటుల్
నాదయితుఁడ! సీతాఁకిడి
నేదైనభరింతు నాకు నిమ్మా! సుఖముల్ 121

తనపై నిష్టములేని కాంతఁ గవయన్ ద్వాదృక్కు యోచింపఁగన్
ఘనమే? దేహమునొచ్చు - గౌరవముఁ బోకన్ మాన దీయింతి నీ
కనుకూలంబగునంచుఁ దోఁచదు - తురీయానంద మీకాంతతో
దనుజశ్రేష్ఠ! లభింప దీ కడఁక వ్యర్థం బౌట తథ్యం బగున్ 121 (a)

వలచిన భామతోఁ గలియు ప్రాణపతీ! సుఖమబ్బుఁ గాని యీ
పొలఁతిని వేఁడుకొంచు వలపున్ బ్రకటించు మటంచుఁ గోరఁగా
నలుపముగా గణింతుసు ప్రయత్నము మాను" మటంచుఁ బల్కఁగన్
ములుచయునవ్వి పాదములు భూమిపడంకగఁ బోయెఁదన్నుచున్ 12

తపన మండలాభమును సుందర సువర్ణ
మయము నగు మందిరమునకు మరలి చనియె
రావణుఁడు, దేవ గంధర్వ రమణులతని
ననుసరింప జనకజపై నార్ద్రహృదుల 12

అరుగ రాక్షస నాయకుఁడంతిపురికి
భీకర నిశాచరాంగనల్ వెలఁది చుట్టుఁ
జేరి తలకొకరీతిగాఁ జెప్పఁదొడఁగి
రామె మనసును మార్ప దురాగ్రహముగ 12

ఏకజటయను దానవి చాకచక్య
సరణి వచియించె సీతతో సరభసముగ
"దశముఖుని ముద్దు రాణిపై తనరమేలు
విను మతని వంశవృత్తాంత మవనిజాత! 125

అట్టిఁడు నీదు కన్నులకు నానక పోయెనె? ఓసి సీత! తా
కట్టిఁడిగాఁ గనంబడె- బికారిమగండొక గొప్పవానిగా
నట్టిటు మాటలాడెదవు హాయిసిఁ బొందక మేలి సంపదల్
కట్టుకపోయినన్ని కలుగన్ నిరసించెద వోర్మిఁవక్కుచున్ 126

రావణ సార్వభౌముని వరాటకముం బలె నెంచరాదె! నీ
భావము మార్చుకోదగును వైభవముం దలపోసి భర్తగా
వావిరి స్వీకరింపుము - శుభంబగుఁ దేజము హెచ్చు దానితో
కేవల మిద్ది నీ విఁకను గేండ మాడుచుఁ ద్రోసిపుచ్చకే 127

పోదొక యింత గౌరవము- ముద్దుగరావణుఁ జెట్టపట్టను
ర్వ్యాదయు హెచ్చు నీ మనసు నాతనిపై మరలింప మేలు- దు
ర్వాదము లేలచేసెదవు రంజిలు తప్పక భాగధేయమున్
లేదు మఱొక్కమార్గము వరింపుము దానవనేతఁ బేర్మిమై 128

రావణుం డెవరసు కొంటివే వెలఁదుక!
ఆతఁడుఁబులస్త్య వంశజుఁడగుఁ బులస్త్యుఁ
డజుని మానసపుత్త్రుఁడౌ నతని మాన
సాత్మజుఁడు విశ్రవోబ్రహ్మ యనఁ బరగును 129

ఆరుగురు ప్రజాపతులందు నాపులస్త్య
బ్రహ్మ నాల్గవవాఁడు విశ్రవసుఁడును మ
హాతపస్వి, తేజశ్శాలి - యతని పుత్త్రుఁ
డగు దశాస్యుఁడు తెలియు మీ మగువసీవు"  130

హరిజటయన్న దానవి ప్రహాస మొనర్చుచు గ్రుడ్లు త్రిప్పుచున్
దరదుర పల్కె వెక్కసముతో "నసురేశ్వరుఁ డన్న మాటలా!
మరమున వాసవున్ గెలిచె తొయ్యలి! జేనిఁ దిరస్కరించినన్
ఎరుపునశించుఁ గష్టములు వచ్చును గానఁ బరిగ్రహింపుమా!"  131

వాలుకఁ జూపుచున్ ప్రఘస నామక రాక్షసి మండిపల్కె" నీ
వేల తిరస్కరింతువు సుఖించు నదృష్టము లేదు కావలెన్
కాలము సేయుచుంటివి - ప్రసన్నవు కమ్మ నిలింపవైరితో
వెలగ సంచరింపుము! అరిందముఁ డాతఁడు మర్త్యభామినీ!"  132

అంతటఁ జెంతనున్న వికటాసురి శూలముఁ జేతఁ బూని య
త్యంతము దూఁకుచున్ బలికె "నయ్యయొ యింతకు రాకపోయెనీ
కాంతుఁడు నిన్నుఁ గొంచుఁ జనగా పది మాసములైన గాని ని
శ్చింతగ దానవేశ్వరునిఁ జేరికతో సుఖియింప రాదటే!  133

అతనికి భార్యవైనయెడ నందము, చందము - లేక పోయినన్
సతిలపదంగనొస - సొబగున్ నశియించును మూర్ఖభావనన్
వితమున కాలమున్ గనుక వీడుము వెంటనె మంకు పట్టు ధీ
మతి! దశకంఠ నెయ్యమున మన్ననఁ బొందుము రాజపత్నివై 134

మంచిది కాదు నీ వొక సమస్యగ నుండుట రాణులందఱున్
గొంచెపడంగ నీ పయి నిగుడ్చును ప్రేమపరీతభావనన్
చంచలబుద్ధితో మెలఁగ సాగదు నీకిట యోషితా! ప్రలో
భించిన-యోచనన్ సలుపవే! విడనాడుము మొండి వైఖరిన్ 135

అందఱికన్న సుందరి వటంచును నిక్కుచు నీల్గెదే? పరి
స్పందునిగా చరించుచనను కామనతో భవదీయప్రేమ నా
నందము నందు మావిభుని నాతి! యనాదరబుద్ధిఁ జూతువే
మందునః భాగ్యహీనవు ప్రయాసపడన్ బరితోషమందెదే? 136

ఓసీ! జానకి! యేమికర్మమిది - దుర్యోగమ్మొ! నీ పట్టుతో
గాసింజెందుచు మాకు కష్టములు సంకల్పింప న్యాయంబటే!
నీ సిద్ధాంతము మాకు నచ్చదు నిదానింపంగ మేలే! వనీ
వాసం బేలనె? రాజభోగముల నిర్వాహమ్ము కల్గున్‌గదా! 137

ఎక్కడినుండి వచ్చితివె? యెవ్వతెవీవు? దశాస్యు కోర్కెకున్
జొక్కుచు మాల్మొగం బగుచు మూర్ఖముగా నవహేలనమ్ముతో
చిక్కులఁదెచ్చి పెట్టెదవె? బేర్పడుచుంటిమి - చాలునింక నీ
నెక్కులు - సమ్మతింపుము - కదింది విచారము నేయకే తమిన్ 138

న శుద్ధాంతములోన నందమగు కాంతల్ పెక్కురుండంగఁ బ్రీ
ని నీపై నిలుపున్ దశాస్యుఁడు పరాధీనుండుగా నేరిపై
నసున్ బెట్టక సంభ్రమించు చెలువా ! మాకాడు ద్వేషమ్ముతో
ను మందోదరికన్న నెక్కువగ మన్నించున్ బరాచీనుఁడై 139

శముఖుఁడోర్చె వేలుపుల, దానవులన్ మఱి దేవజాతులన్
శకలితమ్ముగా బలిమిఁ బెక్కువిధమ్ములఁ బెంపఱంగ వె
క్కసపడి నీదుపాదముల గౌరవబుద్ధి సమాశ్రయించె నీ
శుఁడయి నీచురాలవయి వాని మనోరథమున్ బెకల్పకే ! 140

పద్దుగ కూరుచుండె ననుమానముతోఁ బతివచ్చునంచు నే
ద్ద యొనర్పకే నిలుచు జాలము సేయుచు మీరదేరు నా
ద్దమురాకుఁడో దనుజలార ! గ్రసింతును దీని రావణున్
పెద్దరిగా దలంచి పలవించును నాథుని కోస మోర్పుతో 141

గడువిచ్చె రెండు నెలరీ
పదఁతికి మనప్రభువు దీని భావము మాఱ్పన్
గడబడ లెందుకు గడువది
గడచు వఱకు వేచియుండగా ఫలమున్నే ? 142

వఁడోవచ్చును దీనికోసమని పెంపేవంగ దుఃఖించు, నా
మెవఁడోవచ్చెడి దక్కనాఁగుటలు మేతే ? చెప్పుఁడీ ! చెప్పుఁడీ !
వరమ్ముల్ మనకేల దీని నిపుడే విచ్ఛిన్నముంజేతు దు
ష్యవసాయంబని తేఁడు చంపినను జంపన్వచ్చు నాపై నసున్ 143

మనకున్ లంకకు దీనియేడ్పుతగులున్ మాయింతు నీ మానవిన్
శనిపోవున్ మనకున్ సుఖమ్ము కలుగున్ చావంగ నీసీత యా
పని నేనేయొనరింతు నిశ్చయముగా ప్రాసింతు సంతృప్తి మై
పనిగొం డాశరకాంతలార ! వెసదుర్వాదమ్ము నేఁ బొందెదన్

అని పరవళ్లత్రొక్కుచు మహోర్భటి నాశరకాంత మైథిలిన్
దునుమగఁ గత్తితోదుముక తొందరకూడ దటంచు నడ్డగన్
దనుజులు కొంతసేపటికి తాల్మివహించుచు నెట్టకేలకున్
పని విని తత్ప్రయత్నమును వ్యాకులతన్ విరమించె తోడుతో

జానకి చుట్టుఁజేరి దనుజల్ వచియించిరి మూదలించుచున్
మానవకాంతనంచు ననుమానముఁ జెందగరాదు రావణున్
దానవుఁడంచు నాతనికి దారలు కల్గుదు రన్ని జాతులన్
గాన వరింపుమాతని సుఖంబులనందుచుఁ దేజరిల్లుమా !

అతఁడువచ్చు టసంభవ మాసపడకు
బల్లిదుఁడె? దానవుని మించువాఁడె ? యల్ప
మానవుండు భగ్నాశుని మాటలేల ?
దితిజనాథుని పట్టపుదేవి వగుము 1

కలదు పతిభక్తినీకు నీకాయమెడల
స్వర్గమును బొందగలవను వాంఛకలుగు
రావణునిఁ జెట్టపట్టిన రమణి ! నాక
సుఖల దర్శింపఁగలవు కాయమ్ముతోడ 1

అనగ దుర్ముఖి యను నాశరాంగన పల్కె
దశముఖు నలఁతిగాఁదలఁచి నావె ?
తపనుఁడాతండనఁ దపియింప వెఱచును
పవనుండు వీవడు పటిమ మిగుల
పాదపమ్ములుఁ బూలవానలు కురియును
పర్వతమ్ములు, వారివాహములును
జలము లందించును జానకి ! రాక్షస
ప్రభువును ధవునిగాఁ బరిగణించి
స్వీకరింపవు దుర్బుద్ధి నీకుఁగలుగ
మంచిపనికాదు నీవు మామాట వినుము
కలతెఱఁగుఁ జెప్పుచుంటిమి కరఁగవేని
సూడుకొనగ నీ కాయువు మూఁడినట్లె 149

సర్వభూతములు హర్షమ్ముమ బొందునీ
వేల రావణుపొందు నిచ్చగింప
వతని కోశమ్ముల, హర్మ్యమ్ములను సర్వ
జగముల సంపదల్ సంతరించు
సర్వసౌఖ్యమ్ములు సామ్రాజ్యమును బొందఁ
గలవు దైత్యేంద్రుని కాంతవైన
రామచంద్రుండన రాజ్యహీనుఁడు వల్క
లాజివముల్ దాల్చి నల్పుఁడె కద !

వాఁడు కొంపోవు ననుమాట వట్టిమాట
సత్యదూరము, ప్రత్యాశ, యత్యసంభ
వములు నీరధి దాఁట నెవ్వని తరమ్ము
జానకీదేవి! మా దొరసాని వగుము 150

ధవుఁడు రాలేఁడుఁ రాలేఁడు ధరణిపుత్త్రి !
జలధిఁ దరియింప మనుజమాత్రుల తరంబె !
పంక్తి కంధరు దయితవై పట్టమహిషి
వగుము గత్యంతరము లేదు మగువ ! నీకు 151

ఏమిటే ! తెగనీల్గు నీవెంతొ సుంద
రాంగి వనుచు మండోదరి నసుర విభుఁడు
నీకొఱకు లెక్కసేయఁడే ! నీమనస్సు
మార్చుకొనకున్న నిను బరిమార్చి తీఱు 152

కాంత ! రావణుని శుద్ధాంతము భువన మో
హనముగాఁ జెలఁగు — శయ్యలు మనోజ్ఞ
ముగనుండు, నాసనములు కూడ రమ్యము
లందులో సుఖియింప వెందువలన ?
మానవస్త్రీవైన మనుజుని భార్యవై
యుండుట క్షేమమా వెండగిల్లి ?
తద్భ్రాంతి వీడి చిత్తము నీవు మళ్లించు
కొనవేల ? రాముఁడు వనులఁదిరుగు

రాజ్యరహితుఁడు నెంతొవిక్లబుఁడు - వాని
మఱచిపొమ్మ సంపదలతో మత్తగిల్లు
మా నృపాలుని పత్నివై మసలుకొనుము
రావణుని పొందునీకిచ్చు రాజసమ్ము! 153

రమణి! నీపతి భూమిపై బ్రదికియుండె
నో, మృతుండయ్యెనో చెప్పలేము - జలధి
పరివృతంబగు లంకలోఁ బాదమిడగ
తరమె వానికి వాని తాతలకుఁగూడ 154

నయనమ్ముల్ వెస వారిపూర్ణములుగా నారీశిరోరత్నమ
త్యయమున్ బొంది విరక్తమానసముతో నయ్యాశరస్త్రీలతో
నయనీయంబుగఁబల్కెఁ 'మీ నుడుల యుక్తంబేమి కన్పింపదే?
అయయో! లోకవిరుద్ధకార్యమును జేయంటోవ నేనెన్నడున్ 155

పరునిన్ భర్తగ స్వీకరింపుమని చెప్పన్ మీకు ధర్మంబె? యి
ద్ధరలో మానుషి మానవున్వరునిగా ధ్యానింపగాయుక్తమి
త్తఱి మన్నింపను మీప్రలోభమును వాదంబాడ మీతోడ స
త్వరమే నన్నువధించి మ్రింగుడు కృపన్ దైత్యున్ వరింపంజుమీ! 156

నాపతి దీనుఁడై నను వనమ్ములఁ గ్రుమ్మరుచున్న, రాజ్యమున్
జేపడకున్న నాకతఁడె జీవిత నాయకుఁడే మఱేరిపై
నాపను ప్రేమ నాబ్రదుకు సూత్రపడున్ రఘురాము తోడనే
నాపిలుచున్న కూడ కడు పూర్వహుఁడై విలసిల్లు నిత్యమున్ 157

పాతివ్రత్యమునే భజింతు నెపుడున్ భావింప నన్యున్ సుఖ
ప్రీతిన్ రావణ సార్వభౌమునయినన్ బేర్మిన్ గనంజాల మీ
కూతల్, చేతలు నాకు నచ్చవిఁక మొగ్గుంజూప మీపల్కులన్
తి౦ దప్పను చెప్పఁబోవకుఁడు మన్నింపన్ భవత్ప్రార్థనల్ 158

పూషు సువర్చలవోలె, దేవేంద్రుఁ బౌ
లోమి విధమ్మున, సోము రోహి
ణీతారకై వడి నిస్తులుఁడగు వసి
ష్ఠముని వరుంధతి చందమున, న
గస్త్యులోపాముద్ర కరణి, నేనిక్ష్వాకు
వంశజు రఘురాము వదలిబ్రదుకఁ
జాల నటంచు నిశ్చయము దృఢమ్ముగ
స్పష్టీకరించె నిశాచరాంగ
నలకు హారంతఁ గోపమ్మునను జనకజఁ
బరుషవాక్కులు పలుకుచు భంగపఱుపఁ
దర్జనల, భర్జనలసేయఁ దరువుపై ని
షణ్ణుఁడై గమనించెను శ్వసనసూతి 159

అంతతో నూరుకొనక యయ్యసురలుఁ దమ
తుట్టపెదవుల నాల్కలతోడ తడపు
కొనుచు వేధింపఁ దొడఁగిరి కోమలాంగి
వినత యను భీకరాంగన వినిచె నిట్లు 160

"సీత! నీభర్తయెడ గొప్పస్నేహ మీవు
చూపితివి చాలునది యింక నాఁపమేలు!
అతికృతంబైన నెదియేని క్షతమె! నీవు
నిలిపితివి మానవస్త్రీల నెఱతనమ్ము 161

వినుమింక నేనుచెప్పెడి హితమ్ముసు భయ
శీలుఁడుఁ గృపణుఁడుఁ జేతకాని
వాఁడైన రఘురాముపదలి దానవసార్వ
భౌము నీ ధవునిగఁ బరిగణింప
వే! నవమన్మధుఁడా నతపైరి. ద
క్షిణ నాయకుఁడు సాహసికుఁడుఁ గడు స
మర్థుఁడు వీరుఁడు మఱిప్రియదర్శనుఁ
డతఁడు నీపైని మోహమున నుండెఁ
గాన సర్వాభరణములు మేనఁ దాల్చి
పంక్తి కంధరుఁ బ్రేమించి బహుళసుఖము
లనుభవింపుము యజమానురాల వగుచు
సీత! ముల్లోకములను శాసింపవచ్చు! 162

ఇపుడు మా మాటలను వినవేని మేము
నిన్ను కడికండలుగఁ జేసి మన్నిగొనుచు
మెసవెదము జాలి మాలి భూమిజ! బిరాన
మరల నొకసారి యోచింప మంచిదగును! 163

పైదలి! రాక్షసేశ్వరునిభామిని పట్టపురాణియైన మం
డోదరిఁ జూచియుంటివ? మనోహరరూపవిలాస సంపదన్
మేదినిపుత్త్రి! నిన్నెనయు మీనవిలోచన — ఆమె యన్న ని
న్నాదరమొప్ప మాయొడయఁ డెంతలెక్కఁగఁ జేయునమ్మ మా! 167

అంచితుఁడైన నీమగఁడు సద్గరించుచునేఁగుదెంచి నిన్
గాంచిన సుత్తుపట్టునె పితాంబరముగాఁ గనిపించుచుండగా
కొంచెపుబున్ గృశించు నిను గూరిమి సేయుచె ముందురీతిగా
మంచిదికాదు భోజనము మానిన రోత పటున్ నిరాశనన్ 168

పదిమాసమ్ములు లంకనున్న నిను సంభావించునే రాముఁడో
ముదితా! శీలముపోయెనంచుఁ దలఁచున్ మోహాంబ్ధితో మున్గు దు
ర్మదునిన్ వంచకుఁడంచు నెంచి నిను గారంబొప్ప మన్నించునే?
మదినూహింపుము సర్వమున్ వదలి దుర్మానమ్ము — యోజింపుమా! 169

రామునిపట్ల గల్గు ననురాగము చూపితి వద్భుతమ్ముగా
భామిని! చాలు! నీధవుఁడు వచ్చునొ? రాఁడొ? నిరంతరమ్ము నీ
ప్రేమను వెల్లడించి పలవించెద వెంతటి గొప్పదైన ని
ష్ఠేమిఫలమ్ము? నిల్చితివె యియ్యెడ మున్నుల పడ్డచోటునన్ 170

అతికృతమైన స్నేహమున నాత్మయికమ్మగుఁ గాననీవు నీ
పతి యరుదెంచునన్న యనుమానము వీడుము — హార్దిదాఁటి యే
గతిఁ జనుదేర సాధ్యమగు? గానఁ దొలంచి తదీయభావనన్
దితిజమహాప్రభున్ వలచి దేవివికమ్ము ప్రసన్నచిత్తవై 171

ఓ పడఁతీ! హితమ్ము వినవో! సహియింపను వీరివోలె నో
కోపము చూడలేదెపుడు .. గుప్పునరేఁగెద నేమిచేతునో !
చూపుము సమ్మతిన్ విమతసూచను నాథునిగావరింపుమీ
రాపిడిఁబొందనేలనె నిరక్తినిమాని పరిగ్రహింపుమీ 172

మర్మములేదు సూ! వినతమాటల చేయును చెప్పినట్లుగా
ధర్మము గిర్మమున్ విడిచి దానవనాథుని చెట్టపట్ట కే
కర్మము మందబుద్ధివలెఁ గాఱియనందుచు శోకతప్తవై
మార్మొగమౌచు నిల్చెదవు మచ్చరికించుచు మా హితోక్తులన్ 173

వచ్చిన యవకాశమ్మను
మెచ్చక విడనాడి యవల మిడికిన మేలే?
చిచ్చోడిఁ గట్టెదవే యిటు
కచ్చన రావణునిఁ దృణముగా నెంచకుమా! 174

కృతకాద్రు లుపవనమ్ములు
పతి రావణుతోడనీవు నావములొకతైవె
యతిశయముగ విహరింపుమ!
అతివా! యనురాగబంధమై చెలువారన్ 175

అంతిపురి నున్న సుందర
కాంతలు పరిచర్యసేయగా విలుతురు నీ
చెంతఁ బ్రతీక్షల ననిశము
మంతవ్యముగాన మనసుమూర్చుకొనఁ గదే! 176

రావణుస్వీకరింపుము-పరాక్రమవంతుడు, భాగ్యశాలి, నీ
జీవితమున్ సుఖప్రదముఁ జేసికొనంగను వీలుఁగల్గు నీ
భావముమార్చుకొన్న సులభమ్మగుఁ నొప్పన నీదుగుండె మే
మోవనితా! పెసన్ పెరికి యొప్పముగా భుజియింతు మాదటన్ 177

అంతఁజండోదరి యను రాక్షసాంగన
శూలముఁద్రిప్పుచు జాలిమాలి
పలికె "నెచ్చెలులార! ప్రభువులు తెచ్చిన
వెలఁదినేఁ జూచిన వేళ నుండి
నోరూరుచుండెను మీరు నమ్మరు గాని
దీనిని వధియించి తిన్నట నీమె
గుండెఁగారిజముఁ బేగులు, శిరమ్ము మెసవ
వేడుకతో నుంటి విడువ" ననఁగ
దానిపైఁబ్రఘసాఖ్య దరిసి పలికె
'ఇదిగో! కంఠముఁబిసికి చంపెదను దీని
ప్రభువుతో పోయి చెప్పుడీ పడఁతి చచ్చె
ననుచు 'భక్షింపుఁడని పల్కె-నతఁడు మీకు 178

అన నజాముఖి యను నాశరస్త్రీ యందు
కొని నిగదించె "నీవనితఁజంపి
సమభాగములఁజేసి సఖులార! మనమంత
కలిసి తిందము రండు! జలము, లేహ్య

ముల వేగఁగొనియెదు ! కాఁడ విచ్చెముల వీడి
యామె యాకర్ణింపదేమి చెప్పు
నను గూడ బనవేఁడె యనుచు నుండెను గాదె
మనమేమి చేసిన నుండదె యని"
ఆమె పల్కుల నాలించి దీనముగ
ననియె శూర్పణఖాదిధ "అమ్మ ! మన యు
జామున వచించు తెఱఁగున నుండు మేలు !
మనసు స్థైర్యము కొనితెచ్చు సౌఖ్య కలుగ 179

అని తఱుసంటి మాటలను నారదకాంతలు పల్కుచుండఁ దే
యునడి మెఱుంగతే కనుల నూరఁ బాష్పములన్ వెలార్చుచున్
జనకజ శోకతప్తయయి స్పష్టముగా వచియించె నిట్టుల
"వినను - భవత్ప్రలాపముల - వేఱుపడన్ గమకింతు నెప్పుడున్ 180

నేను మనుష్య భామినిని - నేనెటు రాక్షసరాజు భర్తగా
కానక పెట్టబెట్టెదను ? కల్మషమున్ గొనితెచ్చుకొందునా ?
మానిత మెట్టులౌను ? వినుమాసముగాఁ దరికిఁచు లోకమా
దానవకాంతలార ! యిది ధర్మము కాదు విరుద్ధమౌను సూ ! 181

ఇపుడో ! యింకను రెండు మాసములకో యేలాగునైనన్ ననున్
కుపితుల్ మ్రింగెదరో, కరాసి దునుమన్ గోర్కెన్ వెలారింతురో
కృపఁజూపన్ మిము వేడఁబోవను విరక్తిన్ నిత్య శ్రీరామునకై
జపమున్ జేయుచు వెళ్లబుచ్చెద ప్రతీక్షన్ గాలమున్ నెట్టుచున్ 182

సాధ్విని నేను నిశాచరాంగనావ।
ప్రభువు [illegible] తివె నాకు!
రామచంద్రుఁడు [illegible] – రావణు
వరియించుటనునది వట్టిమాట!
నరకుఁడు – చీల్చుఁడు – నను బుగ్గిలోవైచి
కాల్చుఁడు ముక్కముక్కలుగఁ జేసి
లేదేని [illegible] – ప్రాణముల్
తీయుఁడు [illegible]
గద్గదస్వనమ్మునఁ [illegible] గాటియుపడి
చలితమానసయై సాధ్వి [illegible] మిగుల
రాముఁ దేతెంచునను నాశతోడ
శోకమూర్తియై [illegible] బెలుచ 183

మందను వీడితోఁడేళ్ల మధ్యను జిక్కినలేడి భంగిఁగాఁ
జిందిలుచున్న చిత్తమున సీతయు గుండెల భీతితోడ నా
క్రందనముం బొనర్చెఁ దనరాముని పేరున్ గలవోయుచున్ బరా
స్కంది దశాస్య దుర్గమునఁ దాంపితసున్ గొనపోవఁ గోరుచున్ 184

తరుణి యశోక పాదపశాఖనూఁతగాఁ
బ్రా ముత్తోడ నేత్రముల బాష్ప
ములు జాలువాఱెడుము క్లిన్నమైనుడి
గాలిలోఁ జలియించు కదళిపోలె

కదలాడె నుమ్మలికమ్ముతో మెలికలు
తిరిగిపోవుచు నుండె దితిజలఁగని
వణఁకి పోవుచునున్న పడఁతి వేనలినల్ల
త్రాఁచుకైవడి నూఁగులాడుచుండె
దాశరథులను, సత్తలఁ దలఁచు కొనుచు
వెక్కివెక్కి యేడ్వఁగసాగె - "పెద్దలనగ
వినమె మృత్యువు దరియ దవేళ ప్రాణిఁ
బురుషుఁడైనను, స్త్రీయైన నరతినున్న

అది యథార్థమె యయ్యును నసురవనిత
లిటుల నిత్యముఁ బీడింపఁబటుతరముగ
రామునకు దూరమై నేను బ్రదుకుచుంటి
వస్తుభారాన మున్గు నావవలెనిచట

కనులతో నాథుఁ గాంచు యోగమ్ము లేదు
నేననాథ చందమ్మున హీనపుణ్యఁ
గాన నశియించి పోయెద గట్టు లాప
గా ప్రవాహముతోఁ గూలు కరణినెపుడొ

పతి: యేడాదిగ లంకలో నిటుల నిర్బంధమ్ములో నుంటి నీ
దితిజల్సారెకు నిష్ఠురోక్తులను వేధింపంగ నెట్లోర్తు దు
ర్గతిఁదప్పించు ప్రయత్నముల్ సలుపఁగా రావేమి నీసీతకై
ప్రతిరోధించుచు దుష్టరావణుని దుర్మాత్రసమ్ముఁ బోకార్పవే!

పాపము లెన్ని చేసితినొ ప్రాక్తన జన్మలలోన తత్ఫలం
బీపగిదిన్ వియోగమున నిచ్చట నివ్విధి క్రుంగుచుంటి నే
నోపికపట్టలేను - పరుషోక్తుల వించుము రామచంద్ర ! నీ
ప్రాపు నొసంగి రావణనిబర్హణముం బొనరింప రాఁగదే 189

ఆమాయామృగదర్శనమ్ము మహాత్మా! మెంతవారించినన్
సౌమిత్రిన్ గణియింపకే పురిపితిన్ సంస్కారహీనన్ ననున్
కామాసక్తుఁడు దానవేశ్వరుఁడు లంకన్ జేర్చెఁబో వైసికన్
రామా! నీ వరుదెంచు మిమ్మెదకు నార్యన్ బ్రోవగా శీఘ్రమే 190

అపురూపంబుగఁ గానిపించు హరిణం బాలోచనన్ నేయకే
చపలత్వమ్మునఁ గోరు దమ్మునను బొంతిన్ వ్యక్తము జేసితిన్
విపరీతంబుగ మాట నిమ్మదియు సుగ్రీవనాథ! దైవంబునా
కిపుడీ శిక్షవిధించెఁ జూడు కరుణాబ్ధీ! రమ్ము రక్షింపఁగా 191

మిన్నులు పడ్డచోట సహియింపగ రాని వియోగ బాధతో
నున్న ననున్ గృపాంబుధి! సుస్థిరముం బొనరింప రావె! అ
పన్నను-రాక్షసీగణము బాముల పెట్ట విరక్తి నొచ్చితిన్
ఖిన్నముఁ బాప నిచ్చెదకు వచ్చి ననున్ గాపాడుమ్ము వల్లభా! 192

ఉద్ధతుఁడైన పంక్తిముఖుఁ డూర్జితశక్తిఁ దధర్మగానిధ్యై
సిద్ధుఁడున్ దురూహమెంచు చేకొన నాకిదె రెండుమాసముల్
క్రుద్ధుఁడొసంగెఁబో గడువు క్రూరుఁడు సున్నిగ నెంచి నన్ననున్
విద్ధతివిముక్తి కయివేయుముగా చను వెంచుమెహో ప్రభూ! 193

రాముని, సింహ పరాక్రముఁ బద్మాక్షు
దంతి గమనునిఁ గృతజ్ఞునిఁ బ్రియ
వాదిని ధన్యులౌ వారె వీక్షింపఁగ
ల్గుదురు — దౌర్భాగ్యకుఁ గుదురు నాక్కొ !
విషపాన మొనరింప విడువక యుందురే
ప్రాణముల్ — రామునిఁ బాసి నేను
సమయుదు - నాపూర్వ జన్మల నేనెట్టి
యఘముఁ జేసితినొ ! యీ యకము కలిగె
నింక రాముఁడు లభియింపఁ డిచట దాన
వాంగనల యాతనలుఁ దప్పవయ్యొ ! దావ
వీలులేని మానవ జన్మ మేల నాకు"
టంచుఁ బరిపరి విధముల నామె వగచె. 194

అని చింతించుచు మరలను
జనకజ తలపోసె మున్ను జరిగిన విషయం
బును గనులనీరు నిండగ
మనమున నరియూట మిగుల మనన మొనర్చెన్ 195

"అంచితుఁడైన నామఁఱఁది నాడితినేఁ దఱుసంటి మాటలన్
గొంచెపదెవ్ రఘూద్వహుని కోసము తానరిగెన్ బ్రతున్నుఁడై
వంచుచు మస్తకమ్మును విపన్నుఁడు ఖిన్నుఁడుగా మహోచ్ఛనొ
ప్పించితి సందియం పడుచు భిన్న ప్రవృత్తునిగాఁ దలంచుచున్ 196

ఏఁగెను గాని కోపమున నెత్తి వడెన్ మొగమంత లక్ష్మణుం
డేఁగుటలోనఁ దొట్రుపడె నెంతొ పదమ్ములు ముందుకెట్లు తా
సాగెనొ కాని నాయెడఁద జ్వాలలు రేఁగఁ బ్రతీక్ష నిల్వఁగన్
మూఁగెను చిమ్మచీఁకటులు ముష్కర రావణు రూపమందునన్ 197

కోపము మిక్కుటంబగుడు క్రూరుడు రాక్షసుఁ డేమిచేసెనో
నా పతి నంచు బెండుపడి న్యాయము, ధర్మము వీడి లక్ష్మణున్
దాపితుఁ జేసి పంపితిని ధైర్యము లేకయె బైసిమాలి నా
పాపము నన్నుఁ బట్టి కుడుపన్ విలపించుచు నుంటి నిచ్చటన్ 198

విరతము నన్నుఁ దాను జననింబలెఁ జూచెను మాయలేడి యై
తిరుగుచునున్న నాశరునిఁ దెప్పునఁ బోల్చుచుఁ దాను దానికై
మరగకు మంచుఁ దెల్పె ననుమానముతో విధివ్రాత చొప్పునన్
గుఱికొనిలేడిఁ దెమ్మనుచుఁ గోరితి నాధుని వాంఛ మిక్కిలన్ 199

సాగున్ ముందుకు లక్ష్మణుండెపుడు హర్షమ్మందుచున్ దామ నా
యోగక్షేమము నెంచఁగానిపుడు రాకుండెన్ హృదిన్ గోపమో।
క్రాఁగున్ తప్పక విన్న నాయునికి దుర్వారమ్ముగా నన్నుతో
వేగన్ వచ్చిదశాస్యువిన్ జిదుమ సంప్రీతిన్ బ్రదర్శింపఁడే 200

నాపొలకువ లెఱుఁగక సం
తాపమ్మను బొందు చున్న దాశరథికి దు।
ష్కోపశమనముం గూర్చుచు
నేపుమిగుల జాడలరయునేమొ ధృతిమై 201

తలపఁ బూనఁడతండు తానును దన వంశ
మేమౌ దురో కూడ నెందువలన
ననుఁగోరు చుండెను దనుజుండు - మఱెన్ని
కౌఱులఱచినను మేరమీఱ
ఫలమేమి యుండదు భర్తగా నతని సం
గీకరింపను రాముఁడే కలఁడు నాకు
నన్నుపేక్షించునో ! నాథుఁడు నా మనస్సు-
నెఱుఁగఁడో తెలియదు - ఎఱిఁగిన యెడ
నను నిరోధించు రావణుఁ గినుక మిగుల
క్షణములో సంహరించెడి సాహసికుఁడె !
అతఁడు విఖ్యాతుఁ డెంతొ దయాళుఁడుఁ
బ్రాజ్ఞుఁడు కృతజ్ఞుఁడగును నాప్రాణము సుడీ 4

మును జనస్థానమున రాముఁడు చతుర్ద
శాసుర సహస్రములఁ దారుణాగ్ని నొకఁడె
సంహరించెను-నే నిశాచరుని చెఱను
మిడుకు చుండగ రాఁడేమొ ! మిన్నకుండె 5

అతఁడు విరాధ దానవుని నంత మొనర్చెను నన్నుఁగావఁగన్
మతిఁదలపోయఁడే! వనధిమధ్యమునన్ గల లంకనుండగా
పతి యిది రా నసాధ్యమని భావమునన్ గణుతింపరాదు వి
శ్రుతిగల రామబాణములు చూచునె యుద్ధము నాఁక యెన్నఁడున్ 6

నిజముగా నాపైని నెనరు ఏప్పెనో ? లేక
రావణ దనుజు నిర్బంధ మందు
నేనుంటి ననుచుఁ దా నెఱుఁగఁడో బహుపరా
క్రమశాలి తనభార్యఁ గైతవమున
నపహృతయై పోవఁ గృపణునివలె యూరు
కొనె దశాస్యం డెత్తుకొనుచు వచ్చు
వేళ జటాయువు విస్రంభముగఁ బంక్తి
ముఖునితోఁ బోరుచు మడిఁగిపోయె
వృద్ధుఁడయ్యు నాకోసమై గృధ్ర రాజు
మడిసె నసుఁ గావగావచ్చి మహితుఁ డతఁడు
రామలక్ష్మణు లెఱిఁగిన లంకనుంటి
ననుచు నామ రూపములుండవపుడు మీకు

ఏర్చులంకను-జలనిధి నెండఁగట్టు
నీచుఁడగు రావణుని కీర్తినేలఁగలుపు
దానవాంగన లిట్టేడ దీనలగుచు
నేడ్చెదరు నుండి నేనిపుడేడ్చు నటుల

రాముఁడును, లక్ష్మణుండును లంకనంత
వెదకి, వెదకి దానవులఁజంపెదరు-వారి
కంటఁబడిన రావణుఁడెంత దంటయైన
నమయులంకయుఁ ద్రుటిలో శ్మశాన మగును

వాయసమ్ములు, గ్రద్దలు, గ్రాలి యసుర
దేహములఁ దీకి తినుట సందియము లేదు
ఇదియె నాకోర్కె- నెఱవేఱు నింక నచిర
కాలమునఁ బ్రేతభూమిగాఁ గ్రాలు పురము 10

సిరులతో, సంపదలతోడ సొరున్న మెఱు
దానవుల తానకంబగు మీ నగరము
రామచంద్రునిచేత నరాశసమగు
ఘోరముగ దనుజాంగనలార! వినుఁడు 11

జలధులింకినఁ దపనుండు చల్లబడిన
వహ్నిజ్వాలనమ్ము పీడిన, శ్వసనుఁడు తన
స్పర్శ గుణమును వదలినఁ బతిని సీత
విడువదెన్నడు రావణు ప్రేమ కొఱకు 12

దుర్నిమిత్తము లెన్నియొ తోఁచు చుండె
ననతి కాలమ్ములో లంక యసురసహిత
ముగ నశింపక తప్పదు-పుర మనాథ
వలెను ధ్వంసమైపోవు రావణుఁడు చావ. 13

రాక్షసాంగనలు భర్తలు మ్రందఁ బ్రతిగేహ
మున గోల పెట్టుటల్ వినెద నేను
రావణదైత్యు నిర్బంధ మందున నుంటి
నని యెఱింగిన నా పతిశనినిఁ బురిని

నిమిషమ్ములో నేయు నిర్ధూమ ధామమ్ము
గా జనస్థానమ్ము కరణి-పంక్తి
కంధరుండిచ్చిన గడువు సహింపించె
కలుష వర్తనులు రాక్షసులు ధర్మ
దూరులై మంచి చెడ్డల తీరు లేక
ప్రాతరశనమ్ముగా నంత రావణుండు
నన్నుఁ దినివైచు నిభుఁడు రాకున్న యెడల
దైవమా ! నాకు మరణమ్ము తప్పదేమొ !

విభుని వీడుచు నేను జీవింపఁజాల
నతఁడుఁ బ్రియదర్శనుండు, రక్తాంతలోచ
నుండు - విషము నాకై కొనితెందు - దాని
పానమొనరించి యమువీటికే నరిగెద !

అనఘుఁడు రామచంద్రునకు నాకరుచెట్టుయు, లంకలోని నా
యునికిఁయు నైతమున్ దెలిసియుంచదు-నాపఁదెచింగినన్ ననున్
గనుఁగొన యత్నముల్ సలిపె గ్రక్కునఁజేకొని పోవకుండునే ?
దనుజపతిన్ వధించుచుఁ బ్రతాపముఁజూపి రణోర్విలో వెసన్

నాయునికి తెలియక నాపతి శోకము
తో మృతుఁడయ్యెనో ? తోయజాక్ష
దివమునఁజూచిన దేవతల్, గంధర్వు
లును, సిద్ధులును, మహర్షులును నెంతో

ధన్యులు - లేనిచో ధర్మకాముఁడుఁ బర
మాత్ముఁడౌ విభునకు మగువ నగుట
లోఁ బ్రయోజనము విలుప్తమై పోయెనో ?
తఱచు చూచుచునుండఁదనరు సఖిత
దృష్టిలో నుండకుండిన తెలుఁగువేఱు
దుష్టులగువారలే చేయుదురటువలెను
త్రుంచివేయఁడు ధవుఁడు నాతోడి స్నేహ
మెపుడు! నాపరిస్థితికేమి హేతువగునొ ? 1

శత్రుసంహర్త, యక్లిష్టచరితుఁడు, మ
హాపరాక్రమశాలి, దయాబ్ధియైన
నా రఘూద్వహు విడిచి దానవుల మధ్య
బ్రదుకు కంటెను మరణింప నావ్యమగును 1

కాదేని రామలక్ష్మణులు అస్త్రసన్యాస
మును జేసి మునివృత్తి వనులఁ గంద
మూలముల్ తినుచు నా పొలకువ నెఱుఁగక
తిరుగుచుండిరొ! లేక పాపుల దైత్యుఁ
డెదియేని మోసమ్ముఁ బొదలించి యనుజుల
నంతమొందించెనో పంతగించి ?
కాలమిట్టుల యుండఁగా నేను జీవించి
యుండుట సాధ్యమె యెంచి నగుచు

నిట్టి స్థితిలోన నిధనమదేలరాదు ?
మనసు స్వాధీనమొనరించుకొని జితాత్మ
లగుచుఁగోర్కెల వీడు మహర్షులెంత
ధన్యులో ? వారలకును వందనమొనర్తు

ప్రాణనాథుని వీడుచు రావణు చెఱ
లోనిటుల పడియుంటి నరుంతుదపరు
షోక్తులాడ దానవకాంత లోర్మిఁదక్కి
వదలెదను ప్రాణములఁ బ్రియపతిఁ దలఁచుచు''

ధరణిజ పల్కులన్ వినుచు దానవ కాంతలు కొందఱంతటన్
బరుగునఁబోయిరా దితిజు పాలికి నా విషయమ్ముఁదెల్పఁగొం
దఱువచియించి రామెఁగని ''ధాత్రిజ ! నిన్ను పిశాచరాంగనల్
సరిగొని యామిషమ్మును వెసన్ భుజియింతురు నిర్దయాత్మలై

వారి బెదరింపులను విని ప్రక్కనె నిదు
రించు త్రిజటాఖ్య రాక్షసి లేచి పలికె
"చీ ! మహా పాతకులు మీరు సీతనేలఁ
జంపఁజూచెద రాఁపుడా జతనములను 1

జనక రాజేంద్రు ముద్దుల తనయ సీత !
దశరథుని పెద్దకోడలీ తన్వి ! యంత
కావలయునేని ననుఁజంపి కాంతలార !
ఆరగింపుడు పలలమ్మునంత వట్టు 2

ఒక దుస్స్వప్నము వచ్చె దానిఁగన నోహో, యెంత దౌర్భాగ్యమో !
వికలంబయ్యెనెడంద - తద్విధమె యాఫలమ్ముగాఁదోఁచెఁటొ
ల్తుకలారా ! వణఁకెన్ శరీరము తోడ్తో యెంతకున్ భీతి పీ
డక నిశ్చేష్టతనట్టులే నిలిచియుండన్ తెల్వి వచ్చెన్ సుమా !

అవనిజను జంప సులభమే ? యవలవచ్చు
కీడుఁ దలపోయరింతయుఁ గూడ మీరు
కట్టిపెట్టి ప్రలాపముల్, బెట్టిదములు
గౌరవమ్మున జనకజఁగాంచ మేలు !

అన రజనీచరాంగనలు నా త్రిజటాసురి చుట్టుఁజేరుచున్
వినుచుము స్వప్నమెట్టిదియొ ? వృద్ధవుగా మనలోన నీవె ! నా
శనమెటువచ్చు దానవుల సంగతి లోకమెఱుంగదే ? భయం
బున వడఁకంగనేల మన ప్రోలికెవండును రాఁడుగా" యనన్

దనుజస్త్రీలను గాంచుచు
వినిపింపం దొడఁగె స్వప్న విషయము లెల్లన్
పొనుపడుచుఁ ద్రిజట వారికి
మనుజాశన నాశనమ్ము మదినేర్పంగన్

చెలులార ! వినిపింతు శ్రీరామచంద్రుఁడు
శ్వేత వస్త్రములతో సిత ప్రసూన
మాలలు దాల్చి లక్ష్మణునితో నరుదెంచె
శిబిక నారోహించి చెలువు మీఱ

గజదంతమయము, నాకాశగామి సహస్ర
హంసయోజితమది - యవనిజాత
వనధిమధ్య ధవళపర్వతాగ్రమ్ముపై
ధవళాంబరమ్ముల నవధరించి
దివ్యమంగళ విగ్రహు, ధన్యచరితు,
శ్యామసుందరు మందహాసమ్ము తోడఁ
గలిసి సూర్యుని క్రియవోలెఁ గౌఁగిలించె
తెలిపిఁగొని వచ్చె వేఱొక దృశ్యమవల 28

రామచంద్రుఁడు చతుర్దంత సామజమ్ముపై
నెక్కి లక్ష్మణునితో నెసక మెసఁగ
లంకాపురమున నిశ్శంకుఁడై విహరించె
తమ దేహకాంతులం దనరుచుండ
పౌరసతులు సీత దగ్గఱ నామెయు
హస్తినారోహించి యాత్మవిభుని
యూరువుపైనఁ గూర్చుండి హస్తములతో
సూర్యచంద్రులఁ బట్టుచుండెఁ దాను
మరలఁ జూడ నభోవీధి మన పురమ్ము
పైని రామలక్ష్మణులును బడఁతి సీత
యధివసించిన మాతంగ మరుగుదెంచె
నంతలో మాఱె దృశ్యమో యింతులార! 29

ఎనిమిది తెల్లని వృషభము
లను బూన్చిన రథముపైని లలనయు రాముం
డును లంకఁ జేర విబుగులు
మునులును సుమవృష్టిఁ గురిసి మోదించి రొగిన్ 30

అనుజుఁడును బత్ని వెంట రా ససఘుఁడొకట
సనితృ సంకాశ రమ్యపుష్పకమునందు
సాగిపోవ నుదీచి కప్సరలు నృత్య
మాడి, పాడిరి నినుతింప సమంగళము 31

శ్రీమహావిష్ణువే రఘురాముఁ డగుట
కాని సామాన్యుఁ డెప్పుడుకాఁడు నిజము
అ మహాపరాక్రమశాలి నసురులును, ని
లింపులును యుద్ధమందు జయింపలేరు 32

పాపులు స్వర్గమందెపుడుఁ బాదము పెట్టగలేరు కాదె ! దు
ష్ప్రాప విదేహరాజసుత రామవిభున్ గనుఁగప్పి ముచ్చిలెన్
భూపుఁడు గర్వియై ధరణిపుత్త్రిని ధార్యగపొందు నాశతో
పాపముపండి లంకయును, నృపాలుఁడు, నారులున్ నశింపఁగన్ 33

తరువాత రావణదైత్య దర్శనమయ్యె
రక్తవస్త్రమ్ముల, రక్తవర్ణ
కరవీర ప్రజముల గళమున ధరియించి
తైలముం ద్రావుచుఁ దైలరిక్త

దేహుఁడై పొదకట్టెఁ దిరిగి చగఁ బుష్ప
కచ్యుతుండుగ నాకు కానిపించె
ముండిత శిరముతో - ముదితయొక్కతె దశా
స్యుని భూమిపైని నీడ్చుచుఁ గనఁబడె
ఖరముతే వాహనములుగఁ గలుగు రథము
నందు దశముఖుఁ జూచితి నందుపైని
మరల ఖరవాహనుఁడుగ యామ్యదిశ కరుగు
చుండఁ దలక్రిందుగాఁ బడె సువిదలార !

అసురనాథుండు భయార్తుఁడై వెంటనే
లేచి తై పెక్కసరీతి, వెకిలి
గా నవ్వుకొనుచు వికారముఁ బొందిన
కరణిఁ బ్రేలుచును దిగంబరుఁడయి
మలపంకమునఁ జొచ్చె - మరలఁ జూడగ నేను
శ్యామలాంగి యొకతె యరుణవసన
ములఁదాల్చి మేనుసఁ బరదఁ బూసికొని రా
వణు గళమ్మునఁ ద్రాడువైచి కట్టి
యామ్యదిశకీడ్చుకొనిపోయె నమ్మలార !
కుంభకర్ణుఁడు రావణు కొమరులటులె
తైలసిక్త దేహములతో తారుచుండ
కానిపించగ వెఱపుతో మేనువడఁకె 8

రావణాసురుఁడు వరాహమ్ముపైనెక్కి
నక్రమ్ముపై మేఘనాదుఁడెక్కి
లొట్టియఁ గుంభకర్ణుండెక్కి యామ్య ది
క్కుగఁ బోవుచుండ నాకుఁ గనఁబడిరి
స్వప్నములో విభీషణుఁడు మాత్రము తోఁచె
నలువురు సచివులు కొలుచుచుండ
ఘంనిభంబగు చతుర్దంత సామజముపై
తలపై సితచ్ఛత్ర మలరుచుండ
శంఖ దుందుభి మధుర విస్వనములొలయ
నృత్యగీత వినోదముల్ నెలకొనంగ
ధవళ వసనముల్ మాల్యముల్ నవధరించి
వెడలిపోవుచునుండఁ గన్పించెనాకు 36

అరుణ వస్త్రమ్ముల నరుణస్రజంబుల
బాలసుల్ ధరియించి పానమత్తు
లగుచు గుంపులు గుంపులుగ నాకుఁ గన్పించి
రాడుచుఁ బాడుచు నవనిఁ బడిరి
కూలిన తోరణ గోపురమ్ములతోడ
రథవాహ సామజ ప్రతతితోడ
వనధిలో మసలంక మునిఁగిపోవుటఁ బొడ
కట్టె నింకను జూడ బెట్టిదుండు

రామదూత వానరుఁడు పరాక్రమించి
లంకఁగాల్చెను పురి భస్మరాసులందు
రాక్షస స్త్రీలు తైలమ్ముఁ ద్రావి గోల
పెట్టుచును గానిపించిరి వెలఁదులార !

రాక్షసయోధు లెఱ్ఱనిబట్టలను దాల్చి
కుంభకర్ణునితోడ గోమయంపు
మడువులోపడిరి నామాటలనాలించి
దూరముగానుండఁ దోఁచు సుఖము
దనుజ సంహారమ్ముఁ దప్పక కావించి
భూమిజఁ బొందు శ్రీరామవిభుఁడు
అందుచే పరుషోక్తులాడుట మానుఁడు
జానకిన్ వేఁడఁ బ్రసన్న యగుచు
బాలసులనెల్ల నామె కాపాడఁ గలదు
లేనిచో నాపదయె వచ్చుఁ గాన మీరు
వినయముగ సంచరింపుఁడు జనకజాత
మొకల క్షేమమ్ము మీరు వాంఛించిన యెడ

లాలింప వలెనామె సహాసంబు మృదువాక్య
ములతోడ నభయమ్ముఁబొంద మీరు
రక్షింపుమని యామె ప్రార్థించుకొనవలె
క్షమియించు మనల నిగ్రహముఁజూపి

దుఃఖితంగ నొచుఁ జొట్టిక యుండువేళ నె
క్కరికైన నిట్టి స్వప్నమ్ము వచ్చె
నేని యూరడిలి సుఖించు దుఃఖముపోయి
భయపడ రాదింతపలుకు నామె
కఠిన వచనమ్ములను నొప్పి కలుగఁజేసి
నందులకు బతిమాలుడీ యవనిజాత
వచ్చు రామునివలన నాపత్తు దనుజ
జాతికంతకు సీతమ్మ శరణమొసగి!

కాళ్లపై పడి వేఁడినఁ గనికరించు
కినుకఁ బూనక మనల రక్షించునామె
ఇన్నినాళ్లుగఁ జూచితిమింతియందు
లేదు దుర్లక్షణముఁ బగలేదెడంద

వసివాడె నామె దేహము
పసియగు నశనమ్ములేక సౌఖ్యము కల్లై
పిశునులు పెట్టెడి బాధల
కిసిసీ! తగదామె పీడుటి పైచిత్యమ్మున్

రాముఁడు జయించి తీరును - రావణుండు
భంగపడి నశియించు స్వప్నమ్ము సీత
సంతసించు నటుస్సు సూచన యొసఁగును
చూడుడీ! సీత నొక పరి సుదతులార!

ఆమె వామనేత్ర మదరుచుండెను, వామ
భుజము నదరుచుండెఁ బొలఁతులార!
కరిణి తుండమటుల క్రాలు నామె యెడమ
తొడ స్ఫురించు చుండెఁదొడ తొడ 43

గరుడపక్షి యప్రథమున రెక్కల విదిల్చి
కొనుచు వలయముల్ తిరుగుచుఁ గొమ్మపైనిఁ
గూరుచుండియు కమ్మగా కూయుచుండె
నిద్ది శుభ సూచకము సీత కింతులార! 44

అన్నియు శుభశకునములే
మన్నిగొని దశాస్యు, విభుఁడు మదవతి సీతన్
జెన్నుగఁ గొనిపోవును మీ
చెన్నఁటిచేఁతలను మాన క్షేమము సుండీ! 45

కలలోన వచ్చు సంగతు లెల్లనిజమాట
లోకములోన విరుద్ధమనుచు
కంచపఘ్నముగ మెక్కగను జీర్ణము కాక
దుఃస్వప్నములు పెక్కుతోఁచుననుచు
కలలెవ్వరినిగూర్చి కలుగునో వారి కా
ఫలితముల్ రావని పలుకుదురని
వానరమొకటి స్వప్నములోనఁ గనఁబడ
నశుభమ్ము కలవచ్చినట్టి వారి

కనుచు దితిజాంగనలు త్రిజటాసురి కల
వైని వ్యాఖ్యానములు చేసి ఫలితములకు
కాచియుండిరి వఱువాత కలిగిన కల
నిజముకానోపునన్న సందియములోఁడ 45

తనకు వచ్చిన స్వప్నవృత్తాంత మటుల
త్రిజట దితిజలకుం దెల్పి తీవ్రఫణితి
మందలించెను రఘువరు సుందరియెడ
తీరుగా బుద్ధిఁ గలిగి వర్తింపుఁ డనుచు 4

రావణు కర్కశోక్తులను రాక్షసకాంతల తర్జనమ్ములన్
శేవరపాటు మిక్కిలవిదేహ నృపాల తనూజ బాధతో
నావిరి రాముఁడయ్యెడకు వచ్చినృశంసుని నిగ్రహించుచున్
జీవ తలిర్పగా మరలఁ జేకొనఁ డేమియటంచు వందురెన్ 4

నరసంచారములేని కాననములోనన్ బాల చందమ్మునన్
పరితాపమ్మున నేద్వసాగె బ్రతుకే భారమ్ముగాఁ దోఁచఁగన్
మరణం బెప్పుడు రాదవేళనముచున్ మాన్యుల్ వివేచింప దు
స్తరమే - లేదిఁక జీవితాశ యనుచున్ దర్కించె నీరీతిగన్ 4

"వజ్ర ఘాతమ్ముతోడఁ బర్వతమ్ము బ్రద్ద
లగుట తథ్యము దుఃఖమ్ము మిగుల నటులె
బ్రద్దలగుఁ గాని నాగుండె పగుల దేమొ!
నేను జీవింప వలె నను నిర్ణయమ్మొ! 4

దుష్టుడు రావణుండగుట దుర్గతి తప్పదు వాని చేతిలో
క్లిష్టి భరింప నోప గతి లేదిట నాకిపుఁ డాత్మహత్యయే
శిష్టమటంచుఁ దోచును విశేషము, దోషము లేదు దీనిలో
కష్టములన్ని తీఱు నరకంబున నుండగఁ జాలనమ్మయిన్ 50

శ్రుతి మంత్రముల కెవ్వ డర్హుఁడు కాని
రీతిగా నసుర నాప్రేమ కెవ్వఁడు
తగఁడు - గర్భము నుండి సుగముగా శిశువు బై
టికి రాకపోయిన డిల్లపడక
వైద్యుండు వేగ గర్భములోనె ముక్కము
క్కలుగఁ గోయునుగాదె ! కర్కశుండు
గమివు గడచిన ముక్కలుసేయు నన్నుఁగా
రసురాజపంచననమునను ద్రోయ
బడిన దొంగను తెల తెలవారి జరుగు
నట్టి దుష్కృత్యమె నాకు నమరుఁ బరుష
వాక్యముల నాకరాంగనల్ బాధపెట్టఁ
దట్టుకొనలేను మరణమ్మె తగును నాకు 51

పురుష పుంగవుఁడైన రాముఁడు సుమిత్ర
నందనుఁడు మాయ దైత్యుని నాటి వలన
భ్రమసి యున్నను సమయుఁడే- మాయలేడి
రూపమునరాఁగ నీపరిహాస మొదవె । 52

మూఢురాలినై నేనె రాముని, సహజుని
బలిమినై పంపితిని లేడిఁ బట్టి తెమ్మ
టంచు నది యెల్లఁగూడ స్వయంకృతాప
రాధమున సంభవించె నిర్బంధ మిచట 53

అమ్మ! విశ్వంభరా! అత్త కౌసల్య - సుమి
త్రా! రామ! లక్ష్మణా! త్రాణలేదు
వాత్యలోఁ దగులుచు వనధి మునిఁగెడి నౌక
తీరున విపదంబుధిని మునిఁగెద
రామ! సత్యవ్రతా! క్షేమహితా! దీర్ఘ
బాహు! రాకాచంద్రవదన! జీవ
లోకప్రియా! లంకలో నిశాచరుల హ
స్తములలోఁ జిక్కుచు సమయుచుంటి
నీవిది యెఱుంగ వేమియు నిన్నుఁ దప్ప
యెవ్వనిని దేవుఁడంచు బూజించ లేదు
ధర్మమునె యాచరించితి ధరణిపై శ
యించితిని బాధలన్ని సహించితి సుమి! 54

ద్వేషింపఁబడె నా పతివ్రతాత్వము, సుర
చిరనియమములు విచిత్రముగను
మును గృతఘ్నునకుఁ జేసిన యుపకారము
భంగి - నీ వనవాస వ్రతము జనకు

నానతి మేరకు నవలీలగాఁ బూర్తి
        చేసి యయోధ్యకు చేరఁగలవు
రామచంద్రా ! మహారాజవు సుందరాం
        గనలతోఁ గ్రీడింపఁ గలవు కాని

నేను, మాత్రము బాధలు నీ కొఱకిట
ననుభవించుచుఁ జివరికి నసువుల విడు
తును గళమ్మును భేదించుకొనియొ ఖడ్గ
మున - విషము పుచ్చుకొనియొ - విముక్తఁ గాన 55

రాక్షసుల మధ్యనుండ ఖరాసి, విషము
నాకొసఁగు పుణ్యజనులుఁ గన్పట్ట రెవరు !
ఇదియుఁ గూడ దౌర్భాగ్యమే ! యేమిచెప్ప
ననుచు నురిపోసి కొన నిశ్చయము జెలంగ 56

రాముఁడు వచ్చుజాడ కనరాదవి యెంతయొ నొచ్చుకొంచు నా
రాము తలంచెఁగాని రఘురాముఁడెఱింగిన రాక యుండునే?
దీమసమూండియున్ వనులదీసుఁడుగాఁ జరియించి లంకలో
పామరబుద్ధితో విడుచు ప్రామిదికాఁదని యెంచె గ్రక్కునన్ 57

తన్ప్రియునికి తెలియక పతి తదనేమొ
దాశరథిఁ దప్పుపట్టుటఁ దగదటంచు
తన కదృష్టము లేదని ధరణీ జాత
సిద్ధపడె మరణింపఁ గృశించి, కుమిలి 58

ప్రసవసంయుత శింశుపా పాదపమ్ము
కడకుఁజేరి తద్వృక్షశాఖను దనజడ
తోడ నురిపోసికొనఁ బూని తోయజాక్షి
దలఁచుచుండగ శుభనిమిత్తములు తోఁచె 59

వామాక్షి స్పందించె వైదేహికప్పుడు మ
 త్స్యము తాఁకశోణ పద్మమ్ము వోలె
నంగరాగములతో నందమ్ముగా నుండి
 దాశరథికి నుపధానమైన
మాంసలవర్తుల మహిజ వామభుజమ్ము
 నదరెను దోడుతో హస్తితుండ
సన్నిభంబగు వామసక్థి స్ఫురించి య
 క్కజముగఁ దెలిపె - రాఘవుఁడు నెదుట

నిలిచియున్నట్లు - పచ్చని నెలఁత వలువ
కూడ జాఱెను కొంచెము - వాడినట్టి
మొలక వర్షింప మరలను నిలువరించు
నటుల సీత యాశాపూర్ణయయ్యెఁ దిరిగి 60

దానితో సీత వదనము తరళమగుచు
రాహుముక్త రాకాశీతరశ్మిబింబ
సదృశమై యొసలారె - విషాదమడఁగి
నన్నగిలె వగ - తొందర నమసె సతికి 61

హనుమంతుడు విదేహరాజతనయా యత్నమ్ము వీక్షించె, దు
ర్జన(గావించు నిశాచరాంగనల దౌరాత్మ్యమ్ము(గాంచెన్ మనం
బున ధావించుచు సీత నందనపనిన్ బొల్పారు గీర్వాణ భా
మినిగా తోడనె యోజనన్ మునిగె నామెంగూర్చి యుద్వేగియై

"ఎవ్వరికోసమై వెదకు నెన్నియొ వానరసేనలార్తమై
యవ్వనితామతల్లిక(బ్రయత్నమునన్ గనుగొంటి నియ్యెడన్
దవ్వన వార్ధిమధ్యగల దావున రాముని గూఢచారిగా
జివ్వన వచ్చి రావణుని రీతి నెఱింగితి లంక(జుట్టితిన్

పరమదయాస్వభావు(డు, శుభంకరు(డౌ రఘురాముపత్ని నే
నరసెద సాంత్వనోక్తుల( బ్రయత్నము(జేసెద నూఱడింపగన్
దురపిలు జానకీరమణి దుఃఖము(బాపక యూరుకొన్న దు
స్తరమగుశోకమెట్లద(గు-జానకి(దప్పక చూడనేవలెన్

అఱ(డి పుచ్చుచున్న దనుజాంగనలన్ గమనించితిన్ మనో
భారముతో విపన్నయయి ప్రాణమువీడ(దలంచు తల్లికే
నా రఘువీరు ముద్రికను యాతన(బాపి యొసంగి క్షేమమున్
దీరును దెన్ను(దెల్పిన(బతివ్రత సమ్మదమందు ధీరయై

శోకోపహతయగు సీతాంత నూఱడిం
పక యూరుకొనిన నాపదయెవచ్చు
నేనట్లు వెడలినవెలదితయు( దనకిట
రక్షణ లేదని భ్రమంటవచ్చు

ఆమహాబాహువు సోమవదను రాము
సీతమరణవార్తఁ జెప్పియూఱ
డింపగానౌనె-పీడించు నిశాచరాం
గనలుండ నే నెటు జనకజాత
తోడ మాటాడఁగలుగుదు ! తోఁచకుండె !
ఇద్దియొక పెద్దచిక్కు ! నేనేమి సేతు ?
రాత్రిగడవక మున్నె శ్రీరామపత్ని
తోడ భాషింపకున్న బ్రదుకుట నిజమ్ము ! 66

జనకజయేమి చెప్పెనదన్న రాముని
కేమిపల్కెదను ? నేనామె మాట
వుచ్చుకొనక పోవఁబురుషోత్తముఁడు నన్నుఁ
జూపులతోడఁగాల్చును-వనచర
నాథు నొప్పించి సైన్యము తోడ వచ్చిన
వ్యర్థమైపోవు నా యత్నమంత
కనుక నేనెటులైన దనుజాంగనలఁ గనుఁ
బ్రామియోదార్చెద రమణి సీత
వానరుఁడ నేను సూక్ష్మరూపముననుంటి
దేవభాషలో నిగదింప ద్విజునిరీతి
దశముఖుఁడటంచు సన్నామె తలఁచుఁగాన
మానవులభాషలోఁ బల్కు మంచిదగును 67

మనుజభాషలో మాటాడ మగువ సీత
రాక్షసులమాయయని భయభ్రాంతయగుచు
నఱచినన్లైవ నాశరు లాయుధములఁ
బూని ననుఁజంప వత్తురేమో పెనయగ

స్వస్వరూపముతో నేను వనినిఁదిరుగ
దనుజవనితలు బెగడొంద దాని మీఁద
పెద్దగందరగోళమౌ వీరులంత
వచ్చి ననుఁజుట్టుముట్టనాపని జరుగునె ?

రక్కసిమూఁక వచ్చినఁ బరాక్రమమున్ వెలయించి వారినే
నుక్కడఁగింతు నాపయి మహోదధిదాఁటగశక్తిశూన్యమౌ
తక్కువహారె దానవులు? తామునునావలె వ్యోమవీధిలోఁ
గక్కసపెట్టగానెగిరి కాళ్లను బట్టుకలాగివైవరే ! 1

నాకు ప్రమాదమేదియొ యొనర్చిన రక్కసు లింతియున్కిఁదా
నేకరణిన్ రఘూద్వహుఁడు హృద్యముగా నెఱుఁగంగనోపు, నే
నీ కడలిన్ దరించి యిటులీ జనకాత్మజఁజూచి యాల్గినన్
ప్రాకటమౌనె ? నాశ్రమము వ్యర్థమె కాననచంద్రికల్ బలెన్ 7

జంకరు ప్రాణిహింసకు నిశాచరు లింతినిఁజంపి వేయగా
మంకుతనమ్ముఁజూపినఁబ్రమాదము వచ్చును రామకార్యమం
దంకిలివచ్చు నందుపయి నర్కజు రాజ్యము నష్టమౌనుగా
లంక సముద్రమధ్యమునఁగ్రాలఁ బ్లవంగులరాక మిథ్యయే 72

రాక్షసుల చేతిలో నేను క్రుమ్మందిన యెడ
లేక దొరికి పోయిన యెడ లేదు రామ
చంద్రునకు నే సహాయము సాహసించి
శరధి లంఘించి వచ్చు వానరుఁడులేఁడు 73

జయమొ - అపజయమో వచ్చు సమరమనగ
జయము కలిగిన నాకు నసాధ్యమగును
కడలి దాఁటగ బలమెంతొ యుడుగుఁగాన
సంశయగ్రస్త కార్యమ్ము సలుపరాదు 74

సీత మరణించుఁదప్పక సీతతోడ
మాటలాడక వెడలిన మంచిదగునె !
చెడు ఫలోన్ముఖ కార్యముల్ బెడిసిపోయి
దూత యవివేకియైన విద్రుతములగుచు 75

అవివేకి దూత తానయినచో భాన్కరో
దయమునఁజీఁకటుల్ తారునటుల
పొసఁగనేరవు ఫలోన్ముఖ కార్యములుఁగూడ
తిలకించి తన పరిస్థితినిఁజూచి
సంగతి, సందర్భ, సమయములరసి య
థోచితమ్ముగ దూత యుక్తిపదఁబ్ర
వర్తింపవలయు విపశ్చితుఁడ నని గ
ర్వించిన కార్యముల్ విఫలమౌను

ఏమి చేసిసఁజెడిపోవ దినకులేశ
కార్యమేను సముద్ర లంఘనమొనర్చి
లంకఁజేరిన నేమి ఫలమ్ము? నేను
సగుణినా? భీతుఁడన? యసహాయుఁడనొక్కొ

హనుమంతుండును శింశుపావిటపిశాఖాగ్రమ్ముపై నుండి యో
జనముగ్గంగ మనోహరమ్మున రఘుస్వామిన్, బ్రశాంతాననున్
ఘనవజ్రాంగదతారహారరుచిరక్వాణప్రభూతాంగునిన్
దనువుప్పొంగఁగ నేత్రపర్వముగ సందర్శించెఁ బ్రీతాత్ముఁడై

లీలామానుషవిగ్రహున్ గనుచు బోళిన్ వాయుపుత్త్రుండు "నే
హో వంతలు, రామచంద్రవిభుఁ గీర్తింతున్ క్షమాసూతి స
చ్ఛీలప్రోజ్జ్వలనిత్యచింతనను రాశీభూతనై భృత్యతన్
దేలున్ గావున భీతినంద దిది సాధిష్ఠంబటంచెంచెదన్

కడుప్రసిద్ధుడు రాముఁడిక్ష్వాకుకులుల
లోఁ జతుర్భుజ సముఁడు విరుద్ధచరితు
లందఱిని చూపుమాపునియాతుఁడతడ
కాచరిత్రము వినిపింతు నద్భుతముగ 7

తియ్యతియ్యని పలుకుల తేనెలీను
చందమున, భీతినందని సరణి, నన్ను
విశ్వసించు తెఱంగున వెలఁదికిపుడె
రామ సంకీర్తన మొనర్తు నమ్మ భణితి" 8

వృక్షశాఖ నిషణ్ణుఁడై విపుల తనయ
వచనముఁ బరీక్షగాఁజూచి పవన సూతి
రహిఁ జెలంగఁ బ్రారంభించె రాఘవేంద్రు
చరితమును గాన ఫణితి నా శ్వసనజుండు 81

తరణివంశమున నుద్భవమొంది యశము నా
ర్జించిరి పెక్కు ధాత్రీరమణులు
సేవాస్వరూపమ్ముఁ జెప్పె దిలీప భూ
పాలుఁడు, రఘు చక్రవర్తి జీవి
యొక్క స్వరూపము నొఱపుగాఁ వెలయించె
నజ పార్థివుఁడు ప్రేమ పమృత సేచ
నమ్మొనర్చుచును సింహాసన మెక్కించె
ఋతము ధర్మమ్ము జీవితములగుచు
నందఱును బాహువిక్రమ లవవి నురుల
దైవతము లట్లు మన్నించు ధన్యజీవు
లధిక తేజోవిరాజితు లాత్మవిదులె !
ప్రజల గౌరవమును బొంది వఱలు ఘనులె ! 82

దశరథుం డజునినందనుఁడు గీర్వాణుల
ప్రియమిత్రు డెంతయో కృపసకలఁడు
పుణ్యశీలుం డతిగణ్యుండు రాజ లో
కమునందు ఋజుపథగామి, కీర్తి

శాలి, దయాళువు, చక్రవర్తుల వంశ
భూషణుఁడపురూపమునిసదృశుఁడు
శక్రసమానుఁడు సత్యపరాక్రముఁ
డిక్ష్వాకు కులమున కెంతో ఘనత
సమకొనగఁ జేసినట్టి ప్రశస్తుకుండు
జనతకుం గూర్చువాఁడు భూజాని, సర్వ
రాజ లక్షణ లక్షితభ్రాజితుండు
రాజమాత్రుండె దశరథరాజమౌళి 83

చతురంభోధిపరీతభూవలయ రక్షా దక్షుఁడై భూవిభుం
డతులైశ్వర్యవిభూతిఁ గల్గియును బుత్రాంచి హాస్యుండుగా
క్రతువున్ జేయగ నల్వు రాత్మజులుఁ గల్గన్ రాజ్ఞులున్ దానుఁ ద
త్సుతులం గాంచుచు సంతసించి రెలమిన్ శుద్ధాత్ములై, ప్రీతులై 84

తనయుల జ్యేష్ఠ నందనుఁడు శ్రీరాముఁడు
కౌసల్య యాతని కన్న తల్లి
సజ్జనుఁ డాతండుఁ జంద్రాననుఁడు సర్వ
ధర్మము లెఱిఁగిన ధార్మికుండు
కోదండ పాండిత్య కోవిదుండును దన
వారి రక్షించెడి ప్రవణుఁ డెపుడు
ప్రాణికోటి కతండు రక్షకుఁ డాతని
యింద్రియానతిఁ దలఁదాల్చి పత్ని,

తమ్ముఁడును వెంబడింపఁగఁదరలి ఘోర
వనములందు వసింపగ వచ్చె దనుజు
లెందఱినొ సంహరించెఁదాఁ నేకతుఁడుగ
సర్వనాశన మా జనస్థాన సీమ 85

ఖరదూషణాదులఁ గసిమసఁగఁగ జన
స్థానమ్ములో రామచంద్ర విభుఁడు
పౌలస్త్యుఁడెంతొ కోపంబూని రాముని
లేమ దొంగిలి పోయె లేడి రూప
మునను మారీచుఁడు మోసమ్ముఁ జేయగ
వనితను వెదకుచు వచ్చి ఋశ్య
మూక పర్వతముపై పొసఁగ సుగ్రీవుని
తోడ స్నేహముఁ-వాలి దునిమి ప్లవగ
రాజ్యమాతని కొసఁగె శ్రీరాముఁడంత
వతఁడుఁ బుత్తెంచెఁ గపుల సహస్రములుగ
సీత నన్నియెడల గవేషింప-మేము
వచ్చితిమి దక్షిణాశకుఁ బడఁతి నెమక 86

మహితుఁడగు పక్షిరాజు సంపాతిమాట
మేరకా సీత వెదకఁగ నూరు యోజ
నముల వనధినిఁదరియించినాఁడ నేను
ధూర్వహాత్మ పేర్మి రాముని దూత నగుచు 87

నాకుఁదెలిపె నాయమ రూపురేకలన్ని
రామచంద్రుఁడు వర్ణించి, యామె నేఁడు
నాకుఁ గన్పించె నిప్పుడు నా యదృష్ట
ఫలముగా లంకలోనఁదపస్సుపండి 88

అని హనుమంతుఁడూరుకొనె నంతట జానకి విస్మయంబునన్
వినెను దదీయ గేయముల-వెంటనె యానన మెత్తి వృక్షమున్
గనుకనిచూచె రాఘవునికై తపియించుచునున్న నామెకీ
హనుమ ప్రదర్శనమ్ము హృదయమ్మును బొంపెసలారఁ జేయగన్ 89

పైకినిఁ గ్రిందికిఁ బ్రక్కల
కాకపివరుఁడెచట నుండెనాయని చూడ్కుల్
వీఁకనిగుడింపఁ దరుణప్ర
భాకరువలె హనుమతోఁచెఁ బాదపశాఖన్ 90

ధవళవస్త్రమ్ము ధరియించి యవనిజమున
మెఱుపువలె మెఱయుచును సమీరజుండు
నక్కయుండ శాఖలమధ్యఁ బ్రక్కసీత
హనుమ భీకరరూపమ్ము నరసినంత 91

అవనిజాత నిర్విణ్ణయై హనుమ నెవడొ
యసురుఁడని వంచన మొనర్ప నరుగుదెంచె
నను భయమ్మున విలపించె నంతరంగ
మందు మారీచు వంచన క్రందుకొనగ 92

ఈకపి యెవ్వఁడో తరువునెక్కి వచించుచునుండె మానవ
ప్రాకట భాషయందు రఘురాము చరిత్రము - రూపుచూడఁగన్
నాకుభయమ్ముఁ గల్గుచుఁగనారిలుచుంటిని నాథ ! లక్ష్మణా !
కాకుఁదనమ్ముగాఁ దలతు గ్రక్కునవచ్చి పరాక్రమింపుఁడీ ! 93

కలయో, వాస్తవమో యెఱుంగ ననుచున్ గల్యాణి యా వాయుజున్
దిలకింపన్ మరలన్ భయంకరుఁడుగాఁ దీవ్రుండుగాఁ దోఁపగన్
కలలో వానరదర్శనంబయినచోఁ గష్టమ్ముతేకాని, రా
నైలమిన్ సౌఖ్యములంచుఁ జెప్పెదరుగా పెద్దల్ వివక్షించుచున్ 94

రామునకు శుభము కలుగుత !
సౌమిత్రికికూడ శుభము సమకుఱు ! మిథిలా
భూమీశుఁడు జనకునకున్
క్షేమంబగుగాత మనుచు సీత తలంచెన్ 95

మఱికొంత వడికి సీతా
సరసిజలోచన తలంచె "స్వప్నంబెటులౌ !
పరికించితిఁ గన్నులతో
ధరణీరుహ శాఖలందు దాఁగు వనచరున్ 96

పూర్ణచంద్ర ముఖుండుఁ బురుషోత్తముఁడు, రామ
చంద్రుని స్మరణతో స్వాపరహిత
నైవంతఁగుందెడి నాకెటు కలవచ్చు !
కావున స్వప్నమ్ముకాదు - నేను

"రామ ! రామా" యని రాముని ధ్యానింతు
దానికిఁ దగిననిధమ్ముగ విన
నయ్యె నాతనికథ - ఆతని విడిచి వ
చ్చినదాది మన్మథార్తిఁ బొగులుచు
నతనిపై దృష్టినిలుపుచు నతనినెపుడు
నేను తలపోయుచుంటినిగాన నాకు
రాఘవేంద్రుఁడె తోఁచును రాముమాట
లే చెవులఁబడుచుండె నిరీక్షనుండ 97

అంత నా భావన ననుసరించి జరుగు
వానరు రూపము స్పష్టముగను
గనఁబడగా నవకాశమేమియులేదు
ప్రత్యక్షముగఁ బల్కెఁ బ్లవగుఁ డిపుడె
స్వప్నముకాదు వాస్తవమె ! బృహస్పతి
కిని, వజ్రికిని, వహ్నికిని నలువకు
నా ప్రణామములు ! వానరు భాషణముల ని
జమ్మన్న నట్టులే జరుగవలె నఁ
టనఁ బ్రవాళముఖుండగు హనుమతరువు
దిగి, వినీతవేషుఁడయి పృథ్వీతనయకు
భక్తితో వందనమొనర్చి భయపడుచునె
పలికె మధురమ్ముగాఁ దేనెలొల్కుఁ నుడుల 98

ఎవ్వ తెవమ్మ ! చారుననజేక్షణ ! పాదపశాఖనూఁతగా
నెవ్వగ బాష్పముల్ కనులనిండగ శోకపరీత చిత్తవై
యివ్విధి విల్చియుండి విలపించుచు నుంటివి - హేతువేమి ? నీ
వివ్వనవాటి నొంటరిగ నెట్టుల చేరితివమ్మ దీనవై 99

అమర కాంతవ ! గంధర్వ రమణివ ! యుర
గాంగనవ ! కిన్నరస్త్రీవ ! యక్ష వనిత
వా ! నిశాచర తరుణివ ! పతిచరువిఁ
బాసి శోకించు రోహిణివా ! తెలుపుము 100

కానిచో రుద్ర వసు మరుద్గణములందు
దేనికైనను నీవు చెందెదవ ! లేక
ఆ వసిష్ఠమహర్షిపైనలిగి యిటకు
వచ్చినట్టి యరుంధతివా! నుడువుము 101

నీవు దివ్యకాంతవలెఁ గన్పించుచుంటి
వెంతో దుఃఖించు చుంటివి యేకతముగ
జనకుఁడో, పుత్త్రుఁడో లేక ధవుఁడొ, భ్రాత
యో గతింపగ శోకింతువో! పలుకుము 102

ఎంతో విట్టూర్పు చుంటివో కాంత! దుఃఖ
భారమున భ్రమంది రెవరొ తెల్పగదె! ధరణి
పైనిఁ జరణములాని నిల్వంగ నీవు
మానవాంగన వనుచు నమ్మకము కలుగు 103

కలవు నీ యందు రాజలక్షణములెన్నో!
దేవతవు కావటంచును దెలిసికొంటి!
రూపురేకలనో వరారోహ! రాజ
నందనగ, రాజపత్నిగా నాకుఁదోఁచు 1(

పంచవటినుండి దుష్టరావణుఁడు ద్రుచ్చి
ఎంచి బల్మిమై తెచ్చిన దేవివ? రఘు
వరుని పత్నివ? చెప్పుము స్పష్టముగను
సీతవైన శుభమ్ములుఁ జెలఁగు నమ్మ! 10

అతిమాత్రమైన దైన్యమ్మును బొడగని
మానవ దుర్లభ మహిత రూప
మునుఁబట్టి, మునివేషమును జూచి, రామచం
ద్రుని పత్ని వేయనితోఁచు నెట్టి
సందేహమునులేదు జానకివే నీవ
టంచు మారుతి మ్రొక్కెనంత సీత
పవమాన సుతునితో భాషించె సర్వస
ర్వంసహాఁగల్గు భూపాలుర తల
మానికము దశరథుఁడు నా మామ, మిథిల
నేలు జనకుఁడు నాతండ్రి - యిద్ధచరితుఁ
డైన రాముఁడు నాపతి యౌను - సీత
నామమునఁ బిలుతురు నను వానరవరిష్ఠ! 106

ద్వాదశవర్షముల్ ధవునిగేహమున సే
మనుభవించితిమి సౌఖ్యమ్ము లెన్నొ
జనకుని సత్యసంధునిఁ జేయ రఘురాముఁ
డడవికేతెంచగ నతని వెంట
వచ్చితిమేను నవరజుఁడు, సౌమిత్రి
దండకాటవిని మేముండు వేళ
రామచంద్రుండును లక్ష్మణుఁ డాశ్రమ
మునలేవి తఱిని రావణుఁడు ప్రుచ్చి
లించి ననుఁ దెచ్చెలంకకుఁ గొంచెపడగ
నతని వాంఛకు దీకొన కడ్డుచెప్ప
రెండు మాసముల్ గడువిచ్చె మొండికెత్తి
గడువుఁ గడచిన ననుఁ జంపఁ గలదతండు 107

జానకి వచించు పలుకుల జాలిపడి, స
మీరజుఁడు చేరె నామె సమీపమునకు
'రాము సందేశమును గొని రమణి! నేను
వచ్చితిని దూతనగుచు సాంత్వన మొసర్ప 108

శలమె రామలక్ష్మణులకున్ రఘుమండనుఁడెంతొ ప్రీతినిన్
ృశము తలంచు నీకొఱకు బిట్టుపడున్ బరితాప మొందు నీ
శలి మెఱుంగఁ గోరి యటుగున్ పతమవ్వగులన్, నిరాశ న
సల విషణ్ణచిత్తమున దృష్టినిగుద్చుచు విభ్రమించుచున్ 109

దక్షిణాశకు నేవచ్చు తరుణమందు
రాముఁ డడిగె నీ కుశలము - లక్ష్మణుండు
నంజలిఘటించి శిరమున నధిక శోక
తప్తుఁడై నీకుఁ దాను వందనముఁజేసె" 110

దాశరథుల క్షేమమ్మును ధరణిజాత
కర్ణపేయముగా విని "కపివరేణ్య!
బ్రదికి యుండిన నూరు సంవత్సరముల
కైన మనుజుఁడు సుఖయింప ననువు పడును" 111

ఈ పెద్దల వాక్యమ్ముల
నేపారుయథార్థమో కపీశా! సుకృతం
బీపాటి యదృష్టము నీ
రూపమునం దెచ్చెనేమొ లోఁగుచు నుండన్? 112

అతఁడు నాథుని కడనుండి యబ్ధిదాఁటి
వచ్చి క్షేమ వార్తలను దెల్పంగ సీత
యెంతయో సంతసించెను స్వాంతమందు
విశ్వసించెను హనుమను వీఁగుహృదిని 113

అంచితుఁడైన వాయుజుఁడు నంతట హర్షముఁ బొందుచున్ సమీ
పించె విదేహ రాజసుత-భీతిని బొందె నతండు రావణుం
డందును భూమిజాత-అకటా! కడుతప్పిద మయ్యె వీనితో
వంచకు తోడనే నిటుల భాషణముం బొనరింపరాదుఁగా। 114

దనుజుఁడు భద్మవేషమున దగ్గఱుచుండెనటంచు భీరువై
జనకజ చేతిలోని తరుశాఖను వీడుచుఁ గంపితాంగియై
ప్రణత శరీరయై చదికిలంబడె ధారిణిపై సమీరనం
దనుఁడు గ్రహించి యాపడఁతి త్రాసము మాన్ప నమస్కరింపగన్ 115

ఉర్విజ బిట్టు నిట్టూర్పుల నిడుచుచు
వాచించె "నీవె రావణుఁడవైన
మరల వచ్చితివేల? మాయావి! నన్నిటు
బాధింప మంచిదే! పంచవటిని
స్వస్వరూపము వీడి చనుదెంచితివి కాదె!
రావణాసురుఁడవే నీవు! దీన
నే సందియము లేద-యిష్టము వచ్చిన
రూపమున్ ధరియించు పాపివి కద!
నేను దుఃఖింతురాలను కాదె! మరల
నేల వేధించెదవు నీవు బాలిశ! నను
గై వసముఁజేపి కొనగ నిక్కరణి వ్యర్థ
యత్నమును సల్పెదవు రావణా! యుచితమె! 116

తొందరపాటునై వెఱపు తోడను దుర్భ్రమనంది యుంటినో!
యెందులకో నినుంగనిన నెంతయు ప్రీతి జనించుచుండె నా
సందియమందుఁ దోఁచదు నిజంబొక యింతయు లేదటంచు నా
నందము కల్గుదాన రఘునాథుని దూతవటంచుఁ దెల్పగన్ 117

రాముని దూతవైన యెడలన్ సమకూఱుత నీకు భద్రముల్
దీమసముం జెలంగఁగను మదిన్ బతి వార్త నెఱుంగఁ గల్గితిన్
రాము మనోజ్ఞ గాథ లభిరామము లద్భుతముల్ సుమీ ! మహో
ద్దాముఁడు రాఘవేంద్రు ఋజుధర్మ గుణమ్ముల నుగ్గడింపుమా ! 11

రామకథా శ్రవణమ్మున
నామదికిన్ గూర్చు నెంతొ నరపాలు గుణ
స్తోమము నభివర్ణింపును
రాముని గుణకీర్తనమున రంజిలు హృదయున్ 11

కరఁగును నాయెడంద నినుఁగాంచినచో నిది స్వప్నమైననున్
పరమ సుఖమ్ముఁ గల్గెడిని వానర వీరుఁడ! యిన్ని నాళ్ళకున్
మరలను మాత నోట రఘునందను క్షేమ మెఱుంగఁ జాలితిన్
నిరతిశయమ్ముగా నెపుడు నేఁగనుగొందునొ ప్రాణనాథునిన్ 120

కలలోనైనను రామలక్ష్మణుల యాకారమ్ములం జూచినన్
నిలువం జాలదు నెట్టి స్వప్నములు రానేరావు నాకెప్పుడున్
తలఁపుల్ సర్వము వారిపై నిగుడ నిద్రాదేవికిన్ దూరమై
నిలువోపంగను జాల కాశరుల దుర్నీతిన్ విలోకించుచున్ 121

కలయనుచున్ దలంచుటకు కారణమేమియులేదు కోఁతి నా
కలఁగనిపింపమంచి జరుగన్ బహుకష్టము నేను వానరున్
నిలఁబడి యుండ నాయెదుటనే పరికించితి వాస్తవమ్ముగా
ఫలితము మంచిదే యగును వాస్తవ వానరమున్ గనుంగొనన్ 122

ఇది మానస భ్రాంతి యేమొ! యున్మాదమో!
వాత వికారమో! పరవశమ్మొ!
మృగతృష్ణయో తెలియఁగఁ గష్టమౌ! స్పృహ
లోనుండి నను నేను వైనముగను
గుర్తించుకొనుచుంటి - గోచరించుచునుంటి
వెదురుగా నీవుండ నిద్ర భ్రమయు
నున్మాదమునుగాదు - మన్మథార్తిఁ జెలంగు
నసురుఁడ వగుదు రూపాంతరమున
వచ్చితివి నన్నువంచింప - భ్రముచ్చువోలె
బేరజము నేనుబోల్చితి వేసరితిని
ప్లవగవేషముఁ దాల్చిన ఫలములేదు
సాగవు పిసాశిచేఁతలు జానకి కడ" 123

అని చివరకు హనుమంతుని
దనుజేశ్వరుఁడే యటంచుఁ దలఁచి మెదఁదలో
ననుమానించుచుఁ గపివరుఁ
గని పలుకగమానె సీత కాతర్యమునన్ 124

# షష్ఠ సర్గము

అవనిజ సందియంపడుచు నాతనితోఁ బలుకంగమానఁగన్
బవనజుఁడద్ది గుర్తెఱిఁగి పావని పాదములంటి మ్రొక్కుచున్
సవిధమునన్ బ్రయోజనము సత్వరసాధనముం బొనర్పఁగన్
నెవ్వులుఁబొలంగఁ బల్కె నవనీసుతఁగాంచి ప్రసన్నుఁజేయుచున్ 1

"తల్లీ! నమ్ముము నన్ను - రాఘవునిదూతన్ సుమ్ము వేఱొండు నీ
యుల్లంబందున నెంచబోవకయె నాయుక్తుల్ నినన్ ధన్యుడన్
హృల్లోలమ్మును వీడి నాయెడల సౌహిత్యమ్ముఁ జూపింపుమా!
అల్లాడంబనిలేదు రాక్షసుఁడఁగానమ్మా! యథార్థంబిదే 2

జనని? రాముండు తేజశ్శాలి, సూర్యుని
    భంగి - చల్లనివాఁడు పక్షచరుని
కరణిని - సర్వలోకములకు నేలిక
    యక్షరాద్విధముగ, నమితబలప
రాక్రమమ్ములను నారాయణుఁ బురుడించు
    బుద్ధిలో ధిషణునిఁబోలు సత్య
వాది - యందమ్మున పంచబాణుని మించు
    మధురభాషణుఁడు. నమర్ష మెపుడు
రావలెనొ యప్పుడేవచ్చు - చేవనెవరి
నాశనముఁ జేయవలెనొ వినాశనమ్ముఁ
జేయువారిని - జితకాశి - వేయునేల?
అవనిఁ గనిపింపఁడట్టి మహారథుండు 3

ఎవని బాహులనాశ్రయించి లోకం బెల్ల
సుఖపడుచుండెనో శూరుఁడైన
రఘురాము వంచించి తరుణీశిరోరత్న
మగు నిన్నుఁదెచ్చిన యసుర. దుష్ట
పౌలస్త్యుఁడేమౌనొ పరికించెదవు నీవె
యనతికాలమ్ములో - ననఘుఁడంప
శతయోజనాయత సాగరమ్ముఁ దరించి
వచ్చితి - నినువీడి వసటఁగుందు
రఘుకులస్వామి నీకుశలమ్ము నడిగె
లక్ష్మణస్వామి నీ కుశలమ్ము నడిగె
రామునకుఁగూర్చు నెచ్చెలి రవిసుతుండు
ప్లవగనాధుఁడు నీ కుశలమ్ము నడిగె 4

మాతా! రాముఁడు, లక్ష్మణుఁ
డాతతముగ నినసుతుండు ననిశము నిన్నున్
జేత! ప్రీతిగఁ దలఁచుచు
నాతురముగ వేచియుండిరట శిఖరముపై 5

రాక్షసుల హస్తములఁబడి బ్రదికియుంటి
వీవుభాగ్యవశమ్మునఁ బావని! సచి
వుఁడను సుగ్రీవునకునేను - వ్యోమసీధిఁ
గడలిదాఁటి కాలిడితి లంకను యదృచ్ఛ 6

తల్లి; దానవేశ్వరుని మస్తకముపైని
బాదముసుమోపి వచ్చితి బలపరాక్ర
మములఁ జూపించి నినుజూడమహిజ! శంక
విడిచి నమ్మవిశ్వసించి చెప్పెడిది వినుము!

కపులమధ్యను నీవు రాఘవుల రవిజుఁ
గాంచు శుభకాలమేతెంచుఁ గమలనయన!
దితిజలోనరింపు బాధలు తీఱునింక
భద్రములుకల్గు రావణు భయముఁదొలఁగు 8

సర్వమాకర్ణించి జనకరాజకుమారి
పలికెంచె! వానరా! ప్రభువు రామ
చంద్రునకున్ నీకు సంబంధమెక్కడ
కలిగెను - నీకు లక్ష్మణునకెటులఁ
బరిచయంబయ్యె - వానరులకు, నరులకు
స్నేహమెట్టుల ఘటిల్లించె! రామ
లక్ష్మణులకుఁ గల్గు లక్షణములఁ దెల్ప
వలె - నన్నువినినచో వనటతగ్గు

వారి దేహ పరిస్థితి, వారి రూపు
రేకలెటులుండునో యేర్పరించవలెను
వారల మహోరువుల తీరు, పైనములను
దెలిపి కపివీర! మాన్పుమా దిగులు నాకు 9

అనుచు మెల్లగఁ బ్రశ్నించె నవనిజాత
వాయునందను నాతఁడు పద్మనేత్ర
యెఱిఁగి తన్నుఁ బరీక్షింప నెంచి యేమొ
యిటులఁ బృచ్ఛించు ననుచు భావించి పలికె 10

"జనని ! శ్రీరాముఁడు సరసిజనేత్రుఁడు
సౌందర్యమునఁ బంచశరుని మించు
సద్గుణధాముఁడు సవితృసంకాశుఁడు
తేజమ్ములో, బుద్ధి ధిషణ సముఁడు
సహనములో భూమి సన్నిభుండును, యశ
మ్మునఁ బురుహూతునిఁబోలు ఘనుఁడు
స్వజన సర్వభువన సంరక్షకుఁడతండు
ధర్మవర్తనుఁడును, గర్మవృత్తి
వర్ణ రక్షకుఁడగును - సంభావ్యుఁడగును
లోకమర్యాద లెఱిఁగిన ప్రోడ మఱియు
నైహికాముష్మిక ఫలమ్ములందు సకల
కర్మలాచరించెడి వాఁడు - క్రాంతదర్శి 11

సకల శాస్త్రములందు నిష్ణాతుఁడవని
నురుల సద్భక్తి సేవించు సుమతి యతఁడు
సాధు జనులకు నిత్యమాశ్రయ మొసంగి
ప్రోచు మన్నీఁడు రామచంద్రుఁడు సవిత్రి ! 12

వేదమ్ములను ధనుర్వేదమ్మునందును
సర్వకళలలోను జతురుఁడతఁడు
పూజింతురనఘునిమునులు, విపశ్చితుల్
అంబుజాక్షుఁడు విపులాంసుఁడతఁడు
శంఖగళుఁడు, గూఢజత్రువు, దుందుభి
స్వనుఁడు, వినీతుఁడు, సమవిభక్త
భాసురాంగుఁడు, నీలవారిదశ్యాముఁడు
వ్యూఢవక్షస్కుఁడు, సూర్జితుండు
దీర్ఘబాహువు, సుగుడి, విధిజ్ఞుఁడెంతొ
సర్వధర్మములందు నాసక్తిఁగలిగి
దేశకాలములెపుడు గుర్తించి మసలు
సర్వజనప్రీతి పాత్రుఁడు సాహసికుఁడు 13

చారుదరహాసవదనుఁడు, సమదదంతి
గమనుఁడును, సార్ద్రి హృదయుఁడుఁగల్యుఁ దతుల
బాహు విక్రమశాలి విద్వాంసుఁడెంతొ
సింహసంహనుఁడును విశేషించి వేత్త ! 14

రామచంద్రుని సహజుఁడు లక్ష్మణుండు
సర్వవిధముల నాతని సముఁడతండు
అమ్మ ! నినుగవేషించుచు నన్నదమ్ము
లరుగుదెంచిరి ఋశ్యమూకాద్రి కడకు 15

ఋక్షరజసుతనయులు హర్యక్షసములు
వాలి సుగ్రీవులను వారు - ప్లవగ వీరు
లన్న వాలి హానరంచేత యనుజు నతఁడు
దేశ నిష్కాసితునిఁజేసె ద్వేషబుద్ధి 16

ఖిన్నుఁడై చేరె సుగ్రీవుఁడు ఋశ్యమూ
కాహోద్ర్యమును మేము సతని వెంట
వెడలితి మచటికి విభునిగా నాతని
సేవించుకొనుచుండ దేవి ! దాశ
రథులచ్చటికి ధనుర్ధరులుగా వల్కలా
జిన ధారులై రాఁగఁదనకి కొండ
శిఖరమ్ముపై కేఁగి చింతతో ననుఁబంపె
వారిని దర్శించి పైనమడుగ
మహితులకు నేను భక్తి నమస్కరించి
విపులముగ సర్వ విషయముల్ విన్నవింప
సంతసించిరి వారు, భుజమ్ములపయి
మోసికొని చేర్చితిని విభుమ్రోల వారి 17

వారలకు నెయ్యమేర్పడె- వార లొకరి
కొకరు సంగతుల్ వినిపించి యూఱడించు
కొనిరి - మా ప్రభువెంతయో వనటనందె
నమ్మ ! వర వానరుల కిటులమరె సఖిత ! 18

రావణ దైత్యుఁడు రయమున నిన్నెత్తు
        కొని పోవు సమయాన కొన్ని నగలు
నీవు జార్చినని మా నేత రాఘవునకుఁ
        దెచ్చి చూపింప గుర్తించి కుందె
చూచినకొలఁది యాసురుచిరమండన
        మ్ముల రాము శోకము పొంగులెత్తఁ
బలవించి ధరణిపైఁ బడిపోయె - కొంత సే
        పటికి నే నాతనిఁ బట్టిలేప
సాంత్వ నోక్తులఁ బలికితి - సవిత్రుకులుఁడు
నగలఁ దిలకించి, తిలకించి, పొగిలి, పొగిలి
మరల వాని నొసంగెను మా ప్రభునకు
భద్ర పఱుపనియోగించి బాధపడుచు 19

నీ విరహమ్మున నిద్రకు వెలియౌచు
        శోకించుఁ జింతిలు, సొగయు ధవుఁడు
ఉర్వి కంపింపఁగ నుర్వీధర మ్మూఁగు
        నటుల యూఁగును రాముఁ డటమటించి
వహ్ని భూధరమటు పరిపరి కుతకుత
        లాడుచు నుడుకు వియోగతుఁడయ్యు
వాగులు, వనములు, వాహినుల్ కూడను
        జూడగన్పట్టు నసుందరముగ

భానుజుఁడు నిన్ను వెదక శపథ మొనర్చె
దాశరథి వాలిఁ జంప వాగ్దాన మిచ్చె
వారి మధ్యను గలుగు నొప్పందమునకు
ప్రతిగ వాలిని దునిమెను రాఘవుండు 20

ఎనుఁడు సపుత్రబాంధవముగాఁ బరిమార్చు దశాస్యుఁ డోరిలో
నుఁ గొనిపోవునమ్మ జననీ ! మహానమ్మనమున్న వేలు నీ
ానరును, దానవాంగనల యుద్ధతి తగ్గను - ధైర్యమూనుమా!
మనసును నిల్వరింపుము - సమస్తముఁ జక్కఁబడున్ సుధమ్ముగా 21

సకల వానరరాజ్యము సవితృసుతుని
కప్పగించెను రఘువరుఁడతఁడు చేసి
నట్టి సమయము మేరకు నర్కసూతి
కపులఁ బంపెను నిను వెదకంగ భువిని 22

ఈ విధమ్ముగ రామసుగ్రీవులకు స
మాగమంబయ్యెనను హనుమంతుఁడంత్రు
ధామనిధిపుత్రసచివుఁడ రామ మాత
నై యిటకు వచ్చినాడనమ్మా ! నిజమిది 23

భానుసుతుండుఁ దానిటుల వానర రాజ్యము వాలి ద్రుంచ స్వా
ధీనముఁ జేసికొంచు నిరతిన్ రఘునాథునికిచ్చినట్టి వా
గ్దానక్రమంబునన్ బనిచె దావదులై నల్లసంగులన్ డుఁసన్
క్షోణిచెఱంగులన్ వెదక కోటుల నద్భుత సంఖ్యలన్ వెసన్ 24

వాలికుమారుఁడంగదుడు బాహుబలాఢ్యుఁడు నాయకుండుగా
పాలకుఁడైన సూర్యజుఁడు పంపెను యామ్యదిశాముఖమ్ముగన్
బాలసుఁడైన రావణుడు పావని సీత హరించితెచ్చి యీ
ప్రోలునదాఁచి యుంచునని గోయగవచ్చితిమమ్మ ! ఆశతో 2!

వెదకుచు మేముఁబోయితిమి వింధ్యధరాధర గహ్వరంబునన్
గొదుకుచుఁజొచ్చియచ్చటనె కొన్ని దినంబులునాఁగిపోతి, మా
పదలకుఁజిక్కుచున్‌గడువు బాసుజుఁడిచ్చె నహర్గణమ్ము, న
య్యదియుగతించె బాన భయమందిరిమెంతొ విరాళఁజెందుచున్ 26

ఎన్నొవనాలు గ్రుమ్మరితి, మెన్నియొ కొండలనెక్కినాము, మే
మెన్నియొ వాహినీతటము లెంతొ గవేషణఁజేసి కూడ, నే
తెన్నునఁగాంచలేక నిను దీనులమై మరణింపసిద్ధమై
యున్నతఱిన్ విషణ్ణుఁడయి యూర్చెను తారసుతుండుఁదూలుచున్ 27

ప్రాయోపవేశమ్ముఁజేయుమాపాలికి
వచ్చెసంపాతియన్ పక్షిరాజు
తల్లి! యాతండు సోదరుఁడు జటాయువు
నకు రావణునితో రణమ్మొనర్చి
మరణించెనని మేము మాటాడు కొను పల్కు
లాలించి వివరమ్ము లడిగె నంత
తారేయుఁ డాటనస్థానమ్ములో జరి
గినదంత వాక్రుచ్చె - ఖిన్నుఁడగుచు

దృష్టిసారించి యీ లంక దిక్కునను ద
శాస్యగేహమ్మునందు నిన్నరసిచెప్పె
రయమునను మేము వింధ్యపర్వతముపీడి
చేరితిమి సాగరతటమ్ముఁ జింతఁదక్కి 28

పారములేక ఘోషిలుచు భంగము లెత్తుగలేచు నాయకూ
పారముఁ దోఁచఁ గట్టెమట వానర వీరులు భీతినంద వి
స్తారమొనర్పనయ్యుదధి సాహస మెవ్వరుఁ జేయ రప్డునేఁ
జేరితి దాని దాఁటుచు నిశీధమునం జొరబాఱితిన్ బురిన్ 29

చూచితి దానవేశ్వరునిఁ జూచితి నంతిపురమ్ము సర్వమున్
చూచితి లంక నంతటిని చూచితిఁ బుష్పకమున్ త్రికూటమున్
జూచితి నీ యశోకవని చూచితి నిచ్చట నిన్నుఁ గూడ నేఁ
జూచిన సంగతుల్ వినిచి సూర్యతనూజుని ధన్యుఁ జేసెదన్ 30

రాముని దూతనేను – రఘురాము చరిత్రము విన్నవించితిన్
నీమది నున్న సంశయము నెమ్మిఁ దొలంచుచు మాటలాడుమా!
ధీమతి! రావణుండనని తెంపు వహింపవు – హాయి పుత్రుఁడన్
వేమఱుచెప్పనేల? హరివీరుఁడ నార్కికి మంత్రి నౌదునేన్ 31

నాపరిమార్గణమ్మునఁ బ్రకాశిక సత్ఫలమీయ స్వామినిన్
జూపులు ధన్యమై తనర చూచితి నిచ్చట మిత్ర నందనుం
డూపిరిఁ బీల్చి హాయిగఁ బ్రయోజన సిద్ధికి రామమూర్తి సం
తాపము వీడి హర్షమునఁ దా నరుదెంచు దశాస్యగెల్వఁగన్ 32

రాముని నానతి పైని లంకలోఁ గాలు పె
ట్టితిని నీ పొలకువ వెతక - రామ
చంద్రుఁడు కృష్ణుఁడు సాటి ధానుష్కులం
దఱిఁ గోనఁ గుశలమా దాశరథుల
కిద్దఱి కన్న సేవించును సౌమిత్రి
సుగ్రీవు వానరేశుని నియంత్ర
ణను నీ ధవుని శ్రేయమును గోరి నే నొకం
డనె లంక కేతెంచితిని నినుఁ గనఁ
గామరూపినై దక్షిణాశాముఖముగ
నరుగుదెంచితిఁ గపులట నబ్ధికూల
మందు దుఃఖితులై వేచియుందు రమ్మ!
వారి నూరార్తు నీ శుభవార్తఁ దెలిపి 33

నీ కుశలమ్ము నేఁ దెలుప నీరజనేత్రుఁడు వచ్చు వానరా
నీకముతోడ సాగరము నిస్తరణం బొనరించి రావణున్
భీకర సంగరమ్మున విభిన్న శిరస్కునిఁ జేసి సత్వరం
బే కలియున్ నినున్ జననిః యెక్కువకాలము పట్టదీపయిన్ 34

మాల్యవంతంబను మహీధర మందు మ
జ్జనకుండు కేసరి సాహసికుఁడు
వసియించు - గోకర్ణపర్వతమ్మునకేఁగి
శంబసాదన నిశాచరుని దేవ

సంయమి గణము లాజ్ఞాపింప వధియించె
శ్వసనుని వలనఁ దత్పుత్త్రియైన
అంజనాదేవికే నపుడు జనించితి
పుట్టినతోడనే వ్యోమవీధి
కెగిరి సూర్యుని ఫలమని యెంచిమ్రింగఁ
బోవఁ గులిశమ్ముతో వాసవుండు కొట్టె
దాన హనుమంతుఁడను పేరు తనరె నాకు
నమ్మకము కల్గ వచియించినాఁడ విద్ది 35

ఆ భాషణమ్ముల నాలించి జనకజ
సరగనానంద బాష్పముల విడిచె
రాహువు విడిచిన రమణీయ చంద్రబిం
బము వోలె భాసించెఁబడఁతి మోము
రామలక్ష్మణుల వర్ణనమును బట్టియు
చిహ్నమ్ములంబట్టి సీత యతఁడు
దనుజుండు కాఁడని దశరథాత్మజుఁడంపి
నట్టిమాతయె యని యాత్మనమ్మె
నందుపై మారుతి వచించె "నమ్మ! యింక
నీకు దుఃఖింపఁ బనిలేదు నెమ్మిఁ దెలుపు
మేమి నేయంగ వలయునో ధీమతి! వివ
రింపు మదినిర్వహింతు నీ యిచ్చకొలఁది 36

మఱియుఁక కొంత నమ్మకము కల్గఁగ సమా
 శ్వాసించి వాచించె శ్వసనసూతి
"వానరుండను తల్లి! పద్మాక్షుఁడగు రామ
 భద్రుని దూతను - భద్ర మగుత!
అనఘుఁడు రామ నామాంకిత ముద్రిక
 నిచ్చిపంపెను స్వీకరించు మిదిగో!
నను నీవు నమ్మట కనువగు రీతిగా
 నతఁడు నీ కోసమై యాశపడుచు
నుండె నని నీకుఁ దెలుపంగ నుంగరమ్ము
ప్రేమతో రాముఁడీయగా పేర్మిఁ దెచ్చి
నాఁడ! స్వామిని! నేను దానవుఁడఁగాను
పవనపుత్త్రుఁడ! రాముని బంటునగుదు

అది పుచ్చుకొని సీత యనఘుఁడే తనచేతి
 కందినంతగను నానందమొందె
ఉత్ఫుల్లమయ్యె నాయువిద ముఖమ్ము, ను
 పరి భర్తృ సందేశ సరణి హర్ష
మును, దానివల్లనుద్భూతమునందు సి
 గ్గును బొంది వాచించె హనుమఁగాంచి
"వానరోత్తమ! మహాబలపరాక్రమశాలి
 వగుచు సమర్థుఁడ వగుదువెంతొ

రాక్షసాన్వితమైన యీలంక కీవా
కండవే వార్ధిదాఁటి రాఁగలుగువాఁడ
విద్ది శతయోజనాయత మీశరధినిఁ
గలవు తిమితిమింగల నక్ర కమఠచయము 38

ఓ మహాకపి! నీవు మహోదధి నొక
పంట కాలువదాఁటిన పగిది దాఁటి
వచ్చితివి కాదె! సామాన్య వానరుఁడవు
కావనుచు నాకుఁ దోఁచు నీ చేవఁజూడ 39

ఈకారణమ్మున నీకు లేశము సంభ్ర
మములేదు - ధూర్తుఁడుఁ గమితమైన
పౌలస్త్యుఁడన నుంత భయము కూడనులేదు
రాముని పనుపున లంక కరుగు
దెంచుటవలన భాషించగఁ దగుదువు
బలపరాక్రమములఁ దెలిసికొనక
గుణగణమ్ములఁ జూచుకొనక రాముండెవ్వ
రినిఁబంపఁ డెచటికి ననఘు లిద్ద
ఱచట నా యదృష్టమువల్ల నద్రిపైని
కుశలముగ నున్నవారు రఘుప్రవరుఁడు
క్షేమముగనున్నఁ బ్రళయాగ్ని కీలవోలె
భస్మ మొనరింపవలఁతి విశ్వమ్మునొకఁడె 40

వారలు విక్రమమ్మున సుపర్వులనైనను నిగ్రహించు హం
వీరులు - కాని నావసట పెంపువహించునదేమొ - రాముఁడున్
ధీరుఁడు కాన నాకొఱకుఁ దెంపరులైన సమర్థదూతలన్
వారక దిగ్విదిక్కులకుఁ బంపె గవేషణసేయఁగోరుచున్

చేయఁదగిన ప్రయత్నముల్ చేయుచుండె
కాని సంక్రాంతుఁడౌచును దీనుఁడగుచు
నెచ్చటనొ పడియుండక ముచ్చుముడిఁగి
పనిచెఁగామరూపులఁ గపివరుల, నెపుక

సాహసానోపాయ సరణి మిత్రులయెడ
దానభేదములను దండయుక్తి
సంచితమ్ముగఁ బ్రయోగించుచు నాథుఁడు
కుశలియై యుండెన ? భృశము క్రొత్త
వారితో స్నేహమ్ముఁ గోరుచుండెన? దేవ
తానుగ్రహమ్మును దానుగడన
చేయుచుండెన ? సువిశేషమ్ముగా దైవ
బలముండెనా ? యెడబాటు వలన

నాయెడల స్నేహమును తగ్గె నాథునకు ?
సతఁడు నాదుఃఖమును మాన్పనా ? ఘనుండు
కష్టములకెప్డు లొఁగఁడు - సుఖమ్ములంద
నప్పొఁడగు - క్రుంగిపోయెనా యటమటించి ? 45

నూతనమిత్రులు సహితము
ప్రీతిపడుచు ధవుని చెలిమి పెంపారఁగఁ దా
మాతతముగ యత్నింతుర !
యాతని శ్రేయమ్ముఁగోరి యభిమానముతో 44

కేతమ్మున నున్న శ్వశ్రువులు కౌసల్యా సుమిత్రాది సు
కల్, సజ్జనుఁడైన మా భరతుఁడారోగ్యమ్ముగా నుండిరా ?
కల్యాణులు సోదరీమణుల క్షేమస్వాస్థ్యతావార్తలున్
కన్ జేరునె ? తెల్పుమా నిరతి సామీరీ ! ప్రహర్షమ్మునన్ 45

శోకమ్మున నన్యకార్యముల మాటేలేక వర్తించునా
శౌరద్యముఁగల్గు నావిభుఁడు దైవాఱంగ దైన్యమ్ము. నా
నా శోకమ్ము తొలంగునా ? దితిజు శిక్షించంగ యత్నించునా ?
సక్తుండుగ నన్నుఁ జేకొనున ? ప్రయ్యుల్ చేసి పౌలస్త్యునిన్ ? 46

భ్రాతృవత్సలుఁడైన మా భరతుఁడన్న
కొక్క యక్షౌహిణీ సేన నొడికముగను
సాయముగఁ బంపునొక్కొ ! మీ పవిత్రసూతి
వానరబలమ్ముతో వచ్చువాఁడె యిటకు ? 47

విక్రముండును, శస్త్రాస్త్రవేది యగుఁడి
లక్ష్మణుఁడు రాక్షసుల సమరమ్మునందు
సంహరించు తలంపుతో సాగువాఁడె !
రావణుని చావు చూతునా రణమునందు 48

చామీకరపద్మమువలె
రాముని వదనమ్ము మెఱయు రహితోలఁగి యివుం
డా మొగము వాడి దుఃఖము
తోమంజిమఁ గోలు పోయి దుస్సహమగునా ?

ధర్మము కోసమై తన రాజ్యమును వీడి
నను దెచ్చునపుడు వనమ్ములకును
కొంచమైనను విచారించని రాముని
కిపుడట్టి ధైర్యమే యిరవు కొనునె ?
రామునిపై నాకు రంజిల్లు స్నేహము
తల్లికిఁ దండ్రికిఁ దక్కువారి
కెవ్వరికిని లేదు - ఈ కారణమ్మున
నే రాము కుశలము నెఱుఁగు వఱకు
నేను జీవించి యుంటినో వానరోత్త
మా ! యటంచును జానకి మాని పలుక
వాయుపుత్త్రుఁడుఁ గరముల దోయిలించి
శిరముపై నుంచుకొని పల్కె సీతఁ గాంచి

"రాముఁడెఱుంగఁడీవిచట లంకను నుంటివటంచుఁగావునన్
దామరసాక్షిఁ దెచ్చుటకుఁ దానయి వెంటనె రాఁడు పోయె - నే
నామహనీయుఁ గాంచి విషయం బెఱిఁగించిన గొప్పసేనతో
గోమున వచ్చు భానుజునిఁ గూడి రయంబుగ విశ్వసింపుమా !

తన బాణంబుల రాఘవుం డుదధినే స్తంభింపఁగాఁజేసి లం
కను సర్వమ్మును నాశనమ్ము సలుపన్ గ్రవ్యాదుఁ డొక్కండుఁ గూ
డను శేషింపఁడు దేవదానవులకె యద్దంబైన నా మృత్యువే
ఘనురోధించిన వారిఁ జంపు సుమి నీకై విక్రమోద్వృత్తిపై 52

నీ యెడఁ గల్గు శోకమునఁ నే మృగరాజునకుఁ జిక్కు-వారణం
బాయనిపించు శోషిలుచు సమ్మతితో ! ఒట్టిడు చుంటి నీ పతిన్
హాయిగఁ జేరఁ గల్గెదవు-హాపది తప్పును-దైవ మావిధిన్
నేయును మేలు-రావణుఁడు జేప్పడి క్రుందును సంగరంబునన్ 53

జననీ ! రాముఁడు మాంసముఁ
దినఁడు, సురను గ్రోలడిపుడు రిపుటన్ మెసవున్
ఘనుఁడుఁ ఫలమూలమ్ములఁ
దిని బ్రదుకును మనసునందు దీల్పడి మసలున్ 54

నిరతమ్మును మనస్సు నీపైని లగ్నమై
యుండుటఁ బట్టి రాముండుఁదెలిసి
కొనలేఁడు మేన బ్రాలిన మక్షికమ్మును
మశకమ్ముఁ ద్రోలఁడు-మన్మథార్తి
విన్నె ధ్యానించును నీకై విచారించు
నిరంతమేమియుఁ బట్టదించుకంత
నిద్రనెఱుంగదు-నిద్రవచ్చినయెడ
తటుకునలేచు "సీతా" యటంచు

పుష్పమైనను, ఫలమైన, పొలుపు మీఱు
వస్తువేదైనఁ దనకుఁ గన్పట్టిన యెడ
"హా! ప్రియా!" యంచు విలపించు, నంగలార్చు
దీనముగను నిట్టూర్చును దేవి! యలంత 55

అతఁడుఁ బ్రస్రవణాద్రిపై ననిశము నినుఁ
దలఁచుఁ బరితపించుచునుండు తల్లి! నిన్ను
కలిసి కొనుటకు దృఢదీక్షఁగడఁక నేయు
చుండు నీ వియోగ వ్యథ నుస్సురనుచు 56

అనిలజునుడువుల నాలించి తన పతి
సంగతుల్ తెలియఁగ సంతసమ్ము
రాముండు చిక్కి శల్యంబుగా నయిపోవు
చుండె నన్వార్తతో నుమ్మలికను
రమణి కన్పించె శరన్మేఘశకలము
క్రమ్మిన చంద్ర బింబమ్ము మాడ్కి
హనుమంతుఁ గనుఁగొని యవనిజ వాచించె
"కపివీర!" విషమును గలిపి సుధ నొ
సంగితివి నీవు నాథుఁడు సతము నన్నుఁ
దలఁచుకొనుచుండెననుచును దదుపరి ధవు
డెంతొ శోకించు ననుచు నాకెఱుకపఱుప
మోదఖేదము లొకపరి ముంచె నన్ను! 57

పురుషుఁడపారవిభూతిఁబొందిన వేళ
కడచేని కష్టముల్ గలిగిన తఱిఁ
గూడ స్వతంత్రుఁడు గాఁడు దైవమె పురు
షునిఁద్రాడుకట్టి యాడ్చిన విధముగఁ
గదలించు-దైవ సంకల్పము నెవ్వర
తిక్రమింపగలేరు-విక్రముఁడగు
రాముండు, నేనును, లక్ష్మణుండిటుల దుః
ఖార్తులమై యుంటిమయ్య ! చూడు
కడలిలో నౌక పగులఁగఁబడిన వాని
పగిది నాధవుడెప్పు డాపదలఁగడచు
నాశనముఁజేసి దనుజుల, నన్నుఁజూచు
నెపుడు నావిభుఁడిచట వచింపఁగలఁడొ ? 58

గడువు రెండు మాసములె రాక్షసుఁడొసంగె
నది కడచిపోవుటకు ముందె హనుమ ! నీవు
పిలుచుకొని రమ్ము తొందరపెట్టి రాము
నిచ్చటికి దానవాధము నీల్గఁజేయ 59

బెట్టిదుని సహజుఁడగు విభీషణుండు
నైకవిధముల నను రామునకు నొసంగు
మనుచు నిగదించె - రావణ దనుజుఁడందు
కొప్పు కొనఁడయ్యె నేమని చెప్పుదాన ! 60

మరణ మాసన్నమయ్యె దుర్మాని కపుడె
అనలయను విభీషణు పుత్త్రి యరుగుదెంచి
యా విషయ మెఱింగించెను హనుమ ! జనని
పనుపగా వచ్చి నాతోడ మునుపె తాను 61

కలియును నన్ను నావిభుఁడు కారణమున్ విపరీతు నీకు ని
ర్మలముగ నుండె నా మనసు - రాముఁడు గొప్ప గుణమ్ములున్నయు
త్కలుఁడు - పరాక్రమమ్మును, గృతజ్ఞత, కారుణికత్వమున్ ప్రభా
విలసనమున్ జెలంగు రఘు నీరునిఁబోలిన వారలుందురే ! 62

పదునాల్గువేల దనుజుల
జదిపె జనస్థానమందు సహాజుని సాయ
మ్మెదియున్ గొనఁబోక దురా
సదుఁడయి తానొకఁడె సాహసమ్మున హనుమా ! 63

అతనితో వైరము వహించి బ్రతుకఁగలఁడె
దనుజపతియైన మఱి వాని తాతయైన
దేవవిభుశక్తి నా శచీదేవి యెఱుఁగు
నటుల రాముని శక్తి నా కవగతమగు 64

రాముఁడను సూర్యదేవుఁడు ప్రదరములను
కిరణముల తోడ వేగ నింకించు శత్రు
రాక్షస జలమ్ము నెంతొ సులభముగ నని
సుదతి భాషించెఁగనుల నశ్రువులు జాఱ 65

హనుమంతుండు వచించె నందుపయి "మాతా! నేను తోడ్తోడనే
చని కాకుత్స్థుని తోడ నీ విషయముల్ సర్వమ్ము నేఁ జెప్పఁగా
ఘనుఁడే తెంచును భల్లకీశగణ సంఘాతమ్ముతో దాను సు
త్యునితో - వచ్చును రావణున్ రణమునందున్ విక్రమోపేతుఁడై 66

ఇదియుఁగాదనిన నిన్నిప్పుడే విడిపింపఁ
గలను సంత్రస్తవు కాక నాదు
జమ్ములపైని నిషణ్ణవైన నిమేష
మాత్ర వార్ధిని దాఁటి మహితు కడకు
నినుఁదీసికొనిపోదు - నిన్నె కా దీలంకఁ
బెకలించి కొనిపోదు - వీతిహోత్రు
డమరనాథునకు హవ్యమునందఁ జేసెడి
మాడ్కి రామునకు సమర్పణమ్ముఁ
జేయఁగలుగుదు దైత్యులఁ జెనఁక సిద్ధ
పడు మహావిష్ణువు కరణి ప్రస్రవణ ధ
రాధరము పైని నిల్చిన రాఘవేంద్రు
లక్ష్మణునిఁ జూడ గలవు దురాయినిమ్ము 67

ఆ పర్వత శిఖరముపై
రాపడుచున్ నిలుచు నాగరాజు విధముగన్
చూపుల దిక్కుల కొసలకు
వ్యాపృతుఁడై బిఱుపు నాథు నభిరతిఁగననో 68

నీవుపేక్ష సేయకు మమ్మ ! నేఁడె పతిని
రోహిణీ కాంత నిభుఁడు చంద్రునిఁగలిసెడి
చందమున నిన్ను రాముని సరసనుంతు
సమ్మతింపుము నీ బాధ సమయు తల్లి ! 69

భాస్కరునితోడ, శశితోడ భాషణమ్మ
సేయుపగిది నంసములపై చింతమాని
యెక్కి కూర్చుండుమంతె ! నిన్నెత్తుకొనుచుఁ
జనెద నాకాశమార్గాన వనధిదాఁటి 70

వియదధ్వమ్మున నిన్నుమోసికొనుచున్ వేగమ్ముగాఁ బోవ వి
స్మయులై దానవ యోధులందఱును నామార్గమ్మురోధింప వి
క్రియతోడన్ జనుదెంచి వెంబడిని రాలేకావడిన్ జెందుచున్
భయమున్ బొందుచు నాఁగిపోయెదరు పోవన్ మేలు సాధ్వీమణీ ! 71

నేనిచటి కెటులవచ్చితి
నోనలఁగక యటులె మరల నూల్కొన జననీ !
నే నెత్తుకొనుచు నభమునఁ
బోనేర్తును సంధియమ్ముఁబోనాడు మిఁకన్ 72

నా మూఁపులపై నెక్కుము
స్వామిని ! ప్రస్రవణగిరికిఁ బయనింతము శ్రీ
రామునిఁ జూచెద వర్మిలి
నామోదించినఁ గృతార్థుఁడగుదు సవిత్రీ ; 73

ఆ వాక్యమ్ముల నాలకించి మదిలో నానందమున్ బొందెఁ దా
నా వైదేహి సమీరనందనునితో హాసించి ప్రశ్నించె : నో
యీ ! వాతాత్మజ ! అంతయున్ సరియె కానీ ! యంతదూరమ్ము స
ద్భావంబుండియు నెట్లు మోసెదవు తెల్పంబూనుమా ప్రేమ్మిడిన్ 74

ఇదియుఁగాపేయమని నిరూపించుచుండె
హ్రస్వరూపివి - ఆపయి సిద్ధియుండె
గమన మాకాశవీధినిఁ గనుక హనుమ !
మంచిదెట్లైను నీయభిమతముఁ జెపుమ ! 75

ప్రతిహతుఁడయ్యె వాయుజుఁడు భామినిప్రశ్నకు ద్రుళ్ళియాడుచున్
ప్రతిభ, ప్రభావ సత్త్వములఁ బావనికిం దెలుపంగఁ దోఁచనే
స్తుతమతి స్వస్వరూపమును జూపఁదలంచుచు రామపత్నికిన్
గుతకుతలాడుచున్ బెరిగి కోమలిముందర నిల్చె దీప్తిమై 7

సుదతి యాతనివంకఁ జూచుచునుండఁగా
మేరుమందరముల మించి పెరిగె
వహ్నినిభుండుగా వర్ధిల్లె వదనమ్ము
నరుణారుణంబయ్యె నతఁడు వజ్ర
దంష్ట్రినఖుండయి ధాత్రిజతోఁ బల్కె
'దేవి ! భూధరములు, దివ్యవనులుఁ
ప్రాకారములు, ధర్మభవనమ్ములును, గోపు
తోరణమ్ములుఁగల్గి ద్యుతుల వెలుఁగు

లంకసర్వము నామూఁపులంధరించి
మోయగల శక్తి నాకుండె భూమిజాత ।
నావిషయమందు శంకకుఁదావులేదు
రాముదుఃఖము, సౌమిత్రి రాపుఁదొలఁగు 77

హనుమంతుఁ బరికించి యవనిజ భాషించె
"ఓమహాకపివీర! యుడుగు మింక
నీసత్త్వజవముల, నీ వహ్ని తేజము
నే నెఱుంగుదును ధురీణుఁడగుదు
నీవు సామాన్యుఁడవేని వార్ధిని దాఁటి
యీలంకఁగాలిచ నెటుల సాధ్య
పడు నీవు పుడల నీ వనధిఁ దరింపఁజా
లుదు వని తెలియును సదమలాత్మ ।
నన్ను నీ భుజమ్ములపయి నాధుసన్ని
ధికినిఁ జేర్చెదవనికూడఁ దెలియునాకు
కాని శ్రీరామచంద్రుని కార్యమునెఱ
వేఱునటుఁ జూడవలెకాదె వీఁగుహృదిని 78

శ్వాసను వేగముమించు జవనిమతోనీవు
బోవంగనే మూర్ఛపోవవచ్చు ।
వ్యోమపథమ్మునఁ బోవుచుండగను గ్రిం
దికిఁ జూడఁ గన్నులు తిరిగి నేను

జలధిలోఁ బడవచ్చు - జలజంతువప్పుడు నన్ను
దినివైచు - వైరులఁ దునుమ గలవు
నీవు - నేనెటులైన నీతోడ రాలేను
కావలె నొకరి రక్షణము నాకు

నన్నుఁగొనిపోవు వేళను నాకె కాదు
వివిధ శస్త్రాస్త్రప్రచయముతో వెంటఁబడు ని
శాచరుల నడ్డ వలయు రక్షణము నీకె
కనుక సంశయగ్రస్తమౌ కార్యమెల్ల 79

నీవు నిరాయుధుండవు వనేచర ! యాయుధపాణులౌచు దు
ర్భావము తోడ వెంటఁబడు రాక్షసయోధుల నివ్వారింపఁగా
నీవెటు పోరఁజాలుదువు నేను భుజమ్ములపై వసింపఁగన్
నీవొకరుండవే కద ! యనేన్ గెలువందగు శక్తియుండియున్ 80

నీవున్ రాక్షసులున్ దురమ్మునకు యత్నింపంగ సంభ్రాంతినై
పోవన్ సాగరమందు నేఁబడుదునేమో - వారు నన్నేమియున్
గావింపన్ దొరకోలు చేయుటకు సంకల్పింపఁబోవుదురే !
ఆ వీరుల్ నిను గెల్వ వచ్చును ససంఖ్యాకుల్ కదా ! మారుతీ ! 81

ఆ కల్మాషులు చండవిక్రములు కాదా ! యుంటిమీ వారితో
నీకున్ బోరగ నౌను నెగ్గడములో నే నొక్కెడన్ నిల్వ న
ప్రాకన్ గొందఱు కొంచుపోయినను గారాదందుమే ! పెక్కు ఁఢ
కాకుల్ తప్పవు నాకు రావణుని లంకావాసమే తథ్యమౌ ! 82

సంశయాస్పదములు సంగ్రామమందు జ
యాపజయమ్ములు - చూతు ధాను
లవహరింతురో ! లేద యనిలాత్మజా! కోప
మునఁజంపివైతురో ! కనుక నీ ప్ర
యత్నము భగ్నమై యాపదలో నేను
పడిపోవ వచ్చును బలపరాక్ర
మములతో నెన్నిన మహిలాత్ముఁడగు రామ
చంద్రుని యశము నాశమ్ము నొందు
వానరులు రామలక్ష్మణుల్ వైనములను
దెలిసికొనలేని తావున నిలుపు నన్ను
కనుక నీ ప్రయత్నము మాని వెనుక కరిగి
రాఘవునిఁదీసికొని రమ్ము ! రగడయేల ?

నా రామచంద్రు ప్రాణములకు లక్ష్మణు
ప్రాణమ్ములకును, నీ ప్రాణములకు
రాజకుటుంబము ప్రాణమ్ములకు నేన
యాధారముగనుంటి నట్టి నేను
మఱియొక విధముగా మనుజాశనుల చేతి
లోఁజనిపోయిన లోఁగి దాశ
రథు లున్నపాటునఁద్రాణముల్ విడుతురు
వానరవీరులాహ ర్త వినిన

సుసుఖులను పీడగలరది యుండనిమ్ము
ధర్తృభక్తినిఁబట్టి నేఁ బరపురుషుని
ముట్టుకొన నెప్పుడును గూడ-మున్నుపంక్తి
ముఖుఁడు నే వివశగనుండ ముట్టెనంతె । 84

వానరా । నే ననాథను బరవశ నవు
దేమి సేయఁగల్గుదును నీవే వచింపు
మో ప్లవగవీర । పతి దశాస్యుని వధించి
నన్నుఁగొనిపోవ నతనికి న్యాయమగును 85

రామచంద్రుని మేటి పరాక్రమమ్ము
వింటిఁజూచితి మును కపివీర । అసుర
దనుజ గంధర్వ నాగసంతతుల నెందు
నాతనికిఁ జాలు నెఱజోదు నరయలేము । 86

విల్లుఁబూనుచొ తడవుగా పీతిహోత్రుఁ
బగిది దుర్నిరీక్ష్యుండగు మగఁటిమి గల
వారలెవ్వరాతని ముందు ఖండనమున
నిలువలే రాతఁడంశటి నిస్తులుండు । 87

ఓ పవమాననందన । రఘూద్వహునే కొనితెమ్ము । ద్వేషమున్
బాపిని సంహరించి తన పత్నినిఁజేకొన నిమ్ము తేఁకువన్
కోపము తీఱదంతవఱకున్ హృదయంబున శాంతిలేదు సం
తాపము మాన్పి సంతసము తావుకొనంగను జేయఁగోరెదన్ 88

అతఁడు సలక్ష్మణుండగుచు నద్ధిఁ దరించుచు భానుపుత్త్రితోఁ
బృతనను గూడివచ్చుట లపేక్ష్యము - దానవనాశనమ్ముతో
కుతుకముఁ జూపు లోకములు కూడ విముక్తినిఁ బొందుఁ దోడుతో
క్రతుభుజులున్ శమింతురు సుఖమ్ము సఁగూడిన మౌనికోటికిన్'' 89

అని వచియింపగా సుదతి యా హనుమంతునితోడ నెంతయో
మనసున సంతసంపడుచు మారుతి వాఙ్నిపుణుండుఁ బల్కె 'నో
జనకజ! స్త్రీ స్వభావమున సాధ్వులకుం దగు రీతిఁ జక్కఁగా
వినయసమన్వితమ్ముగ వివేకముతో వచియించి నా వాగిన్ 90

ఒకవేళ నీవు కూర్చుండిన నాభుజ
మ్ములపైని జవనిమఁ బోవ నూరు
యోజనమ్ములు దాఁట యోషితలకు నిల్వ
సాధ్యమ్ము కాదు ప్రశాంతముగను
పతి రాఘవునిఁ దప్పఁ బరులఁ దాఁక నటంచుఁ
బలికితివది రామపత్నికె తగు
మఱియొక వనిత యిమ్మాడ్కి వచింపదు
నీవు పల్కినదెల్ల నేను రామ
మూర్తి కెఱిఁగింతుఁ బలుహేతువుల నెడంద
కరఁగి పోవఁగ నెంతొ యుత్కంఠనటుల
నాభుజమ్ములపై నిన్ను నాథు కడకుఁ
జేర్తునని మేలొనర్పఁగఁ జెప్పితి సుమి! 91

అన్యులెవ్వరు దాఁటలే రబ్ధిననుచు
లంకలోఁ బ్రవేశింపఁగ రారటంచు
నే నెఱుంగుదు నాశక్తిఁ గాన నటుల
పలికితిని మాత! మన్నింపవలెను నన్ను 92

గౌరవము పేర్మి, స్నేహమ్ము కారణమున
భక్తిభావము వలన నీ వల్లభు నినుఁ
గలుపు నాత్రముతో నట్లు పలికినాఁడ!
అన్యథా తలంపకుమమ్మ! ధన్యచరిత! 93

నాతోవచ్చుట కుత్సహింపవే యెడన్ నాకిమ్మభిజ్ఞానమే
నో! తోకొంచును బోయి నీ ధవునకున్ దోడ్తో సమర్పించెదన్
జేతస్ఫూర్తిగ విశ్వసించు! నను నీక్షేమమ్మెఱింగింపఁగన్
బ్రీతుండై తన శోకమున్ విడుచు నుర్వీజాత! విస్ఫూర్తిమై 94

ఆవిదగ్ధుని పలుకుల నాలకించి
కొంతతడ వార్తితో సీత కూరుచుండెఁ
దనపురాస్మృతు లెన్నియో మనసునిండ
పలికె గద్గదకంఠయై చలితహృదిని 95

"మారుతీ! నీకొక మంచిగుర్తును చెప్పె
దను దానిఁ జెప్పుము దాశరథికి
వసియించితిమి వనవాస కాలమ్ములోఁ
జిత్రకూటాద్రినిఁ జేరువగల

మందాకినీ తీరమందుఁ గూర్చుంటిమి
సిద్ధాశ్రమమ్మందేఁ జెంతఁగంద
మూలఫలమ్ములుఁ బుష్కలమ్ముగనుండేఁ
గుసుమవనమ్ములుఁ గూడకలవు
ఆత్మవిభుతోడ విహరించి యలసి ధవుని
యూరువున నివిష్టనయి నిట్టూర్చుచుండ
వాయస మ్మామిషార్థము వచ్చి చంచు
వునఁబయోధరముల మధ్యఁ బొడిచెనన్ను 96

మట్టి బెడ్డతో వారింప మానకచట
నక్కయుండెను మాంసమునకుఁ గరటము
త్రోలుచుండ దానిని మొలనూలు జాఱె
దానిని బిగించుచుండ వస్త్రమ్ము తొలఁగె 97

నాధుఁడప్పుడు నను(ఁ) జూచె - నన్ను జూచి
యూరుకొనక నవ్వెను నాకు మేరమీఱె
సిగ్గు, కోపము తొడపైనిఁ జేరి మరలఁ
గూరుచుండగ విభుఁడు నన్నూఱడించె 98

కాకి చేసిన దానికిఁ గనులనీరు
పెట్టు కొంటిని దానిని ప్రేమతోడ
రఘువరుండును దిలకించె ప్రణయమూర్తి
నీరజాక్షు నంకమ్మునై ని నిద్రపోతి 99

నేను మేల్కొన నాపుండు తాను నిద్ర
పోయె నాయూరువులపైని పొంచియున్న
ధ్వాంక్షమేతెంచి నా స్తనద్వయము మధ్య
పొడిచె నగలించినను గాఢ పోక మరల 100

రక్తము స్రవించి పెల్లుగా రామునురము
క్లిన్న మొనరింపలేచి పరిస్థితిఁ గని
విభుఁడు తోకఁ ద్రొక్కిన త్రాచు విధముగ బుస
కొట్టుచును నన్నుఁ బ్రశ్నించెఁ గోపియగుచు 101

"నీ స్తనమ్ముల మధ్య నికృతప్రజ్ఞుఁ డెవండు
పొడిచె నీరీతిగా బొలఁతి చెప్పుమ ।
అయిదు శిరస్సుల యహిరాజుతోఁ జెల
గాటమాడుచు నున్న కమిత యెవఁడ
టంచు నిప్పులఁ గ్రక్కియరయంగ నఖములఁ
గాళ్ల, ముక్కునను రక్తమ్ముతోడ
కానిపించెను కాకి కదలక యటనుండి
యది యింద్ర సుతుఁడు జయంతుఁడండ
జములలో మేటి - నివసించు పతము శైల
కందరమ్మున జవనిహ కలుగు పవను
తో సమానముగా నద్ది తోయజాక్షిఁ
డెపుడొ తరువాతఁ జెప్పెను కపివరేణ్య । 102

ధవుఁడు కోసమున నాస్త్రదర్ప మంత్రించి
వదలెఁగాకముపైకి కదలె నదియు
బ్రహ్మాస్త్రమై వెంటఁబడె యుగాంతాగ్నిచం
దమున వాయసమున దఱుమనద్ది
బ్రహ్మరుద్రాదుల పాలికిఁ బరువెత్తి
శరణువేఁడెను గాని శక్రసహిత
సర్వదేవతలు విచారమ్ముఁ బ్రకటించి
సాయమ్మొనర్పక సాగనంప
నే మహర్షులు దానిఁబట్టించు కొనమి
కడకు రాముని చరణముల్ గతియటంచు
నాశ్రయింపఁగ నతఁడు దయార్ద్ర హృదయుఁ
డై వచించెను బలిభుక్కుఁగావఁ దలచి 103

"నీచుఁడవైనను నిన్ను రక్షించెద
బ్రహ్మాస్త్రమగుడు వ్యర్థమ్ముగాదు
నీకోరికనుబట్టి నిన్ను శిక్షించును
గాన వెల్లడి సేయ నేను దాని
నటు నియంత్రణసేతు" ననగ నాకరటము
ననఘునిఁ బ్రార్థించె నస్త్రముఁదన
సవ్యనేత్రము జొర సమ్మతింపఁగ రాము
డాకాకి మన్నించి యటు లొనర్చె

ప్రాణములు దక్కెఁ గాకికి-రామచంద్రు
నకును, దశరథ భూపాలునకును మ్రొక్కి
చేరెఁదన గహ్వరమ్మును జెనఁటి-దీని
జ్ఞప్తి కెలయింప విభుఁడు హర్షమ్ము నందు 104

హనుమా! నాకొఱకొక్క కాకిపయి బ్రహ్మాస్త్ర ప్రయోగమ్ముఁజే
సిన రాముండిపుడేల రావణుఁడు దుశ్శీలుండునన్ ద్రుచ్చిలన్
దనకుంబట్టని రీతిగా మెలఁగ నాతప్పేదియో యుండి యుం
డును-లేదేని కృపాళు వాతఁడు ననున్ నొప్పింపఁ గాపాడఁడా; 105

నేను రాముని భార్యనై హీన పగిది
బ్రదుకు చుంటి ననాథనై లంక లోన
పరుల యెడ దయఁజూపుట పరమ ధర్మ
మనుచు నాతఁడె ప్రకటించె మునుపె నాకు 106

అతఁడు మహావీరుఁడని
అతఁడు మహోత్సాహుఁడనుచు నవగాహనయౌ
నతఁడు సముద్ర గభీరుం
డతఁ డబ్ధిపరీతభూమికధినాథుండౌ 107

ప్రముఖుఁడస్త్రవేత్తలలోన రామవిభుఁడు
ప్రదరముల రావణునిపైని వదలఁడేల?
నాగ గంధర్వ విబుధ దానవులు యుద్ధ
మందు నా నాథునెదిరింప నోపఁగలరు 108

ఆ మహావీరునకు భార్యనైన నన్నుఁ
దీసికొనిపోవు మంచి యుద్దేశమున్న
రాక్షసుల సంహరింపఁడె రాముఁడు ?
లక్ష్మణుఁడు కూడ రక్షింపరాఁడదేల ? 109

దీప్తవహ్నితేజస్కులు దేవవిభున
మానులా దాశరథులు, సమర్థులస్త్ర
విదుల నగ్రేసరులు మహావీరులయ్యు
దైత్య నాశనమొనరింపఁదలఁపరేమి ? 110

లోపమేదియొ యుండు నాలోన హనుమ !
లేనియెడ వారు రాకుందురే ! తెలుపుము
అంత విషమయిపోతినా ? అంత దురిత
మేమి చేసితినోరాఁడు రాముఁడిటకు" 111

ధరణీనందన దుఃఖమున్ గనుచు నోదార్పంగ యత్నించుచున్
హరివీరుండు మృదూక్తులం బలికె "నమ్మా ! రామచంద్రుండు నీ
విరహంబందునఁ దప్తుఁడై నిలుచు నిర్వీర్యుండుగా నన్నియున్
మఱచున్ దేహము బెంగతోడఁ గృశియింపన్ బొందునైరాశ్యమున్ 112

చిక్కి శల్యమౌ రాము దుస్థితినిఁ గాంచి
ఆత్రపడుచుండునెంతో సుమిత్ర సుతుఁడు
దిగులు చెందు-దుఃఖించును-దెసలు చూచు
నిన్నుఁ దలఁచు నీ చరితము నెన్ను సతము 113

ఈ కష్టమ్ములు బాయు నింకపయి తల్లీ! నీవు శోకింపఁగా
నేకాంతమ్మున నేమిహేతువును లేదీ నాఁటితో బాధలున్
బోకార్పందగు యత్నముల్ జరుగు చొప్పుల్ తోఁచు వీక్షింపనో
వైకల్యమ్మను వీడి ధైర్యమును భావంబందు నెక్కొల్పుమా! 114

పురుషవ్యాఘ్రులు, బాహువీర్యులగు రాముండున్ సుమిత్రాసుతుం
దరుదెంచంగల రగ్నిబాణములతో నా రావణున్ బుత్రులన్
బరివారమ్మును, బంధుతన్ గెడపి దుర్వారమ్ముగా లంకనే
నిరతిన్ జేయును భస్మసాత్కృతముగా నిన్ గొంచుపోవున్ సుమీ! 115

అనతికాలమ్ములో నయోధ్యకును నిన్నుఁ
దీసికొనిపోవు-లేదు సందేహమింత
ఏమి చెప్పఁదలంతువో రామునకును
చెప్పు మానుడువులను నాకు చింతమాని 116

లక్ష్మణునకును వానరరాజుకేమి
చెప్పవలయునో యయ్యది చెప్పుమమ్మ!
వనట నందగఁబనిలేదు వారు వచ్చి
నిగ్రహింతురు పగవాని నిజము తల్లి! 117

అని హనుమంతుం డడుగఁగ
వినయంబున భూమిజాత విడుచుచు గన్నీ
రనియెను గపివీరునిపై
ననుదృష్టింబఱపి యెంతొ యనుతాపముతో 118

''సామీరీ ! రఘుకులస్వామిని దర్శించి
నాకు మారుగ మ్రొక్కి-నమ్రముగను
క్షేమమ్ము నడుగుము-సౌమిత్రి కుశలమ్ము
బృచ్ఛింపు మాతఁడు వీడి వచ్చె
జననిని, జనకుని, జాయను, సుఖముల
మా వెంట వనులకు-మఱఁదినన్నుఁ
దల్లిగా, నాథునిఁదండ్రిగా భావించు
రక్షకుఁడాతండు రామునకును
నాకు వనవాన కాలాన-నను దశాస్యుఁ
డెత్తుకొని వచ్చు టెఱుఁగఁడాయ త్తపడును
వృద్ధులను భక్తితోడ సేవించు. సింహ
సంహానుఁడు, మితభాషి. ప్రశస్తుండు 119

సౌమిత్రి సర్వ లక్షణ లక్షితుఁడు, మహా
బాహువు, నయశాలి, పౌరుషమ్ము
పుంజీభవించిన పోటరి, శ్వశురస
మానుఁడు నాకెంతొ మాననీయుఁ
డమిత తేజశ్శాలి. గమనించు నాథుఁడే
కార్యము జెప్పినఁ గష్ట మనక
తప్పక నెఱవేర్చు తాలిమితో, తన
తమ్మునిఁ గాంచుచుఁ దండ్రిఁ గూడ

మఱచె రాముఁడు-నీవె లక్ష్మణుని నాకు
మారుగా క్షేమ మడుగుము మారుతాత్మ
జా! ప్లవగ వీర! ధవుని విచార మెల్ల
నీవె పోనాడవలెను మన్నించి నన్ను 120

ఇదియున్ గూడ వచింపుమీ విభునితో "నింకొక్కమాసంబె నే
బ్రదుకన్ జాలుదు సిద్ధి సత్యము పయిన్ వాతాత్మజా! ఒట్టు పె
ట్టెద నీమాసము పోవ నాయుసుఱులున్ తేవల్ విడున్ వల్లభున్
గదలింపన్ వలె నాపరిస్థితుల వక్కాణించి వైనమ్ముగా 121

బలవైరి వృత్రుని వధియింప నాతని
కంటెను బ్రహ్మహత్యావృజినము
శ్రీమహావిష్ణువు చేయింప వైష్ణవ
హయమేధ మతనితో నపుడు దొలఁగె
నిష్కల్మషుండైన నిర్జరేశ్వరునకుఁ
ద్రైలోక్య మిచ్చె నారాయణుండు
ప్రక్రమముగ నింద్ర లక్ష్మి పాతాళము
జేర వేలుపు లశరీరవాణి
వలన నాసంగతి నెఱింగి బయలుదేఱి
తిరిగి శ్రీహరిఁ బ్రార్థింప దేవవిభుని
కొనఁగె నింద్ర లక్ష్మినిఁ దెచ్చి యొడయఁడు ననుఁ
దీసికొని పోవ ధర్మము దితిజు వచ్చి 122

ఇదె చూడామణి నిచ్చుచుంటిఁ గొనుమా ! యిద్దానిఁ గైకొంచు స
మ్మదమందన్ వెసరామభూవరున కిమ్మా యంచు ! వైదేహి యా
తని కీయంగ సమీరజుండపుడు సీతాదేవికిన్ భక్తిమై
వినతుల్ చేసి ప్రదక్షిణించె మొగమున్ విస్ఫార హర్షమ్ముతో 123

అతఁడు శారీరకమ్ముగ నచటనుండి
నప్పటికి మానసికముగ ననఘుఁడైన
స్వామి సన్నిధిలోనున్న పగిదిఁ దలఁచె
నతని యానంద జలధికి నవధిలేదు 124

అతుల తన శిరోరత్నము హనుమకొసఁగి
మరల వచియించె మైథిలి మాన్య ! రాముఁ
డీ మణింగాంచి తాను స్మరించునన్ను
జనని, దశరథ సార్వభౌముని విభుఁడు 125

నా వివాహకాలమ్మున నా సవిత్రి
జనకునడిగి శిరోరత్నమును గ్రహించి
నా కొసఁగె దీనిఁగావున నోకపివర !
శ్రద్ధఁజూపుమీ విషయము రమణఁ దెలిపి 126

ప్రోత్సహింపుము రాఘవేంద్రుని ఘనముగ
నాపరిస్థితి నెఱిఁగించి, జ్ఞాపకమ్ముఁ
జేసి యీ శిరోరత్నము సీతకెవ్వ
రొసఁగిరో యెప్పుడో తెల్పి పొసఁగమేలు 127

ప్రక్తియుక్తులఁ బనిఁజేసి శ్వసనసూతి!
నీవు నా దుఃఖమును బాప నీరజాక్ష
సకల వానరసేనతో సవితృతనయు
తోడ సౌమిత్రితో వెసఁ దోడితెమ్ము 128

పవిరుండును సీతభాషణము లాకర్ణించి సంభూతిమై
మహార్తన్ దశకంఠ రావణుని సంహారమ్ముఁ గావింపఁగన్
పరివారునిగా దినేశకులజున్, సౌమిత్రి, దైవాకరిన్
పులాంబోధిఁ దరించి తెత్తునని యుర్వీజాతకున్ జెప్పుచున్ 129

శ్వసనపుత్త్రుఁడు శిరసాష్టాంగ దండప్ర
ణామమ్ము లొనరించి నయనపుటము
లందుఁ బెల్లుగను నానందమ్ముఁ దొలఁకాడ
బయలుదేఱుచు నుండఁ బడఁతి పలికె
"హనుమంత! క్షేమమ్ము నడిగితినని చెప్పు
మా రఘూద్వహునకు, ననుజునకును
సచివసహితుఁడగు సవితృనందనునకుఁ
బ్లవగ వృద్ధులకుఁ బ్రక్రమముతోడ
నేది చేసిన నాథుఁడహీనచరితుఁ
డీ వనట నుండి నను లేవనెత్తఁగలఁడో
దాని నొనరింపఁజేసిన ధన్యనగుదు
వచ్చి నను గొంపవించిన బ్రదికిపోదు! 130

నీవు ప్రోత్సాహ పఱచిన నిందుపౌరు
షమ్ము దీపింప రామలక్ష్మణులు వచ్చి
యొడికముగఁ బోంగలరు వీరోచితముగ
నా కొఱకుఁ బవమానసందన ! పరువడి 131

ఈ నా సందేశమ్మును
వానరప్రవరా ! యెఱుంగ పలికి రఘునితో
సేనలఁగొని తెచ్చినచో
దానవసంహారకాండ తప్పక జరుగున్ 132

కెలయుచు వాయుసూతి పలికెన్ జనకాత్మజ ! దీన సందియం
బలమదు సుంత రాఘవుఁడు నాలము సేయగ వచ్చు సానుజున్
బలమును, సోదరున్ గొనుచు వార్ధిఁదరించి దశాస్య, సేనలన్
బొలియగఁజేసి నీ వనటపోవగఁజేయును నమ్ముమో సతీ ! 133

రామప్రయుక్తమార్గణములన్ నిలుపోపెడివాఁడు మర్త్యులన్
ధీమతి ! వేల్పులందుఁ దొలదిండులలోఁ గనరాఁడు-వాసవున్
ధామనిధిన్ తదాత్మజుని తప్పక తాను జయింపఁగల్గు నా
స్వామియె సర్వభూమి పరిపాలనఁజేయ సమర్థుడౌ సుమీ ! 134

నీ కోసము రఘురాముఁడుఁ
బ్రాకటముగఁబోరు లందు రాక్షసవ్రజమున్
బోకార్చి విజయలక్ష్మినిఁ
జేకొను నిది తథ్యమసఁబ్రసితుఁగని మెచ్చెన్ 135

గాంచిన భావమున్ సెంపు కన్నులతో హనుమంతుఁగాంచి వి
స్ఫారిత నేత్రయై "ఎటువ వచ్చు మతొక్కదినమ్ము లంకలో
నేరిమి వైరులేరు గమనింపనిచోట శ్రమమ్మువాయ సా
మీరి । మహార్ణవమ్మును గ్రమింపగ సాధ్యమసున్ సుఖమ్ముగా 136

ఎంత సేపీవు నిలుతువో యిచట సంత
దనుక శోకమ్ము మాయుమో హనుమ । నాకు
అగుఁ మెచటన్నొ యొక రహస్యస్థలమున
నలసటను దీర్చికొని పోవనగును కాదె । 137

నీవరుదెంచు లోన మరణింపగ వచ్చును నే నభాగ్యనై
కావునఁ గ్రొత్త దుఃఖమును గల్గును నిన్గనరామి పెల్లగా
పావని । నాకు సందియము వచ్చును దాశరథుల్ బలమ్ములన్
రావణ దానవున్ గెలువరాఁగలరే వనధిన్ దరించుచున్ 138

నీకును గరుడికి శ్వసనున
కీ కడలిని దాఁటుశక్తి యిరవొందుగదా ।
శోకులఁ బరిమార్పఁగఁ దా
నేకరణిని లంకఁజేరు నిది సాధ్యంబా? 139

రావణునిఁ జంపి నను రఘురాము తోడఁ
గలుపుటకుఁ జాలుదువు నీవు కాని యట్లు
దైత్యనాథు సమిత్ర బాంధవముగ మ
యించి నను దీపికొనిపోవుటే ఘనము । 140

తన నిశిత మార్గణమ్ముల దనుజనగరి
ధ్వంస మొనరించి నన్నయోధ్యకును దీసి
కొనుచుఁ బోయిన రాఘవు ఘనత హెచ్చు
కీర్తికరమార్గమరయుమో కీశప్రవర 141

కపివరుని కిద్దితోఁచె సకారణముగ
దానిపై సమీరజుఁడు సీతను గనుఁగొని
యామె సందేహమెడలంగ ననియె నేత్ర
కోణముల భక్తి తొలఁకాడఁ గొప్పరించి 142

వానిరిసేనలం గొనుచు వచ్చును వానరనేతయైన సు
గ్రీవుఁడు - చండవిక్రముఁడు వేసరగాఁ బనిలేదు దీక్షతో
నీవిషయమ్ములోన దృఢనిశ్చయబుద్ధిఁ జెలంగు స్వామినీ!
రావణు, దైత్యులం జిదిమి లంకను భస్మమొనర్చుఁ బోరిలో 143

నేలపై నింగిపైనిఁ బాతాళమందు
నార్కి-యనుచరులకు నడ్డు నాఁకలేదు
సిద్ధపడియుందు రాతఁడు చెప్పినటుల
చేయఁగ విధేయతాస్ఫూర్తిఁ జీరికిఁగొని 144

వారలమితతేజశ్శాలులై రహింప
శ్రమనెఱుంగరు కార్య నిర్వహణమందు
సర్వభూమండలమ్మును, సాగరములఁ
గడచివచ్చి రాకాశమార్గమున మును పె! 145

వానరయోధులు బలతేజములయందు
నాతోసమానులు, సన్నుతించు
వారె; సమర్థులె! వారిలో నాకేమి
తీసిపోరెవ్వరు దిట్టలంత
తేలికగా వచ్చితిని నేనె? యిఁక వారి
సంగతిఁ జెప్ప విశంకటమ్మె!
పంపరెవ్వరు గొప్పవారి నెక్కడికిఁద
క్కునవాఁడనే సౌట పవిత్రసూతి
నన్నుఁ బుత్తెంచె నిటకు వానరులు వచ్చె
దరు భుజమ్ములపై నేను దాశరథుల
మోసికొని తెచ్చెదను నమ్మమో జననీ!
నీకు శోకింపఁ బనిలేదు నేఁటినుండి 146

పురుషసింహులు దశరథపుత్రు లరుగు
దెంచి తమ వాడి శరములఁ దీవరించి
లంకవిధ్వంస మొనరించి రాక్షస సహి
తముగ దశకంఠు వధియించెదరు మహీజ! 147

నిన్నయోధ్యకుఁ గొనిపోవు నీరజాక్షుఁ
డంతవఱకు నోపికపట్టు మమ్మ! నీవు
చంద్రు రోహిణి చేరెడి చందముగను
బొందెదవు రామచంద్రునిఁ బూతచరిత! 148

అనుచువచ్చఁ బలికి హనుమంతుఁడాపయి
మరల నందుకొనియె మహిసుతఁగని
యామె స్వాంతమందు ననుమావలేశమ్ముఁ
దొలఁగఁజేయఁ గోరి ధూర్వహుండు 14

లంకాపట్టణ దేహళిన్ నిలిచెదిన్ రాముండు సౌమిత్రితో
నంకా పొంకములన్ సబాంధవముగా నా రావణున్ జంప, నీ
సంకోచమ్ము నివృత్తి యౌనుమి ధనుష్టంకారముల్ విందువో
పంకేజానన! నాతికాలమున విశ్వాసమ్ముతో నుండుమా! 15

దంష్ట్రిలు, నఖమ్ములును నాయుధమ్ములైన
వ్యాఘ్రపంచాస్యముల మించు వానరులను,
బర్వతాకారులను, నీలవారిదసము
లను, బరభయంకరులఁ జూడననువు పడును 151

రాముఁడుఁ గృశించు నట వలరాజుకాఁకఁ
బరితపించుచు సింహము వాతపడ్డ
సామజము చందమున నవస్థలకుఁ జిక్కి-
బెంగమానుము - శోకింపఁ బేర్మికాదు 152

జంభవైరినిఁ బౌలోమి చందముగను
గలిసి రామునితోడ సుఖమ్ముఁబొందఁ
గలవు రాఘవు కద్దియౌఘుఁడులేఁడు
మూడులోకాల సౌమిత్రిఁ బోలఁడెవడు 153

వహ్ని వాయువులందు సాటి వాడు దేవి!
యాతుధానులతోడ భయంకరముగ
నున్న నీ ప్రదేశమున నీవుండ వెంతొ
కాల మనఘుఁడు వచ్చు నీకై రయముగ 151

నేను తిరిగిపోయిన తోడ నీరజాక్షి!
దరుగుదెంచు సేనలతోడ ననుజుఁగలిసి
వేచియుండుము మల్లెల వేళవచ్చు ॥
ననుచు సీతకు హనుమ ధైర్యమ్ముఁ జెప్పె 155

అంతక్షమాకుమారి హృదయమ్మునఁ బ్రీతిజనించె" నో హనూ
మంత! నినున్ గనుంగొనగ మానస విస్మయసంభ్రమమ్ము మత్
స్వాంతము వర్షపాతమున సస్యపు మొక్కలతోడి భూమివై
కొంతకుఁగొంత నాననట కూడ నటించి ప్రమోదమయ్యెడిన్ 156

తుకతుక దుఃఖశోకములతోఁ గృశియించెడి రాఘవేంద్రునిన్
సకల గుణాభిరాము నరుసంబుగ నే స్పృశియింపఁగల్గగా
లికగలనీదె బాధ్యత మహీసుతచిత్తుడు భ్రమించి నా
వికలత సర్వమున్ దొలఁగు విజ్ఞుఁడ నీవని నిర్వహింపుమా! 157

కరటము కన్ను బెకల్చిన కథ గుర్తు
గావచించితి వేరొకటిని దెలుప
చెరిగెను నే ధరించిన తిలకమ్మొక
నాఁడు నా ధవుఁడు విన్నాణముగను

మరల నానుదుటిపై మణిశిలతోఁ దిల
        కముదిద్ది బుగ్గపై క్రమముగను
చుక్కనునిల్పె నీ చక్కని సంగతి
        గుర్తుగాఁ దెలిపిన నార్తితొలఁగు
వరుణమఘవులతో సాటివచ్చు ధవుఁడు
రావణాపహృతయగు నీ రమణి, నన్ను
రాక్షసాంగనలిటుల నా ప్రాణములను
దోడుచుండ సహించునే? ద్యోతకమ్మొ! 1

పొంగివచ్చు దుఃఖముతోడఁ బుడమిపట్టి
గండములపైని బాష్పముల్ కదలు కొనగ
నెలుఁగు రాల్పడ ధవునితో తెలుపుమాంజ
నేయు, నాబాధలను గమనింపలేదె ? 1.

ఈ చూడామణి నొక్క పెన్నిధిగ నేనెంతున్ సుమా! నాధ! నే
నీ చూడామణిఁగాంచినన్ మరల నిన్నే చూచుచున్నట్లుగా
దోఁచున్ నా హృదయమ్మునన్ దనుజులన్ ద్రుంచంగ రావేల? నీ
కౌచిత్యమ్మె సతిన్ నిశాచరుల మధ్యన్ పీడి శోకింపఁగన్ 1(

ఈ మహోత్తమ రత్నమ్ము నిపుడు నీకుఁ
బంపుచుంటిని-మిగులును వంత యొకటె
నాకు నిఁక మీఁద-ముసురును చీఁకటు లెటు
బ్రదుక గలుగుదుఁజెప్పుమో ప్రాణనాథ! 1(

ఉనుఱు బోకసెల మాత్రమే యుండు పేన
ననట నిసువీడి బ్రదికియుండన-దశాస్యుఁ
డెంతొ దుర్వృత్తుఁడహితుఁడు నిత్వరుండు
సలుపుచుండు దురాలోచనలు సతమ్ము ! 162

తెలిపె మారుతి నీ పరిస్థితినిఁగాంచి
యుచ్చముగ నీవు చింతించుచుంటి వనుచు
కనుక జీవింపలేనొక క్షణముఁగూడ"
తొందరగఁదీసికొని పొమ్ము ధూర్వహతను 163

సీతావాక్యములాలకించి నుడివెన్ ఔద్ధ్యాటుతో వానరుం
డో తల్లీ ! తపియించు నీధవుఁడు నెంతో శోకమున్ బొందుచున్
చైతన్యమ్మును గోలుపోయి మఱచున్ సర్వమ్ము-సత్యమ్ముపై
బ్రాతిన్ నే శపథమ్ముఁజేసి నిగదింపంజాలుదున్ నమ్మమా ! 164

రాముని దుఃఖమున్ గనుచు లక్ష్మణుఁడున్ దపియించుచుండె నీ
ధామము పూర్వపుణ్యమున తల్లి ! యెటింగిలి-వీడి శోకమున్
దీమసమున్ నహించుము మదిన్-తొలఁగున్ సుమి సర్వదుఃఖముల్
ప్రామిడి రావణున్ జెనఁకి రాముఁడు నిన్ గొనిపోవు శీఘ్రమే 165

తప్పక రామలక్ష్మణులు ధ్వంసమొనర్తురు లంక సర్వమున్
కుప్పలు కుప్పలై ధరణిఁగూలుదు రాశరులంత, వానరుల్
చొప్పడ-రావణుండొటగు-నూడు తొలంగును నీధవుండు నిన్
మెప్పుగ స్వీకరించును సుమీ ! జగముల్ స్తుతియింపఁజేర్మిమై 166

అంచితురాల ! కష్టముల కంతము వచ్చిన యట్లె నీవు భా
వించుము-నాకు నీవు కనిపించితి వేదెటులైన నీకు శో
కించగ నెట్టి హేతువు లగించదు-తాళుము కొంతకాలమా
వంచకుఁడీల్గు రాఘవుని బాణములన్ బరికల్పసమ్మ దే !"

అతిసులభమ్ముగా ననఘుఁడు నమ్మగా
దగుచిహ్నమేదైన తల్లి ! యిచ్చి
పంపుము నన్నని పావని యడుగంగ
జానకి వచియించె "శ్వసనపుత్త్రి !
నాశిరోరత్నమ్మె నమ్మించు రాముని
కంతకన్నను మంచి యానవాలు
నాకడలేదు వానరముఖ్య ! వేఱేది
దీని నాథుండు గుర్తించునయ్య !
నమ్మ నీ మాటలన్ని నిజ" మ్మటంచు
నని దృఢమ్ముగఁజెప్పిన హనుమ మణినిఁ
గొనుచు శిరసా నమించి యవనిజ సెలవు
నడిగి బయలుదేఱుచునుండ ననియెనామె

నాథుని, మఱఁదిని, వనచర
నాథుని, మంత్రులను నడిగినానని మఱి నా
బాధలు పీడగఁబలుకుము
నాథునితోఁబయనమందు నయమొనగూడున్

నా పరిస్థితి గుర్తించినావు కనుక
చూచితివిగాన రక్కసుల్ క్షోభపెట్ట
సర్వమెఱిఁగించి నాథుని సత్వరముగఁ
దీసికొని రమ్ము దుఃఖవార్ధినిఁదరింప 170

మాటలు వేయునేల ! హనుమా ! రఘువీరుని తోడ నీవు నా
పాటులఁదేటతెల్లముగఁ బాటవమొప్ప వచించి నాదు కీ
డ్పాటుఁదొలంచు యత్నమున డాంబికుఁడైన దశాస్యుఁబోరిలో
వాటముగా వధింప నిరవద్యునిఁదోడ్కొని వేగ రాఁగదే ! 171

కపివరా ! వీడుకొని విరాఘాటముగను
నీప్రయాణము సాగింపుమీ ! ప్రతిష్ఠ
కై రఘూద్వహుఁడరుదెంచి కసిమసంగ
వలయు దశముఖు లేదంతవఱకు శాంతి 172

హనుమంతుండు ప్రయోజనమ్ము తనకార్యంబందు సిద్ధింపగన్
మనమందున్ గడు తృప్తిఁజెంది వెదలన్ క్ష్మపుత్రి వీడ్కొంచు హె
చ్చిన సంతోషముతో నుదీచి ముఖుఁడై చేయన్ ప్రయాణమ్ముఁ దా
వసుధావస్త్రు వెలార్చి సిద్ధపడెఁ బర్యాలోచనం జేయుచున్ 173

సుందర విజయము - ప్రథమ భాగము

సంపూర్ణము

---

# స వ రిం త లు

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 22 | 71 | 4 | గాడు | గాను |
| 29 | 98 | 1 | సామీరి । | సామీరి |
| 35 | 123 | 4 | ధూర్వహూతను | ధూర్వహూతను |
| 36 | 126 | 1 | గెల్చితినేనె | గెల్చితివేనె |
| 40 | 140 | 2 | జవనిమన | జవనిమను |
| 45 | 4 | 6 | ఖరూర | ఖర్జూర |
| 48 | 14 | 5 | రావణుఁదలని | రావణుఁదలని |
| 78 | 111 | 2 | గ్నలగ | గ్నలుగ |
| 84 | 132 | 9 | శ్రద | శ్రద్ధ |
| 92 | 9(a) | 2 | మహాత్మ్యలును | మహాత్మ్యలు |
| 104 | 48 | 4 | రావణుఁటంచు | రావణుఁడటంచు |
| 106 | 54 | 3 | మెట్టుపై | మెట్టుపై |
| 110 | 66 | 2 | రళశలగుచు | రవళలగుచు |
| 110 | 69 | 2 | తేమ | లేమ |
| 112 | 74 | 4 | లెక్కసేయడు | లెక్కసేయడు |
| 124 | 114 | 1 | జీవించిన | బ్రదికిన |
| 131 | 136 | 3 | బట్టె | బట్టి |
| 132 | 141 | 10 | కృత్రిమమ్ముగు | కృత్రిమమ్మగు |
| 133 | 142 | 2 | జుటు | జుట్టు |
| 141 | 2 | 1 | యింద్రజుఁడుగు | యింద్రజుఁడగు |
| 152 | 39 | 4 | రావణుండవి | రావణుండని |
| 163 | 77 | 7 | యుపనూనముగ | యుపమానముగ |
| 164 | 78 | 10 | రాసులతో నుండ | రాసులతో నుండె |
| 172 | 112 | 9 | మందరగికి | మందరగిరికి |

| పుట | పద్యసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 178 | 133 | 3 | బేర్పడు | జేర్పడు |
| 184 | 158 | 4 | తిందప్పను | నీతిందప్పను |
| 189 | 178 | 3 | నెన్చెలు | నెచ్చెలు |
| 193 | 191 | 2 | నొంచు | గొంచు |
| 194 | 194 | 9 | రాముఁచు | రాముఁడు |
| 195 | 199 | 1 | విరతము | నిరతము |
| 195 | 201 | 2 | దు | దుః |
| 197 | 6 | 4 | యెన్నడున్ | యెన్నదేన్ |
| 202 | 20 | 4 | బ్రయపతి | బ్రిసుపతి |
| 205 | 33 | 2 | స్రాప | స్రొప్ప |
| 205 | 34 | 3 | వ్రజముల | స్రజముల |
| 211 | 49 | 1 | బర్వతమ్ము | బర్వతము |
| 212 | 52 | 4 | సరితాస | పరితాప |
| 215 | 60 | 3 | గామండి | గానుండి |
| 226 | 98 | 5 | బృహాప్పతి | బృహాస్పతి |
| 227 | 99 | 1 | ననజేక్షణ | వనజేక్షణ |
| 233 | 123 | 7 | మమ్మథార్తి | మన్మథార్తి |
| 233 | 124 | 4 | పబుకగ | పలుకగ |
| 236 | 9 | 8 | నన్వి | నవ్వి |
| 240 | 19 | 3 | జార్చినని | జార్చినవి |
| 251 | 62 | 4 | ఘనురోధించిన | ననురోధించిన |
| 258 | 78 | 10 | జేర్పెదవని | జేర్చెదవని |
| 258 | 79 | 1 | నేగము | వేగము |
| 263 | 94 | 2 | మర్పించెదన్ | సమర్పించెదన్ |
| 266 | 103 | 1 | కోసమున | కోపమున |